# వ్యాసమాల

శిరోమణి

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి

**Proficient in oriental learning**

తెలుగు పండితుఁడు, మహాబూబ్ కాలేజీ

సికింద్రాబాద్



పబ్లిషర్సు:

వేంకట్రామ అండ్ కో.

3993 మార్కెటువీధి,

సికింద్రాబాదు (దక్కన్)

వెల రు 0–8–0

TO

M. R. Ry.

M. HANUMANTHA ROW NAIDU GARU,

B.A., L.T.,

Principal, Mahboob College, Secunderabad.

This book is respectfully dedicated.

# ఉపోద్ఘాతము



ఆంధ్రభాషలో నున్నత పాఠశాలా విద్యార్థిజనోపయోగార్థము సామాన్య విషయములఁ (general subjects) గూర్చి వ్రాయఁబడిన వ్యాసములు చాలా తక్కువ. ఇందు నేను గూర్చిన విషయములు సామాన్యముగా స్కూలుఫయినలు విద్యార్థులకుఁ బరీక్షాపత్రములలోవచ్చు విషయములే. నాలుగైదు మఱియుపన్యాసములఁగూడా చేర్చితిని. విద్యార్థులకు వీని వలనఁ జాలా మేలుకలుగునని నా యాశయము. వ్యాసములతోపాటు చివర నాంగ్లభాషయందువలె నాంధ్రమునందును Paraphrase చేయించుటకు నా వ్రాసిన కావ్యమంజరి, పుష్పాలతోఁట గ్రంథములలోని పద్యముల నుదాహరించితిని. ఈ నూతనపద్ధతివలన బాలురకుఁ గవిత్వాభిరుచినిఁగూడ గలిగింప వచ్చును.

ఇట్టి గ్రంథము లేకపోవుటవలన బోధించుట కుపాధ్యాయులును, నేర్చుకొనుటకు విద్యార్థులును క్లేశపడుచున్నారని నా యనుభవమువలన గ్రహించితిని. నాకుఁగల యత్యల్పమగు

శక్తితో విద్యార్థిజనోపయోగార్థ మీ గ్రంథము రచించితిని. నాయీ ప్రయత్నము సఫల మయ్యె నేని ద్వితీయ ముద్రణ మున మరికొన్ని వ్యాసములఁ జేర్తును.

గ్రంథరచన కుపకరించిన గ్రంథములు.

1. మనుస్మృతి, 2. గౌతమ ధర్మసూత్రములు, 3. గీతా రహస్యము, 4. ఉత్తరరామ చరిత్రము, 5. సిద్ధాంతకౌముది, 6. భర్తృహరి సుభాషితము, 7. ఆంధ్రమహాభారతము, 8. ఆంధ్రమహాభాగవతము, 9. కావ్యమీమాంస, 10. హితోపదేశము. ఈగ్రంథకర్తల కెంతయుఁ గృతజ్ఞుఁడను.

ఈ గ్రంథమును దయతోఁ బ్రకటించినందులకు వేంకట్రామ అండుకో, వారికి నాకృతజ్ఞతను జూపుచున్నాను.

గ్రంథకర్త.

18/3

# విషయసూచిక



# వ్యాసమాల.

## 1. భక్తి.



రాజాజ్ఞాబద్ధులై కింకరులు దండభీతివలనఁ గాలాతిక్రమణ దోషాభిభూతులు గాకుండ నియతకార్యము లాచరించునట్లు సూర్యచంద్రాగ్ని వాయ్వాది మహాభూతములును స్వస్వనియత కార్యములను గాలవ్యత్క్రమణము గానివిధమునఁ దిన్నఁగా జరుపుచుండుటఁ బట్టి యీభూతములకు నియామకుఁడగు నొక మహాపురుషుఁ డున్నాఁడని ప్రపంచమునందలి యెల్ల మతములవారును గ్రహించి యీమహాపురుషునిఁ దెలిసికొనుటకుఁ బ్రయత్నములు సేయుచున్నారు. దృగ్గోచరుఁడు కాని యీమహాపురుషునిఁ దెలిసికొను మార్గములు వారివారి జ్ఞానానుభవములను బట్టి నిర్ణయింపఁబడెను. వారు మార్గములను భిన్నముగా బ్రతిపాదించిరి కాని యీ పురుషుఁడొక్కఁడే యనియుఁ బెక్కండ్రు లేరనియు నాతనిఁ దెలియుటయే జీవితలక్ష్యమనియు మాత్ర మైకకంఠ్యముగా విస్పష్టపఱచిరి. ఎట్లన హిందూదేశస్థు లెల్లరును స్వరాజ్యమును గోరుచున్నారు. ఎవ్వరును వలదనుట లేదు. కాని భిన్నభిన్నపక్షములవారు గలరు. కొందఱు మితవాదులు (Moderates) కొందఱు అతివాదులు లేక జాతీయవాదులు (extremists or nationalists) కొందఱు ఉదారాశయులు

(liberals) కొందఱు స్వతంత్రవాదులు. (independants) సాధ్యమును లక్ష్యభూతమునగు స్వరాజ్యమును బ్రాపించుటకు వారేర్పఱచుకొన్న మార్గములు భిన్నములు కాని యెల్లరకును లక్ష్యమొక్కటియే. అట్లే యెల్లమతస్థులకును లక్ష్యమొక్కటియే.

కనుకనే యెల్లమతస్థుల మూలధర్మములును సమానములు. అవి యహింస, సత్యము, అస్తేయము, శౌచము, ఇంద్రియ నిగ్రహము. వీని నెల్లమతములవారును మతమునకు మూలధర్మములుగా నంగీకరించిరి. హిందువులు వీనిని సనాతన ధర్మములని యందురు. వీనిని నిర్వహించు నితరధర్మములాయామతస్థులకు భిన్నభిన్నములు. (ఏతద్వివేచనము "మతములు" అను వ్యాసమునఁ జేయఁబడును.)

ఆమహాపురుషుఁ డెవ్వఁడు ? ఆతనికి నామరూపములు లేవు. ఏలన నాతఁడింద్రియగోచరుఁడుగాఁడు. అణువుకన్న నణుతరుఁడు. మహత్తుకన్న మహత్తరుఁడు. పిపీలికాది బ్రహ్మపర్యంతమగు నెల్లవస్తువుల నున్నాఁడు. వానికంటె భిన్నుఁడుగ నున్నాఁడు. వేదమాపరమేశ్వరుని నిర్వచింపఁజాలక నేతినేతి వాక్యముల ననఁగా "నీవస్తువీశ్వరుఁడుగాఁడు. ఈవస్తు వీశ్వరుఁడుగాడు" అని ప్రతివస్తువును నిర్దేశించి చూపుచు నిషేధించుచు నీవస్తువు లన్నింటికంటె భిన్నుఁడుగా నున్నాఁడని చెప్పుచున్నది. జననమరణ సుఖదుఃఖాది ప్రపంచధర్మములాతనికి లేవు.

అతఁడచ్ఛేద్యుఁడు, అదాహ్యుఁడు, అక్లేద్యుఁడు, అశోష్యుఁడు, అచలుఁడు, నిత్యుఁడు, సనాతనుఁడు. అట్టివానికి నామరూపములను నిర్ణయించుటెట్లు? కనుక నాతనినిఁబర బ్రహ్మమనిరి. పరబ్రహ్మ మన నన్నింటికన్నఁ బెద్దది. అనఁగా నేవస్తువుకన్న లోకములోఁ బెద్దదియు శక్తిగలదియు లేదో యది పరబ్రహ్మ మనఁబడును. వానినే పరమేశ్వరుఁడనియుఁ, బరమాత్మయనియుఁ బెక్కుపేళ్ల వ్యవహరింతురు. పర మత స్థులును దేవునిఁగూర్చి యిట్టి యర్థముగల పదములనే వాడుదురు.

అట్టి లక్ష్యభూతుఁడగు పరమేశ్వరు నెఱుంగుటెట్లు? మనహిందూదేశస్థు లాయతీంద్రియుఁడగు భగవంతునెఱుంగు టకుఁ దెలిపిన మార్గములు మూఁడు. 1. జ్ఞానమార్గము 2. కర్మ మార్గము. 3. భక్తిమార్గము.

జ్ఞానమార్గమనఁ బురుషుఁడు సాధన చతుష్టయ సంపత్తి (నిత్యానిత్యవస్తు వివేకము, ఇహాముత్రార్థ భోగవిరాగము, శమదమాది సాధన సంపత్తి, ముముక్షుత్వము,) నార్జించి జితేంద్రియుఁడై సన్న్యసించి తపోనిష్ఠాగరిష్ఠుఁడై బ్రహ్మజ్ఞాన సంపన్నుఁడై జ్ఞానాగ్నిచేఁ బాపపుణ్య క్షయముఁజేసి బ్రహ్మ సాక్షాత్కారమును బడసి ముక్తిఁగాంచుట.

కర్మమార్గమనఁ బురుషుఁడు గృహస్థవృత్తియందుండి వేదవిహితకర్మలను శ్రద్ధాపూర్వకముగా ననుష్ఠించుచు

సత్త్వశుద్ధినిఁబొంది తత్కాలమున జ్ఞానమార్జించి మోక్షమును బొందుట.

భక్తిమార్గమునఁ బురుషుఁడు పైనిఁదెలిపిన నామరూపశూన్యునకు నామరూపములు గల్పించి శ్రద్ధాపూర్వకముగాఁ బూజాదులు నిర్వర్తించుచు సత్త్వశుద్ధిని, దానివల్ల జ్ఞానమునుబొంది మోక్షముఁబడయుట. ఇదియే విగ్రహారాధనము. జ్ఞాన కర్మమార్గములు రెండును వేదోక్తములు, భక్తిమార్గము పౌరాణికము.

జ్ఞానకర్మ భక్తిమార్గములు మూఁడును అధికారి తారతమ్యమునుబట్టి యేర్పఱుపబడినవి. సర్వసంగపరిత్యాగిౖయె సన్న్యసించి ద్వంద్వములను జయించి బ్రహ్మవిచారణ సేయలేని యలసులు గృహస్థమార్గముననుండి ఫలాభిసంధి శూన్యముగాఁ గర్మలు సేయుచుందురు. ఆ వేదవిహిత కర్మానుష్ఠానమును దిన్నఁగా సాగింపలేని మందులు భక్తిమార్గమున నీశ్వరారాధనము సేయుదురు. దానినిఁగూడ సరిగా నాచరింపఁజాలని సోమరులీ కాలపు భజన మార్గము ననుసరింతురు.

భక్తియనఁగానేమి? "సా (భక్తిః) పరానురక్తిరీశ్వరే" అని శాండిల్యసూత్రము. ఈశ్వరుని యందలి నిరతిశయ ప్రేమయే భక్తియని యర్థము. నిరతిశయమే కాక నిర్హేతుకమనియు ననవలయును. అహేతుకమగు భక్తి చిత్తశుద్ధి మూలకముగా ముక్తిసాధనమగును. సహేతుకభక్తి యట్లు

గాదు. పరమేశ్వరస్వరూపమును ప్రేమచేనాకళించుకొని మనస్సును దదాకారముగాఁ జేయుటయే భక్తియని సారాంశము. దీనినే యుపాసనయందురు.

పరమేశ్వరునికి రూపమేమి? సర్వజగత్తును బరమేశ్వరమయమే. శివవిష్ణ్వాది విగ్రహములన్నియు నీశ్వర రూపములే. వీనిలో నెవ్వరి హృదయమున కేరూపమునచ్చిన దానిని మనస్సునందుంచి యుపాసన సేయవలయును. కానీ యీ సర్వవిభూతియు మూలమునందొకటియే యని మాత్ర మూహింపవలయును. వారివారి యిష్టానుసారముగా నెన్నెన్నో నగలు రోకులు చేయించుకొనుచున్నను స్వర్ణమొక్కటియే యయినట్లు శివవిష్ణ్వాది నానావిభూతులతోఁ గనఁబడుచున్నను నీశ్వరుఁడొక్కఁడేయను భావమును గలిగియుండవలయును. కనుక శైవవైష్ణవాదులు స్వస్వదేవతాధిక్యముకొఱకు వివాదపడుట యయుక్తము. ఈభక్తి మార్గానుసారముగ సాలగ్రామము, శివలింగము, శ్రీకృష్ణాదుల మూర్తులు మొదలగునవి చిత్తప్రవృత్తిని బరమేశ్వరుని వైపునకు వంచుటకు సాధనములగును. ఆమూర్తులలోమాత్రమే యున్నాఁడనుకొనుట వెట్టి. కేవల దేవాలయములందుఁగాని దేవతల యొక్క మూర్తులయందే కానీ తారకత్వమున్నయెడల ముక్తి లభింపవలయును. అట్లు లభింపదు. పరమేశ్వరుని యందలి నిర్హేతుకమగు భక్తియే మోక్షసాధనమగును.

శ్లో. సర్వభూతేషు యః పశ్యే ద్భగవద్భావ మాత్మనః
భూతాని భగవత్యాత్మ న్యేష భాగవతోత్తమః.

ఎవఁడు సర్వభూతములందును భగవద్భావమును గాంచుచున్నాఁడో యెల్లభూతములును భగవంతునియందున్నవని భావించుచున్నాఁడో వాఁడు భాగవతోత్తముఁడు లేక భక్తుఁడు. ఎవనికి నెల్లవస్తువులును వస్తువులుగాఁగాక వానియందలి యీశ్వరాంశమే గోచరించునో వాఁడే భక్తుఁడని సారాంశము. అట్టి భక్తుల యోగక్షేమములను భగవంతుఁడు చూచుచుండును.

"శ్లో. తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం"

ఆనాభక్తుల యోగక్షేమమును నేను జూతును అని శ్రీకృష్ణుఁడు భగవద్గీతలోఁ జెప్పుచున్నాఁడు.

కొందఱు పరమేశ్వరుఁడు మనపైఁ జూపుచున్న కనికరమునకు మనము కృతజ్ఞత చూపుటయె భక్తియందురు. అదియుఁ సముచితమే. పరమేశ్వరుఁడు మనల నేమికనికరించుచున్నాఁడని యందురేమో? వినుఁడు. అనేకసంకటములలోఁ బడఁబోవు మనలఁ బడనీక హృదయములను వెనుకకు లాగుచున్నాఁడు. మనబుద్ధిలోఁ బ్రవేశించి "యిదిమంచి! యిదిచెడ్డ; దీనివలన లాభము; దీనివలననష్టము "అనిబోధించుచున్నాఁడు. ప్రమాదమునఁ బడితిమో మనల నుద్ధరించుచున్నాఁడు. తనమహిమ నెఱుఁగుటకు సను స్తేంద్రియముల నిచ్చియున్నాఁడు.కూఁడుగుడ్డలిచ్చి యీవిధముగా మేలుగూర్చు

చున్నాఁడు. ప్రతివాఁడును దనస్థితిగతులఁ బరిశీలించుకొని తనకన్న నెల్ల విధముల హైన్యమనుభవించు బధిరపంగ్వంధ భిక్షుకాగులఁ బరీక్షించి చూచినచోఁ బరమేశ్వరునకుఁ మనపై నెంతప్రేమయున్నదో మనకెన్ని మేళ్లు గూర్చుచున్నాఁడో స్పష్టము కాఁగలదు. ఆతనియట్టి యనుగ్రహమును సంపాదించుటకుఁ దా నేంత పూర్వజన్మమున నీశ్వరారాధనముఁ గావించెనో యదియుఁ దెలియఁగలదు. అట్లే తనకన్న నధికుల పరిస్థితులతోఁ దనపరిస్థితులఁగూడా పరికించి తొంటి జన్మమున వారెంత భగవదారాధనమును జేసి తదనుగ్రహమును బడిసిరో తెలిసికొన్నచోఁ దానారాధింపఁదగిన యావశ్యకతయు గోచరించును. మనలఁ బెంచిపెద్దవారినిగాఁ జేసి సంకటములనుండి తొలగించి విద్యాబుద్ధులు నేర్పి పెక్కుమేళ్లుగూర్చిన తల్లిదండ్రులయెడ నెట్టి కృతజ్ఞత సూపవలయునో వారికన్న నెన్నోరెట్లధికుఁడగు పరమేశ్వరునియెడ నెన్నోవేలరెట్లధికమగు కృతజ్ఞతను జూపవలయును. కనుకఁ బరమేశ్వరుడు మనకొనర్చిన మేళ్లకుఁ గృతజ్ఞత సూపుటయే భక్తి. అనఁగానాతనినిఁ బ్రేమించి యుపాసనసేయుట.

శ్లో. శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్.
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనమ్.

భగవన్నామ శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము అని భక్తి తొమ్మిది విధములు.

జ్ఞానయోగమున సాధకుఁడు మర్కట కిశోరన్యాయముగాఁ దానే యీశ్వరునిఁ బట్టుకొనవలయును. భక్తియోగమున మార్జాల కిశోరన్యాయముగా నీశ్వరుఁడే సాధకునిఁబట్టుకొనియుద్ధరించును. కనుకనే,

శ్లో. అంతర్యశ్చ ముముక్షుభిర్నియమిత ప్రాణాదిభిర్మృగ్యతే
సస్థాణు స్థిరభక్తి యోగసులభో నిశ్శ్రేయసాయాస్తువః.

జ్ఞానులాతనిని వెదకుదురనియు భక్తుల కాతఁడు సులభుడనియు, గాళిదాసు. జ్ఞానకర్మ యోగములవలంబింప బ్రాహ్మణ క్షత్రియులే యధికారులని వేదము నొడువుచున్నది. భక్తియోగమట్లు గాక యెల్లరకును నీశ్వరప్రాప్తిఁ గూర్చును. భగవద్గీతలో శ్రీకృష్ణుడు.

శ్లో. మాంహి పార్థవ్యపాశ్రిత్యయేపిస్యుః పాపయోనయః
స్త్రీయో వైశ్యాస్తథాశూద్రాస్తే పియాంతి పరాంగతిమ్.

నన్నాశ్రయించిన స్త్రీలు, వైశ్యులు, శూద్రులు, అంత్యజులు మొదలయిన పాపయోనులును ముక్తినిఁ బొందుదురు అని చెప్పియుండెను. మొదటినుండియుఁ గృతజ్ఞతనూపని యొక భక్తుడు పశ్చాత్తప్తుఁడై తన కృతఘ్నతను క్షమింపఁ బర మేశ్వరునిట్లు ప్రార్థించుచున్నాఁడు.

మ. నినుదర్శింపనె నీయొసంగుకనులన్ నీయన్యముంజూచుచుం
టిని; నిన్నే నిలుపంగ నిచ్చినమదిన్ నీభిన్నమున్ నిల్పుచుం
టిని; నీపూజకె యిడ్డహస్తయుగమున్ నేలాఁతిఁ బూజింపఁగా
వినియోగించి కృతఘ్నతన్ నెఱపితిన్ విశ్వేశ! మన్నింపుమా!

గీ. నీవొసంగు జీతబత్తెముల్ నెమ్మిఁగొంచు
నీదుకొలువును నొకనాఁడు నేనొనర్ప;
జీతమును నింకనాకు హెచ్చింపవనుచు
సిగ్గుదిగఁద్రావి నిన్ను దూషించుచుంటి.

మనుష్యుఁడు తనకు దైవానుకూల్యమున్నంతకాలమును బరమేశ్వరుఁడొకఁ డున్నాఁడను భావమును వహింపక కాని కాలమువచ్చి పౌరుషము వ్యర్థమయినపుడీశ్వర సేవ సేయఁబూనుట యుత్తమభక్తియనఁగా నిర్హేతుకభక్తిగాదు. మరియుఁదనకుఁ గలిగిన యాయాసంకటములఁ దప్పించి తన వాంఛల సిద్ధింపఁజేయ నీశ్వరున కుపాయనముల సమర్పింతునని మ్రొక్కుకొంటయు నుత్తమభక్తిగాదు. మానవుఁడు దన నీచబుద్ధిని భగవంతున కారోపించి లంచసంచములచేఁ దాను దృప్తుఁడైనవిధమునఁ దానిచ్చు ముడుపులు, టెంకాయలు మొదలగు లంచములకుఁ బరమేశ్వరుఁడు సంతృప్తుఁడై తన కోర్కెలీడేర్చునని భ్రమపడుచున్నాఁడు. ఇదియెంత యవివేకము!

మొదట ఫలమునుగాంక్షించియే పరమేశ్వరు నారాధింపఁగూడదు. సహేతుకమగు భక్తి మోక్షసాధకముగాదు. ఒకవేళ ఫలమునుగాంక్షించెనా చేసిన మేలునకుఁ గృతజ్ఞతనుగాపి కాంక్షింపవలయును. ఏనాఁడును నట్టికృతజ్ఞతఁ జూపక తన కాపదగలిగిననాఁడు భగవంతునకుపాయన మర్పింతునన్న నంత శీఘ్రముగా నాతనియనుగ్రహము గలుగునా? ఈశ్వరానుగ్రహ మంత సులభముగాదు. చూడుఁడు. మనుష్య

మాత్రుఁడగు నొక మహారాజుదర్శనము గావలయునన్న నతని యనుగ్రహముగలుగ వలయునన్న మనకెంతో కాలము పట్టును. అట్టియెడ నింద్రియాగోచరుఁడైన యాపరమేశ్వరుని యనుగ్రహము సంపాదించుటకే నాఁడో యొక టెంకాయను గొట్టినమాత్రమున నొకమ్రొక్కు మ్రొక్కినన్న మాత్రమునఁజాలదు. చిరకాలము సేవింపవలయును. మన మొక తియ్యని పదార్థమును భక్షించినపుడెంత మాధుర్యము, ఎంతయానందమును గలుగునో మనదారసుతాదులను గాంచినపుడెంత మోహము గలుగునో యిట్టియానందము అట్టిమోహము అట్టిమాధుర్యము, భగవన్నామోచ్చారణ సందర్శనములవలనఁ గలుగవలయును. అది నిజమైనభక్తి. నిర్హేతుకమైన భక్తి.

అట్టిభావ మెట్లుత్పన్న మగును ? ఆయుపాసనాక్రమ మెట్టిది ? యనఁ జెప్పెద. ఏకాంతమగు ప్రదేశమున శుచీభూతమగుచోట మిక్కిలి యున్నతమును మిక్కిలి నీచమునుగాని యాసనమునఁ గూర్చుండి శరీరమును, శిరస్సును, మెడయును దిన్నఁగానిలిపి దిక్కులఁజూడక యింద్రియముల నిరోధించి ప్రశాంత చిత్తముతోఁబరమేశ్వర రూపము నుపాసింపవలయును. బహిరంగ స్థలమునఁ గూర్చున్నచో మనస్సు బాహ్యవిషయములపైకిఁ బరుగిడును. వాగ్రూపముగా నఱచుచు నామోచ్చారణము సేయుచుఁ గాయికముగాఁ దావళములును దండలును ద్రిప్పుచుంట

మొదట మొదట బహువిషయములందు వ్యాపృతమయియున్న మనస్సును బరిమిత విషయములకుఁ దెచ్చుట కుపకరించినను దరువాతఁ దరువాత వానిని మానివేసి మానసికధ్యాన మొక్కటియే కావింపవలయును. మానసిక ధ్యానముననే పైనొడివిన యానందము మాధుర్యమును గలుగును. అభ్యాసమువలన నిట్టిమాధుర్య ముత్పన్నమగును.

ఎంతకార్య పరతంత్రులయినను దైవారాధనమును బరిత్యజింపరాదు. అధమాధమము సాయంప్రాతల నొక్కొక్క గంటయేని నీశ్వరోపాసన సేయవలయును.

భక్తిపేరితో దేవతాదర్శనార్థము నానాతీర్థయాత్రలు సేయనక్కఱలేదు. దేవాలయములకుఁ బోనక్కఱలేదు. పోవుటతప్పనికాదు. న్యాయ్యముగు భక్తిగలవానికి దేహమే దేవాలయము. దేవాలయము ముక్తిసొసఁగదు.

క. ఇందుగల డందు లేఁడని
సందేహమువలదు; చక్రిసర్వోపగతుం
డెందెందు వెదకిచూచిన
నందందే కలఁడు దానవాగ్రణి ! వింటే ?

అని ప్రహ్లాదుఁడు తన తండ్రితో నన్నాఁడు. పరమేశ్వరుఁడులేని ప్రదేశములేదు. మనకుముందు, వెనుక, ప్రక్కలఁ, బైనిఁ గ్రింద, నెల్లెడల నున్నాఁడు. అట్టివానిని మనము కనుఁగొనఁజాలక కస్తూరీమృగము తన నాభియం దున్న కస్తూరీపరిమళమును గ్రహింపఁజాలక నానాదిక్కులకును పరువిడునట్లు మనమును మనయొద్దనేయున్న పరమే

శ్వరుని మనస్సుచే ఆకళించుకొని ఆరాధింపలేక తీర్థయాత్రల కరుగుచు మన యవివేకమును బ్రకటించు చున్నారము.

మహాభక్తుఁడగు కబీరు "ఓ దేవా! నీవు దేవాలయమునఁ గూర్చుండియున్నచో నీవిశ్వప్రపంచ మెవ్వరిది ?" యనెను. కనుక నీశ్వరోపాసన కొఱకు దేవాలయములకు బోనక్కఱలేదు.

సాధారణముగా నీకాలమున మనము చేయుచున్న వ్రతాదులలో భక్తిశూన్యము. మనయింట నొకవ్రతమును జేయఁబూనితి మనుకొనుఁడు. దానికొఱకు దేవమందిరమును జిత్రముగా నిర్మించుట, దానినలంకరించుట, యా యా పదార్థములనుదెచ్చి పెద్దపెట్టున బంధుజాలములను బిలిచి మృష్టాన్నములు పెట్టుట, మంగళవాద్యములు, నృత్యగానములు జరిపించుట, మొదలగువానిచే నిజమగుభక్తియడుగునఁబడి బాహ్యాండోళనమేబడాయించుచున్నది. ధనము వెచ్చించి మనము భక్తినిఁ గొనలేము. ప్రశాంత మనస్కత వలనఁగాని పరమేశ్వర రూపము గోచరింపదు.

---

## 2. తీర్థయాత్రలు.

మనుష్యు లెల్లరు నీశ్వరాంశ సంభూతు లయినను జ్యోతియందలి మహత్త్వమును బట్టియు వారి వారి యమానుష చర్యలను బట్టియు లోకము కొందఱ నవతార

పురుషులఁగా నెంచునట్లు విశ్వమునందంతటను బరమేశ్వరుఁడు వ్యాపించియున్నను గొన్ని కొన్ని ప్రదేశములం దతఁడు విశిష్టముగా నావిర్భవించి దృగ్గోచరుఁ డగుచున్నాఁడని యాస్తికులగు నెల్లమతస్థులును విశ్వసింతురు. అట్టి ప్రదేశములు బుణ్యతీర్థములనియుఁ బుణ్యక్షేత్రములనియు వ్యవహరింపబడుచున్నవి. మన హిందూదేశమున నాసేతు హిమాచలము వఱకుఁ బరస్సహస్రసంఖ్యగల క్షేత్రములు గలవు. పరమతస్థులకుఁ గల పుణ్యక్షేత్రములకన్న హిందువుల పుణ్యక్షేత్రములే పెక్కులు గలవు. దీనినిఁబట్టియే హిందువులితరమతస్థులకన్న విశేషించి దైవభక్తిపరులని విశదమగుచున్నది.

హిందువుల పుణ్యక్షేత్రములు కాశీ. రామేశ్వరము, ప్రయాగ, శ్రీశైలము, హరిద్వారము మొదలగునవి. ఆయా స్థల పురాణములఁ బరికించినచో నేక్షేత్రమున కాక్షేత్రమే పుణ్యభూమియనియు, మిగిలినవి దానికన్నఁ దక్కువయనియు, నదియే సర్వశ్రేష్ఠమనియుఁ జెప్పఁబడును. మరియు నాయా క్షేత్రములకుఁ బోయి తీర్థోపవాసాదు లొనర్చి యచ్చటి నదీకాసారాదుల స్నానమాది తీర్థవిధులఁ గావించి యాదేవుని భజించినచో ననేక జన్మ కృతపాపములు తొలఁగి యఖండమైన పుణ్యము లభించుననియుఁ జెప్పఁబడును. ఈ విశ్వాసముతోడనే ప్రతివత్సరమును వ్యయప్రయాసల కోర్చి దూరదూరమున నున్న పుణ్యక్షేత్రములకుఁ గూడ జనులేగుదురు.

ఇట్టి నమ్మకము కేవల హిందూమతస్థులకే కాక క్రైస్తవులకు, మహమ్మదీయులకు, యూదులకుఁ, బారసీకుల

కును గలదు. ప్రతిసంవత్సరమును వేలకొలంది క్రైస్తవులు క్రీస్తుజన్మస్థలమగు జెరూసెలమునకును మహమ్మదీయులు మక్కాకును బోవుచుంట మనము చూచుచునేయున్నారము.

విగ్రహారాధనము మనదేశమున లోతుగా వేళ్లు దన్నినపిమ్మట ననఁగాఁ బురాణయుగముననే పుణ్యక్షేత్రములకుఁ బ్రాముఖ్యము సంభవించినది. శ్రుతులయందు గానీ శుచిత్వార్థములను ప్రతిపాదించు స్మృతులయందు గానీ పుణ్యక్షేత్ర ప్రశంసగానీ వాని మాహాత్మ్యముగానీ యావంతయు నగపట్టదు. ఇదెల్లయుఁ బురాణకర్తల స్వకపోలకల్పనలే. పురాణములుగూడ వేదోక్తధర్మములనే ప్రతిపాదించుననియుఁ గనుక బుణ్యక్షేత్ర ప్రశంసయు వేదోక్తమే యని సనాతనులందురు; కాని యది సత్యదూరము. పురాణములు వేదోక్తములు కాని వానినే విశేషముగాఁ బ్రతిపాదించుచున్నవని పెద్ద పెద్ద విద్వాంసులెల్లరు నంగీకరించియేయున్నారు.

పుణ్యక్షేత్రమనగాఁ బుణ్యభూమియని యర్థము. తీర్థము లిరుదెఱఁగులుగా నున్నవి. అవి యాభ్యంతరములు, బాహ్యములు. మనము సేవించుచున్న కాశీరామేశ్వరాదులు బాహ్యతీర్థములు. సత్యదాన తపశ్శౌచాదు లాభ్యంతరతీర్థములు. కాశీఖండములో నగస్త్యుఁడు లోపాముద్రకుఁ బుణ్యతీర్థములఁగూర్చి తెలుపుచు నిట్లు వాడివెను.

గీ. తీర్థములు మానసములు ముక్తిప్రదములు
తరుణి ! యివిమేలు బాహ్యతీర్థములకంటెఁ;
మానవుండివియేమఱి మధురవాణి !
బాహ్యతీర్థంబు లాడ నిష్ఫలము సూవె.

సీ. తీర్థంబు సత్యమింద్రియ నిగ్రహము తీర్థ
మనసూయ తీర్థంబు కనకగౌరి !
బ్రహ్మచర్యంబు తీర్థము; తీర్థము ధృతి
యమునుతీర్థము విద్రుమాధరోష్ఠి
సమత తీర్థము సువిజ్ఞానంబు తీర్థంబు
పుణ్యంబు తీర్థంబు పువ్వుఁబోఁడి!

గీ. తీర్థములు మానసంబులు ధీవిశుద్ధి
యతిశయిల్లంగ నివి యాడఁ కాడినట్టి
పంచజనులకుఁ గలహంస పక్షిగమన !
బాహ్యతీర్థావళులు తీర్థఫలమునీవు.

చ. బిసరుహ పత్రలోచన ! కృపీటములందు మునింగియాడవే ?
మొసళులు, మీలుఁ, గర్కటకముల్, కమఠంబులు, వాని కబ్బునే?
యసదృశమైన తీర్థఫలమట్టి విధంబుసుమీ ! తలంప మా
నసమగు తీర్థమాడని జనంబులకున్ బహుబాహ్య తీర్థముల్.

గీ. సుమతి యేటికి నంతర్విశుద్ధిలేని
బాహ్యసంశుద్ధి ? బహుతీర్థ పరిచయమున
వేయిగడవల జలమున వెలిఁగడిగినఁ
గలుగునే శుద్ధి ? వారుణీకలశమునకు.

గీ. రాగదోషమలాపహారక్షమంబు
మానసంబైన తీర్థంబు మంచగమన !
అవనిఁ బంకరజోవ్యపాయక్షమంబు
బాహ్య తీర్థంబు మెచ్చ రుత్పలదళాక్షి.

దీనిఁబట్టి యాభ్యంతరతీర్థ సేవలేనిచో బాహ్యతీర్థములు నిష్ప్రయోజనములు. అభ్యంతర తీర్థసేవ మాత్రముండి బాహ్యతీర్థ సేవ లేకున్నను హానిలేదని సారాంశము. కనుకనే యొకకవి "శుచిమనోయద్యస్తి తీర్థేనకిమ్" మనస్సు శుద్ధముగా నున్నచోఁ బుణ్యతీర్థములేల ? యని తెలిపెను. కనుక నాభ్యంతర తీర్థసేవ ముఖ్యతమము.

ఇప్పటికాలమున మనవారట్టిది లేకయుఁ గేవల బాహ్యతీర్థ సేవ సేయుచు వ్యర్థముగా ధన కాలవ్యయములు సేసికొందురు. అతిశయోక్తి విశిష్టముగాఁ గవితా దృష్టితోఁ బురాణకర్తలు వ్రాసిన యంశములనుఁ గేవల సత్యములనుగా మనవాండ్రు గ్రహించి వానిని విశ్వసించుచున్నారు. చూడుఁడు. తీర్థప్రాశస్త్యమును దెలుపుచు 'గురుతల్పగమనాదిసమస్తమహాపాతకములును నాతీర్థమునఁ గ్రుంకినచోఁ దొలఁగు' ననియొక చోటఁ జెప్పఁబడిన దనుకొనుఁడు. దానివలన మనుష్యునకొక ధైర్యము కలుగుచున్నది. తానెన్ని బ్రహ్మహత్యాది మహాపాపము లొనర్చినను నాతీర్థమునఁబోయి స్నానమాడినఁదన పాపములు తొలఁగించుకొన నగునని యనుకొనును. ఇట్టి వ్రాఁతలు పాపాచరణులకు వెన్నుచఱచి ధైర్యమును గొలుపుచున్నవి. మరియుఁ గేవల తీర్థసేవాదులవలన నేసర్వపాపములును దొలఁగి మహాపుణ్యము లభించు నెడల సాధనచతుష్టయ సంపత్తినార్జించి బ్రహ్మజిజ్ఞాసఁ జేయుచుఁ గడపట మోక్షమును బొందవలయునని బోధించు వేదాంతశాస్త్రము వ్యర్థముకదా !

పరమపురుషార్థమగు మోక్షమంత సులభ సాధ్యము యినచో నెవ్వరు పొందఁజాలరు ? ద్రవ్యమును వెచ్చించికొందమన్న స్వర్గమోక్షములులభింపవు. అట్లులభించు ననుకొంట మూఢ విశ్వాసము. అనుభవము వలనను జ్ఞానమువలనను మాత్రమే సర్వకర్మసంక్షయ మగునుగాని పుణ్యతీర్థ సేవలవలనఁగాదు.

పై దానినిఁబట్టి తీర్థయాత్రలు మూఢాచారములనియు వ్యర్థములనియుఁ దేలుచున్నది. పుణ్యతీర్థసేవను బోధించిన పురాణకర్తల యుద్దేశమిదియని నాయాశయము.

పూర్వము ప్రయాణసౌకర్యము లేనికాలమునఁ బురాణములు పుట్టినవి. ఆకాలమునఁ దీర్థయాత్రలు సేవింపవలయునన్నచో గాళ్లనడల చేతనే సేవింపవలయును. ఉపాయాంతరము లేదు. అట్టియెడ యాత్రికుఁడు తన తావునుండి బయలు వెడలి గ్రామైకరాత్రముగాఁ గడపుచు దొరకినపుడు కుడుచుచు దొరకనపు డుపవసింపుచుఁ బల్లెలుఁ బట్టణములు, అడవులు, పర్వతములు, నదులు, తటాకములును దాఁటుచుఁ గ్రూరమృగముల నడుమను సంచరించుచు నాయాతీర్థములను సేవింపవలసి యుండెను. అట్టి సంచారము వలన మనుష్యుఁడాయా దేశీయుల మతాచారవేష భాషాదులతోఁ బెద్దపరిచయ మలవఱచుకొనఁ గలుగును. కేవల పుస్తక పఠనమువలనఁ గలిగిన జ్ఞానముకన్నఁ బ్రత్యక్షానుభవము శ్రేయస్కరము. దేశసంచారమువలన మనుష్యుని సంకుచితాభిప్రాయములు తొలఁగును. ఉదారపద్ధతు లలవడును. అచ్చ

టచ్చటనున్న విద్వాంసుల పరిచయము లభించును. ఆత్మజ్ఞులగు నా యా మహాపురుషుల పరిచయభాగ్యమున మానవుని యజ్ఞానము క్రమక్రమముగాఁ దొలఁగును. కనుక నే "పురుషుఁడు దిరుగక చెడును. స్త్రీ తిరిగి చెడు" ననులోకోక్తి యేర్పడినది. తిరుగుటయనఁగా దేశసంచారమని యర్థము. తొలుతటి వారేర్పరచిన తీర్థయాత్రల ముఖ్యోద్దేశమిదియై యుండు నని నాయాశయము.

ఈకాలమున మనకుఁ బ్రయాణ సౌకర్యమధికముగా నున్నది. ఓడలు, ధూమశకటములు, విమానములు, మొదలగు వానివలన నెంతదొలనున్న పుణ్యక్షేత్రమును నత్యల్పకాలముననే మానవుఁడనాయాసముగా సేవించిరాఁగలఁడు. పూర్వము కాశికిఁ బోయివచ్చుటకుఁ బెద్దకాలము పట్టెడిది. "కాశికిఁబోయిన వాఁడును గాటికిఁబోయిన వాఁడును సమానుఁ"డని లోకోక్తియు నాకాలమునఁ గలిగినదే. ఇప్పుడట్లుగాదు. మనుష్యుఁడు భూగోళశాస్త్రము వలనను, వార్తాపత్రికల వలనను, దేశచరిత్ర పఠనమువలనను నాయాదేశీయులమతాచార వేషభాషాదులనెఱుఁగఁగలిగియున్నాఁడు. కనుకఁ బూర్వులు దీర్ఘయాత్రల కుద్దేశించిన ఫలమిప్పటివారికి గ్రంథపఠనము వలననే యుపలబ్ధమగుచున్నది. కష్టపడి మునుపటివలెఁ గాలినడకలచే దీర్ఘయాత్రలు గావింపనెవరును గోరుటలేదు.

పుణ్యక్షేత్రములన్నియు సామాన్యముగా నదీసమీపముననో పర్వతముల మీఁదనో యరణ్యముల నడిమిప్రదేశముననో యుండును. అట్టిదృశ్యములు నయనోత్సవదాయకములుగా నుండును. రోగికాయా ప్రదేశమునకు మార్చినచో నాయాజల వాయుసేవనములవలన వ్యాధులడఁగినట్లు మూఢునకును నాయాతీర్థసేవల వలన మనఃపరిణామము గలిగి చిత్తశుద్ధి యేర్పడవచ్చునని కొందఱందురు. అట్లు కలిగిన యెడలఁ బుణ్యయాత్రా సేవ దప్పక సేయవలసినదే. కానీ యట్లయిన వారు కోటికొక్కరేని నిక్కాలమున లేరు. ఆ దృష్టితోఁ దీర్థసేవ నెవరును గావించుట లేదు. తీర్థయాత్రల సేవించిన సర్వపాపక్షయమును పుణ్యము లభించుననియు దానివలన స్వర్గము చూఱఁగొనవచ్చుననియు నమ్ముచున్నారు. యాత్రలు సేవించివచ్చిన ప్రతివాఁడు దాను బాపముక్తుఁడనైఁ బులుగడిగిన ముత్తెమనైతినని విశ్వసించుచున్నాఁడు. స్వర్గమోక్షములును గరతలామలకములుగా నున్నట్లెంచును. అది చాలఁ బొరపాటు, స్వర్గమోక్షములఁ గోరువాఁడాభ్యంతర తీర్థసేవ సేయవలయును. కనుక తీర్థయాత్రా సేవ పుణ్యలాభ దృష్టితోఁగాక దేశసందర్శనాభిలాషతోఁ గావింపవలయును. గ్రంథపఠనము వలన నాయాదేశీయుల యెల్లవిషయములు దెలిసినను బ్రత్యక్షముగాఁబోయి యాయాప్రదేశములు చూచుటవలన విజ్ఞానమతిశయించును.

---

# 3. శాకాహారము - మాంసాహారము.

సాత్త్వికాహార మనియుఁ దామసాహార మనియు నాహార మిరుతెగలుగా నున్నది. సత్త్వగుణవర్ధకమగు నాహారము సాత్త్వికాహారమనియుఁ దమోగుణవర్ధకమగు నాహారము తామసాహారమనియు వ్యవహరింపబడును. మానవుని మనఃప్రకృతి సత్త్వరజస్తమో మయమగు త్రిగుణాత్మకముగా విభజింపఁబడి యున్నది. సత్త్వమనఁగా మనస్సుయొక్క ప్రకృతిభావము, అనఁగాఁ గామక్రోధాద్యభిభూతముగాని శమసంపత్తిగల మనస్సుయొక్క యవస్థా విశేషము. కామక్రోధాదుల నతిశయింపఁజేసి యైహిక వాంఛలఁబెంచి శరీరినిఁ బశుతుల్యునిఁగా జేయు మనస్సుయొక్క యవస్థావిశేషము తమము. రాజసాహారముగూడ సాత్త్వికాహారముగఁ గొంతవఱకు వ్యవహరింప వచ్చును. కావుననే యాహారము నిరుదెగలుగా భాగించితిని. కందమూల ఫలపత్రాదులు సాత్త్వికాహారము. కోడిగ్రుడ్లు ఆయా జంతువుల మాంసమును మాంసాహారము.

ఆహారప్రయోజనమేమి? ఆహారముయొక్క పరమ ప్రయోజనము క్షున్నివారణము. కాని మనము క్షున్నివారణార్థము మాత్రమే భుజించుటలేదు. జిహ్వాచాపల్య నివారణార్థమును దినుచున్నాము. కేవలక్షున్నివారణార్థమేయయినచో ననుదినము మనము భక్షించుచున్న భక్ష్యభోజ్య

చోష్యలేహ్య పానీయముల మొత్తమంతయు వ్యర్థమే. ఇన్ని తరగతుల పదార్థములను బెక్కు పర్యాయములు దిను నంతటి యాఁకలి యెవ్వనికి నుండదు. రెండుతడవలు దినమునకు భుజించినచో నాఁకలిశమించును. కాని ప్రతివాఁడును జిహ్వాచాపల్యముచేతను, నాగరిక ధర్మముగాఁ దలచుటచేతను దద్వ్యయసామర్థ్య శూన్యుఁడయ్యు భోజనవ్యయమును దన శోలదికి మించియే చేయుచున్నాఁడు. ఇప్పటి వారాఁకలిలేకయు జిహ్వాచాపలమున భోజనముతోఁ దృప్తిపడక యా యా చిఱుతిండ్లు దినుటవలన నారోగ్యముదప్పి దేహపటుత్వము సడలి బాల్యమునుండియు వ్యాధిపీడితులై యున్నారు. కేవల క్షుద్బాధా నివృత్తికొఱకే యోగంబలిన్లో త్రావి కాయకష్టము సేసిబ్రతుకు జన మెంత బలాఢ్యులుగానో యెంతయారోగ్య వంతులుగానో యుందురు. మనపూర్వులు నిప్పటి మనవలెఁగాక నియతభోజనమున కలవాటుపడియుండిరి. కనుక నేమనకంటె వారారోగ్యవంతులుగా నుండెడివారు. జిహ్వేంద్రియనిరోధములేమిని ధనవ్యయమును శరీరహానియు మనకుఁ గలుగుచున్నది.

కానీ నివృత్తి మార్గముననున్న మహర్షులు మాత్రమే క్షున్నివారణార్థము భుజించుట తగును. ప్రవృత్తి మార్గముననున్న మనబోంట్లు పురుషార్థములను సాధించుట కుచితమగు దేహపుష్టినిఁ గలిగి యుండవలయును. "శరీరమాద్యం ఖలు ధర్మ సాధనమ్" అనికదా పెద్దలనిరి. కాన శరీర బలవర్ధక

మగు నాహారమును దినవలయును అని యందురు. అదియును యథార్థమే. ముందు మనము శరీరబలముయొక్క యుయుక్తమెంత ? యని విచారింపవలయును. దేహపుష్టి యనఁగా దదేకనిష్ఠతో దేహమును బెంచుకొనును నెద్దుల వలె బలియుటగాదు. వలసినంత బలమును సంపాదింప వలయును. మితిమీఱిన బలముగూడదు. అది మానవునకుఁ గీడు సేయును. తనసొత్తు పరుఁడు హరింపరానట్లు కాపాడుకొనుటకై తగిన దేహబలము గావలయును. మితిమీఱిన బలమువలనఁ జిత్తము స్వాధీనతఁ దప్పి వ్యభిచరించును. కామక్రోధాదులకుఁ గారణమై యుద్రిక్తునిఁ గావించును. సముచితబలము చిత్తనిగ్రహమునకుఁ దోడ్పడును. చిత్తనిగ్రహమునఁ గాని భక్తిజ్ఞానములు లభింపవు. భక్తిజ్ఞానములవలనఁగాని మనుష్యుఁడీ సంసారసముద్రమును దరింపజాలఁడు. మనుష్యునికి భగవత్ప్రాప్తియే పరమలక్ష్యము. కనుకఁ దత్సాధకగుణసంపాదకమగు నాహారమును సేవింపవలయును.

పైనిఁ దెలిపిన యుభయవిధాహారములలో శాకాహారముమాత్రము మానవునకు సముచిత బలమునిచ్చును. శాకాహారములో నేమిబలమున్నదని మాంసాహారాభిమానులడుగవచ్చును. దుంపకూరలు,టొమాటో, బటానీ మొదలగు శాకములు బత్తాయిమొదలగు పండ్లు మిక్కిలి రక్తవృద్ధికరములు. మరియు బియ్యముకన్న జొన్న, గోదుమ మొదలగునవి పుష్టికరములు. పప్పులలోఁ గందిపప్పు బలకరము

ఈపయి పదార్థములలోఁ బెక్కింటియందు 'డి' విటమిను లుండుననియు, నవి దేహమున కారోగ్యము నిచ్చుననియు వైద్యులు చెప్పుదురు. కనుక మాంసమంతఁ బుష్టికరములగు పదార్థములు గూడ శాకపదార్థములందుఁ గలవు. ఇవి మాంసమువలె మనస్సునకు మాదకత్వమును గలిగింపక సముచిత బలమును గూర్చును. మాంసాహారము పుష్టికరమే కాని మాదకత్వమునుగూర్చి చిత్తశాంతినినశింపఁజేసి మనస్సు నుద్రిక్తముఁ గావించును.

శాకాహారమున ధనవ్యయమత్యల్పము. ఫలమధికము. మాంసాహారమున కగు ధనవ్యయ మధికము. ఫలమల్పము. మాంసాహారము జీవహింసా మూలకముగాఁ బాపమును గూర్చి మానవు నధఃపతితునిఁ గావించు చున్నది. శాకాదుల యందును సూక్ష్మాతి సూక్ష్మములగు కొన్ని క్రిము లుండును. వానిఁ దిన్నయెడలను బాపము సంభవించును. జాగ్రత్తగాఁ బరీక్షించి కడిగి తరిగి యాశాకములను భక్షింపవలయును.

జంతుహింస పాపమూలక మంటిని. పాపము మాట నట్లుంచుదము. మనుష్యునకు మరొక జంతువును జంపుటకు నైతికముగా నెట్టి స్వత్వమును లేదు. మానవునకుఁ దన శరీరముపైఁ దన కెంతప్రీతియుండునో నోరులేని జంతువు నకును దనప్రాణముపైఁ దనకంత తీపియుండును. ప్రతి జంతువును స్వాత్మరక్షణార్థము ప్రయత్నించు చుండును. మనమొక చీమను, దోమను, ఈగనుబట్టుకొనఁ బ్రయత్నింపఁ

గానే యది పాటిపోవును. ఏల ? వానికిఁ దమప్రాణముపైఁ గల మక్కువయే కారణము. అట్టియెడ మనుష్యుడు బలవత్తరుఁడగుటచే వానిని హింసించి స్వోదర పూరణము సేసికొనుచున్నాఁడు. పశ్వాదులకన్న విశేషించి మానవునకుఁ గల వివేకమునకు ఫలమిది కాఁబోలు. కనుక మానవునకొక జంతువును గాపాడుటకు స్వత్వముండును గాని చంపుటకు స్వత్వము లేదు.

శాకాహారమంత శీఘ్రముగా మాంసాహారము జీర్ణముగాదు. కారణమేమన మానవుని జీర్ణకోశము సామాన్యముగా మాంసమును జీర్ణించుకొనఁజాలదు. దానిని జీర్ణింపఁజేసికొనుటకై యధికమగు శరీర వ్యాయామము గావలయును. శాకాహార మనాయాసముగా జీర్ణమగును. మాంసాహారులగు వ్యాధిగ్రస్తులకు నా యాహారమును విడిచి శాకాహారమును భుజింపవలసినదిగా వైద్యు లుపదేశింతురు. ఏల ? మాంసాహారము శాకాహారమంత యారోగ్యకరము కాకపోవుటయే.

పూర్వకాలమున బ్రాహ్మణులు శ్రాద్ధములందును నితరసమయములందును మాంసమును భక్షించెడివారు. వాల్మీకిమహర్షి యాశ్రమమునకు వసిష్ఠుఁడు రాఁగా నాఁ డొయ్యనుజంపి విందుసేసిరఁట. దీనిఁబట్టి పూర్వకాలమున బ్రాహ్మణులు మాంసముఁ దినుచుండినట్లు తేలుచున్నది. కానీ యీ మాత్రమున వారిని దూషింపఁజనదు. వాంఛ్రదు

కాదాచిత్కముగా మాంసము భుజించుచువచ్చిరి గానీ యను దినమును దదేక నిష్ఠతో సాయంప్రాతలందిని యొడలు పెంచుకొనువారుగారు. ఆ యొకానొకప్పుడు భుజించుటయు నలంతి దోషముకాకపోదు. హింస నెవరు సేసినను బాపకారణమే కాని మహర్షులు సేసినమాత్రనది ధర్మముగాదు గదా ?

క. పితృకార్య యజ్ఞముఖముల
శ్రుతిబోధిత హింసఁగీడు సొర సేరదు వి
శ్రుతగుణ ! మాంసముచవి
గోరితినం బ్రాణిఁజెగటార్పుక్రియఁ బాపమగున్.

క. తనునమలినవాని నమలు
ననిమాంసము తెలుఁగుసెప్పనాగమములు గా
వునఁ దద్భక్షణముడిగిన
ననఘ ! తపంబునకుఁ జాలునది యొక్కరుఁడున్.

దేశసంరక్షణార్థము మిక్కిలిబలిష్ఠులు గావలయు ననియు నట్టి మితిమీఱిన బలము మాంసము వలనఁగాని కలుగదనియుఁ గనుక మాంసాహారమును భుజింపవలయు ననియుఁ గొందఱు పెద్ద పెద్దలు నుడువుదురు. ఈమాటలు కేవల మైహికదృష్టితోఁ జెప్పునవిగాని యాముష్మికదృష్టితో జెప్పునవి కావు. కేవలైహికమార్గము వేఱు. ఆముష్మిక మార్గము వేఱు.

# 4. స్వార్థత్యాగము.

"సర్వస్స్వార్థం సమీహతే" ప్రపంచమునఁ బ్రతిప్రాణియు స్వార్థసంపాదనమునకే యత్నించును. స్వార్థము మూలమట్టు వదలిపదార్థములను సాధించు పురుషులు లోకమున నరుదు. వారేసత్పురుషులు భర్తృహరి,

మ. తమకార్యంబుఁ బరిత్యజించియుఁ బరార్థ ప్రాపకుల్ సజ్జనుల్
తమకార్యంబు ఘటించుచుక్ బరహితార్థవ్యాపృతుల్ మధ్యముల్,
తమకైయన్య హితార్థ ఘాతుకజనుల్ దైత్యుల్, వృథాస్వార్థభం
గముఁగావించెడి వారలెవ్వరో యెఱుంగన్ శక్యమే యేరికిన్.

అని చెప్పెను.

దృఢ విశ్వాసమునకు స్వార్థత్యాగమే పరీక్షాస్థానము. (Self sacrifice is the truest test for sincearity) స్వార్థత్యాగి జగదేకవీరుఁడు. జగద్బంధువు. అతఁడాదర్శ పురుషుఁడు. వానిజీవితము పరమపవిత్రమైనది. అతడడుగుపెట్టిన నేలపుణ్యభూమి. పరుల దృష్టికతఁడత్యుచ్చమగు హర్మ్యాగ్రమునఁగూర్చున్నట్లును దాముక్రిందఁ గూలఁబడి యున్నట్లును గనఁబడును. అతనికి స్వపరభేదము లేదు. ధనికదరిద్రభేదము లేదు. స్పృశ్యాస్పృశ్యతలు లేవు. అతఁడు శుద్ధాద్వైతి కర్మయోగి. మహారాజులును వానిపాదధూళిని శిరమునఁదాల్తురు.

పరులను వంచించియో శ్రమపెట్టియో హింసించియో మనుష్యుఁడు దాను సుఖపడఁగోరును. అట్టియెడ దీనజన సము

ద్ధరణార్థము దనసౌఖ్యమును సంపాదనమును నమూల్యమగు కాలమును వెచ్చించుచు నవసరమగుపట్ల ప్రాణములనైన తముఁ దృణప్రాయముగా వదలు ధీరుని జీవితమెంత శ్లాఘాపాత్ర ముగాదు ? విద్యచేత, ధనముచేత, రూపముచేత, లోకమునఁ గలుగు నుత్కృష్టతకన్న స్వార్థత్యాగముచేఁ గలుగునుత్కృ ష్టత యధికతరము.

"స్వయంతీర్ణః పరాంస్తారయతి" అన్నట్లు స్వార్థ త్యాగి తాను తీర్ణుఁడై పరులను దరింపఁజేయును. దీనులను, ఆపన్నులను గాంచినపుడాతని హృదయము కరగిపోవును. పరవశమగును. దయ, అనుకంపప్రేమ, భక్తి మొదలగు వానితోఁ బొంగిపోవును. తత్క్షణమున, వారికివలసిన సేవ సేయుటకు నడుముబిగించి బయలుదేరును. పరులకొఱకుఁ గష్ట పడుచున్న సమయమే యతనికి సంతోషకాలము.

ఎవ్వాఁడు పరులు దినకున్నఁ దాఁదినుట కిచ్చగింపఁడో పరులు గట్టకున్నఁదాఁగట్టగోరఁడో వాని జీవితమెంత పవిత్రమైనది ! బీదలు నిలుచుటకు నీడలేక చెట్లక్రింద నివ సించుచున్నను గొల్లకొలఁది ధనమును వెచ్చించి మిద్దెలును మేడలును గట్టుచు, నన్నమో రామచంద్రాయని పొట్టఁ గొట్టుకొనుచు వాకిట విలపించు చున్నను బంచభక్ష్య పర మాన్నములతో భుజించుచుఁ, గట్టుకొనుటకును గప్పుకొనుట కును గుడ్డలులేక గోచీగుడ్డలును గోనెగుడ్డలును జుట్టుకొని మానరక్షణము సేసికొనుచు వీధుల నడయాడుచున్నను

నమూల్యములగు చీని చీనాంబరములు ధరించి మోటారులు విమానములు మొదలగు వాహనములపై విలాసార్థము సంచరించు స్వార్థపరుల జీవిత మెంత హేయమైనది ? వారి నుండి వెడలు వాయువుదుర్గంధ భూయిష్ఠము. వారి గృహ ములు ముఱికికొంపలు.

స్వార్థత్యాగి యుపదేశము లుపనిషద్రహస్యములు. ఏ నిమిషమునఁ దనవలన నొక ప్రాణికిని సుఖమగునో తన జీవితము నా నిమిషమున ధన్యముగాఁ దలంచును. మిగిలిన కాలమధన్యముగా నెంచును. వాని సరళ స్వభావమును శాంతాకృతిని సాత్త్విక భావమును జూచి జనులాతనిని దేవ దూతగను నీశ్వరావతారముగను నెంచి బ్రహ్మరథము పట్టుదురు, ఆతని విగ్రహమును బూజింతురు. తస్కరులు గర్హించినను హింసించినను వారిపై దప్పమోపక వారిని నచ్చఁజేయఁగల శక్తినిఁ దనకింకను బరమేశ్వరుఁడు చాలి నంత యొసఁగ లేదని వగచి యట్టిశక్తిఁ దనకిమ్మనియుఁ దన బోధలు వారు సరిగా గ్రహించునట్లు వారి యజ్ఞానముఁ దొలఁగింపవలసినదిగా భగవంతునిఁ గోరును. పరులు దన్నే మన్నను దాఁ జేయుపని త్రికరణశుద్ధిగా న్యాయము ధర్మమును నగునా కాదాయని చర్చించుకొని న్యాయ్యమగుచోఁ బిడు గులుమీద బడినను ఫిరంగులు ప్రేలినను, బర్వతములు పైఁబడినను మిన్నువిఱిగి మీఁదఁబడినను దనపట్టుదలను గొనసాగించును. అట్టివాఁడే వీరుఁడు. అతఁడే జగద్బంధువు.

లోకమున స్వార్థత్యాగులవలె నటించువారు కొందరు గలరు. వారు కపటులు వారినోట వెలువడుమాటలు జిహ్వాగ్రమునుండి వెడలును, కానీనాభిస్థానమునుండి వెడలవు. పరార్థసంపాదనము సేయుచున్నట్లు నటించుచు స్వార్థమును నెఱవేర్చుకొందురు. వీరికుపదేశపాండిత్యము మెండు. ఆచరణపాండిత్యము బెండు.

శ్లో. స్వానుష్ఠాన సమయేమునయోఽపి నపండితాః
పరోపదేశసమయే సర్వఏవంహిపండితాః

(తామనుష్ఠింపవలసిన సమయమున మునులుగూడ వెనుదీయుదురు. పరోపదేశ సమయముననెల్లరును బండితులే).

శ్లో. పరోపదేశే పాండిత్యం సర్వేషాంసుకరం నృణామ్
ధర్మేస్వీయేత్వనుష్ఠానం కస్యచిత్తు మహాత్మనః.

(పరోపదేశ పాండిత్యమెల్లరకును గలదు. ఒకానొకఁడు మాత్రమే తానాచరించును.) పెద్దపెద్ద సభలుసేసి తమ వాక్చాతుర్యమును జూపఁగలరు. వీరుకార్యశూరులు గారు. కేవల వాక్శూరులు. స్వార్థత్యాగము సేయవలసిన సమయమున కేవో నాకులుపన్ని తప్పించుకొందురు. తామొద్దుననుండియే పరులనీట దూకుమందురు. పరులుచేయు కార్యములలోఁ దప్పులెన్నుచుఁ దమకార్యములందలి దోషములనుసమర్థింతురు. తమదోషములను బరులపై నారోపింతురు. తమదోషమును దామంగీకరింపరు. తమ్ము విమర్శించు వారిపై దండెత్తుదురు. తమవలన నెవనికెట్టిమేలు గావలసి

యున్నను స్వార్థమపేక్షించియే చేతురు. చక్కఁగాఁదియ్యని మాటలువలికి చివరకుఁ దమ యెడమచేతిని వెలిబుత్తురు. వీరు మేడిపండువంటివారు. ఈతగింజంత యిచ్చి తాటిగింజంత లాగుదురు. ఇట్టివారిప్పటికాలములోఁ బెక్కురు గలరు. ప్రభువుల ప్రాపకము సంపాదించుకొని పెద్ద పెద్ద పదవులను గోరువారెల్లరును నిదేవిధముగాఁ బ్రజాసేవచేయుచున్నట్లగ పడుచు దేశద్రోహులగుదురు. వీరవసరమువచ్చి నప్పుడు ప్రజాహితమును బాటింపక ప్రభుహితముగా వర్తింతురు. వీరికిఁబదవులు, బిరుదులు, గౌరవములు ధనమును బ్రధానములు. కాని యుత్తముఁడగు స్వార్థత్యాగి వాటిని విషతుల్యముగా నెంచును. వానికిఁ బ్రజాసేవయే పరమార్థము. కపట స్వార్థత్యాగికిని నుత్తమస్వార్థత్యాగికిని హస్తిమశకాంతర మున్నది. మనహిందూదేశము మొదటినుండియు స్వార్థత్యాగులకుఁ బేరుమోసినది. మహర్షుల జీవితములు లోకానుగ్రహార్థము. సిద్ధార్థునివలె స్వార్థత్యాగ మొనర్చినవాఁడు మరొకఁడులేఁడు. ఏలన దరిద్రుఁడు సన్న్యసించుటలో విశేషములేదు; కాని రాజకుమారుఁడు, నవయౌవనమున నున్నవాఁడు సన్న్యసించి మతకర్తయై లోకోద్ధరణార్థము దీక్షవహించుట చరిత్ర యందాశ్చర్యకరమగు విషయము.

మనుష్యుఁడు పెక్కు విద్యలభ్యసించి మహావిద్వాంసుఁడు గావచ్చును. జగదేకపండితుఁడు గావచ్చును. గొప్ప గ్రంథకర్తగావచ్చును. కోటానకోట్లు ధనముగడింపవచ్చును.

గొప్పగొప్ప బిరుదులు సంపాదింపవచ్చును. కానిస్వార్థత్యాగముఁ జేయుట సాధ్యముకానిపని. పేర్ప్రతిష్ఠలకుఁగాక తనకుఁగల సర్వస్వము దీనరక్షణార్థము విసర్జించుట ప్రతివానికి నసాధ్యము. అట్టి యాత్మసంతృప్తియుంట దుర్లభము. ఆత్మసంతృప్తిగలవాఁడే స్వార్థమును విడువఁ జాలును. అతఁడు గోచీపాత రాయఁడైనను కుబేరునకన్న నధికుఁడు నగును. "కౌపీనవంతః ఖలుభాగ్యవంతః" అనికదా చెప్పఁబడినది. ఆశలేనివాఁడే ధనికుఁడు. ఆశగలవాఁడు దరిద్రుఁడు. "సతు భవతుదరిద్రో యస్యతృష్ణా విశాలామనసిచ పరితుష్టేకోర్థవాన్ కోదరిద్రః" అని భర్తృహరియన్నాఁడు. అట్టిపురుషుఁడే లోకోద్ధారకుఁడు. మతోద్ధారకుఁడు, దేశికుఁడు. దేవదూత. అట్టిస్వార్థత్యాగులే దేశనాయకు లనఁదగినవారు. వారివలననే దేశము దాస్యవిముక్తమగును. "సత్యందయాంచ శౌచంచయదివా జానకీమపి ఆరాధనాయలోకస్య ముంచతో నాస్తిమేవ్యథా" అని లోకారాధనమునకు భార్యను విడిచినట్టియు లోకోద్ధరణార్థము భార్యాపుత్రులనురాజ్యమునువిడిచినట్టియు దేశారాధనము కొఱకుఁ దనసర్వస్వమును దనదేహమునుదృణప్రాయముగా వదలినట్టియు పురుషునకన్న మహాత్ము డెవ్వఁడు? అట్టివాఁ డీశ్వరావతార మన్నఁగాని యంతకన్న నీశ్వరుఁడే యన్నఁగాని దోసఁ గేమియుండును. అట్టివాని మహత్త్వమెఱుఁగక మాతని నన్యథాభావించుట తప్పు. మలినమైన యద్దము ప్రతిబింబమును గ్రహింపలేదు.

అదియద్దముయొక్క దోషముగాని. బింబముయొక్క దోషము గాదే. అట్టివారు సిద్ధపురుషు లనఁబడుదురు. వారి నామో చ్చారణము తారకమంత్రమనుటలో దప్పు లేదు.

---

## 5. దేశీయ పరిశ్రమలు.

దేశసంపద దేశీయ పరిశ్రమలను బట్టియుండును. ఏదేశమునఁ బరిశ్రమలు (industries) అధికముగా నుండునో యాదేశము సంపన్నముగా నుండును. పరదేశము లట్లు సుసంపన్నములై యుండుటకుఁ గారణ మా దేశ పరిశ్రమాభి వృద్ధియే. ఏదేశమున నీపరిశ్రమ లుండవో ఆదేశమును క్షామ దేవత వేనోళ్లు తెఱచికొని కబళించుచుండును.

మన హిందూదేశములో నధిక సంఖ్యాకులగు జనుల వృత్తిసేద్యము. సేద్యము సేయుకాలము సంవత్సరమున కాఱు మాసములు మాత్రమే. మిగిలిన కాలమున రైతు సోమరిగాఁ గాలము పుచ్చుచున్నాఁడు. తగినంత భూమి యున్నఁగాని సేద్యముఁ జేయరాదు. మాసవున కొక్క పంట మాత్రము పండినజాలదు. గుడ్డలు, కాగితములు, కలములు, సిరాలు, బొత్తాములు, సూదులు, టోపీలు మొదలగు వేలకొలఁది వస్తువులు కావలసియున్నవి. మన దేశమునఁ బంటదక్క నితరములులేవు. కాన నాపై వస్తువులన్నియుఁ బర దేశముల

నుండి వచ్చుచున్నవి. భోజన పదార్థములవలెనే మిగిలిన పదార్థములును మన కవసరముగా నున్నవి. అవి లేనిచో మనకొక్క నిముసమును గడవకున్నది. ఇప్పటి మనవాడుచున్న యీ వస్తుజాతమంతయు నానాఁట లేకపోవుటచే మన పూర్వులెట్లు గడుపుకొనిరో యని శంకింపఁ బనిలేదు. వారి జీవితమునకును మన జీవితమునకును హస్తిమశకాంతర మున్నది. వారిది సరళజీవితము. (Simple life) మనలది డాంబిక జీవితము (Costly life). ఇప్పటి మన వస్తువులు వారికవసర పడలేదు. మనకుఁ గేవలావశ్యములగు వస్తువులనే మనము కొనుటలేదు. అవసరములేకున్న నాకర్షముగా నుంటచేఁ గొన్నిటినిఁ గొనుచున్నారము. ఆవశ్యకత్వము కన్న నాకర్ష కత్వము వస్తువులకు సృష్టించుట వ్యాపారస్థుల వ్యాపార రహస్యము.

ఒక్కధాన్యములు దక్కఁ దక్కిన నిత్యకృత్యములకు మనమువాడు లాఁతివస్తువులన్నియుఁ బాశ్చాత్య దేశముల నుండి మనకు వచ్చుచున్నవి. అనఁగా మనకు రమారమి యాఱువేల మైళ్ళదూరమునుండి యేతెంచుచున్నవి. అట్లు వచ్చునప్పటికి నావస్తువులపై నెన్నెన్నో సుంకములు, ఖర్చులు పడి మొదటివెలకన్న నాలుగురెట్లు పెరిగితడిసి మొప్పందమయి నట్లగుచున్నది. ఉదాహరణమునుగనుఁడు. ఇంగ్లాండులో నొక సైకిలు వెల రు 15-0-0 లగును. ఆ కంపెనీలోఁ దయారగు నెల్లవస్తువులను నొకవణిక్సంఘ ముత్తరుఁ దీసికొనును. అతఁడా వస్తువులనుగొని యోడనెక్కించి బొంబాయి రేవునకు

జేర్చును, అచ్చట సుంకముదినును. పిమ్మట వర్తకుఁడు గిడ్డంగికిఁ జేర్చుకొనును. అప్పటికిఁ గొన్న తావునుండి తన తావునకుఁ జేరునప్పటికి నోడ కేవు, సుంకము, కూలి, స్వలాభము తన పెట్టుబడికి వడ్డీమొదలగు ఖర్చులన్నియు లెక్క చూచుకొని యా సైకిలునకు రమారమి నలుబదిరూపాయలు వెలనిర్ణయించును. వానికడనుండి మరియొక వ్యాపారస్థుఁడు గొని చిన్న చిన్న పట్టణములకుఁ గొనిపోయి తనకయిన ఖర్చులును దనలాభమును లెక్కించి దాని వెల నలువదినుండి యేఁబది వఱకును బెంచును. అనఁగా మొదటఁ బదునైదురూపాయల వెలగల వస్తు వేఁబది రూపాయలకు మనము గొనుచున్నాము. ఇదేవిధముగా మనకువచ్చు ప్రతివస్తువును గుఱించియు విచారణచేసినచో మనధనమెంత పరదేశములకుఁ బోవుచున్నదో గ్రహింపఁగలము. సూదిమొదలుకొని విమానయంత్రము వఱకుఁగల పదార్థములు, పరదేశములనుండి మన దేశమునకు వచ్చుచున్నవి. కనుక మనహిందూదేశమునుండి యనుదినమును ధనప్రవాహము వెల్లువలై పరదేశములకుఁ బోవుచున్నది. రత్నగర్భయని పేరుమోసిన భరతభూమి దరిద్ర దేవతా తాండవరంగమై యున్నది.

పరదేశములనుండి వచ్చుచున్న ప్రతివస్తువును మన దేశముననే నిర్మింతమనుకొనుఁడు. అప్పుడేమగును? మనధనమింత వ్యయముగాదు! పదునైదు రూపాయల సైకిలును మనయింటికిరువది రూపాయలకు రాఁగలదు. నలువది రూపా

యలు మనకు మిగులును. ఈ విధముగా నెల్లపదార్థములలో మనకుధనము మిగులుచున్న మనముధనికులమై యుందుము.

పూర్వకాలమున మనదేశమందిప్పుడు పాశ్చాత్యదేశములలోనున్నన్ని పరిశ్రమలు లేకున్నను నాకాలమునకుఁ గావలసిన పరిశ్రమలు ముప్పాతిక మువ్వీసముగలవు. సంస్కృత భాష యనాది. దానిలో సర్దమునకు నాదర్శము, ముకురము ననియు సూదికి సూచియనియుఁ బేళ్లుగలవు. వస్తువులు లేనిచో నామము పుట్టునుగదా! మఱియుఁ బెద్ద బెద్ద ఫిరంగులను, దుపాకులను వాఁడిమందులను దయారుసేయు కర్మాగారములు (Factories) పెక్కులున్నట్లనేక నిదర్శనములు గనఁబడుచున్నవి. దీనింబట్టి యాకాలమునఁ బెక్కువస్తువులు మన హిందూదేశమున నుత్పన్నములగుచుండెను. పెక్కు పరిశ్రమ లుండెను. కాని కాలక్రమమున నవి నశించి నామ మాత్రావశిష్టములయినవి. ఆ వస్తువులు మన కిప్పుడు విదేశములనుండి దిగుమతి యగుచున్నవి.

ఇప్పుడిప్పుడు మన దేశమందును ధనికులు సంఘములుగాఁ జేరి యంత్రాగారములను స్థాపించి వస్త్రములు మొదలయిన మనము వాడుకొనుచున్న వస్తువుల నన్నింటినిఁ గాకున్నఁ గొన్నింటినైన నిర్మించుచున్నారు. కాని మన దేశీయులకుఁ జాలినంత వస్తుజాల ముత్పన్నమగుట లేదు. పదార్థ మధికముగా నుత్పన్నమయినఁగానీ వెలదగ్గదు. వెలయధికమయినచో విదేశ వస్తువులు చౌకగా నుంటంబట్టి జను

వానినే కొందురు. అందువలన స్వదేశవస్తువు లమ్ముడువోవు. పెట్టుబడిదారులకును నష్టము వచ్చును. కనుక దేశీయుల కందఱకును వలసినంత పదార్థజాతమును మనదేశ యంత్రాగారములు సృష్టించినచోఁ బరదేశవస్తువులతోఁ బోటీసేయఁ జాలును. ప్రభుత్వమువారు దేశీయ పరిశ్రమలపై సుంకము నుదగ్గించి పరదేశవస్తువులపై సుంకము హెచ్చింపవలయును. ఇట్లయిన స్వదేశ వస్తువులు వెలదగ్గి చౌకయగును. పరదేశవస్తువుల రాబడియుఁ దగ్గును. దేశీయ వస్తువు లమ్ముడువోవును. ఇప్పుడు హిందూదేశ పరిశ్రమలకుఁ దగినంత రక్షణము లేదు.

ఇప్పుడు మనదేశమునఁ దయారగు వస్తువులకన్నఁ బరదేశ వస్తువులు మిక్కిలి చక్కగా నుండును. మనదేశమునఁ దట్టి నాజూకైన నాణ్యమైన వస్తువులు దయారు కామికిఁ గారణమట్టి యుత్తమ యంత్రసామగ్రి మనదేశమునకు దిగుమతి కామిచే. ప్రపంచములోఁ బరిశ్రమల విషయమున హిందూదేశమువలె వెనుకఁబడియున్న దేశము వేరొక్కటి లేదు. ఇతరదేశములందుఁ బాలితులు బాలకులు నొక్కజాతి వారే. మన హిందూదేశమునఁ బాలిత పాలకులు భిన్న జాతులవారు. ఏక జాతీయుల కున్నంత పరస్పరప్రేమ భిన్న జాతీయులకుండదుగదా.

పరిశ్రమలు గలదేశమునందు నిరుద్యోగసమస్య యుండదు. ఇప్పుడు మనదేశమునన్ను నిరుద్యోగులగు విద్యావంతు

లకుఁ గర్మాగారములఁ గొలుపువారకును. ఎల్లవస్తువులును గేవలయంత్రములవలననె నిర్మించుటవలన నొక్కదోషమును గలుగును. ఏమనఁగొంతకాలమునకవ్వెడ గూడ నిరుద్యోగ సమస్య ప్రబలగలదు. ఎన్నెన్నో పరిశ్రమాలయములుగల యింగ్లాండుమున్నగు దేశములందిప్పుడిప్పుడు నిరుద్యోగసమస్య యుద్భవించి విద్యావంతులను బీడించుచున్నది. కనుకఁ జేతిప నులుగూడ విశేషించి యుండవలయును.

పాలకులు విద్యావిధానము మార్చి పాఠశాలలో బాలకులకుఁ బారిశ్రామికవిద్యలును సాంకేతిక విద్యలును స్థాపింప వలయును. ధనికులు నానాయంత్రాగారములను స్థాపించి యన్నివస్తువులను నిర్మింప వలయును. దానికిఁ బ్రభుత్వము బాసటనీయవలయును. అప్పుడు మన దేశము వృద్ధికి రాఁగలదు.

ఇప్పటి మన దేశస్థితినిఁబట్టి చూడఁగా నింక నెన్నో శతాబ్దములకుఁగానీ మన దేశపరిశ్రమలు పరదేశములతోఁ బోటీఁజేయఁజాలవని తోఁచును.

---

# 6. జనపదము-పత్తనము.

మొదటఁ గుగ్రామము గానున్నదియే క్రమక్రమముగాఁ బట్టణమగును. పట్టణమునకు మొదటిరూపము పల్లెటూరు. ప్రపంచమునఁ బట్టణములకన్నఁ బల్లెయలధికము, పాడిపం

టలు, కూరగాయలు మొదలగు పెక్కుపదార్థములు పల్లెల యందే యుత్పన్నములగును. పల్లెలనుండి వచ్చినపదార్థములను బరస్థానముల కెగుమతి సేయుచుంటవలనను బరస్థానములనుండి వచ్చుపదార్థములను దిగుమతిఁ జేసి పల్లెలలోనికిఁ జేర్చుటవలనను దళారులు (Brokers) లాభమును గడించి పెద్దధనికులయి గొప్పమేడలు మిద్దెలు గట్టుకొని కర్మాగారములు స్థాపించి వ్యాపారాభివృద్ధిఁ జేసికొనుచుండఁ బల్లెలు క్రమక్రమముగాఁ బట్టణములయినవి.

వర్తకమునకుఁ బట్టణములు కేంద్రములు. పట్టణమునఁ జరిగినంత వ్యాపారము పల్లెటూరిలో జరుగదు. కాయ కష్టముసేసి బ్రతుకు కూలి జనమునకుఁ బట్టణము పోషకమయినట్లు పల్లెగాదు. ఏలనఁ బట్టణములలోఁ బెక్కు కర్మాగారములు, కార్యాలయములు పెద్దయంగడులు మొదలగునవి యుండుటచే శరీరము దాఁచుకొనక శ్రమపడువారికి జీతబత్తెములు లభించుట కవకాశము గలదు. పల్లెలయందు సేద్యముదక్క మరొక్క వ్యాపారము లేదు. అదియు సంవత్సరములోఁ గొలఁదికాలము మాత్రమే యుండును. కనుకఁ గూలిజనము సేద్యములేని కాలమున జీవితము గడపుటకిబ్బంది పడవలసి వచ్చును. పట్టణమున మున్నూటయఱువదియైదు దినములు నేదో వ్యాపారము జరుగుచునే యుంటవలనఁ గూలిజనమునకు జీతబత్తెములు దొరకుట కవకాశమున్నది. పట్టణమునందుఁ బాఠశాలలు, కళా

శాలలు నుంటవలన విద్యాప్రచార మధికముగానుండును. గ్రామములలో నున్నతవిద్యావకాశములు లేకపోవుటవలనఁ బెక్కండ్రు పట్టణములలోఁ గాపురములఁ బెట్టి బిడ్డలకుఁ జదువుఁజెప్పించు కొందురు. పట్టణములలోఁ గనఁబడినంత మంది విద్యావంతులు పల్లెలలోఁగనఁబడరు. మనహిందూ దేశములో విద్యావంతుల సంఖ్యనూటికిఁ బది మాత్రమే. ఆపదిమందియందును తొమ్మిది మంది పట్టణములలోనే నివసించుచున్నారు. చాలపల్లెటూళ్లలో వీథిబడియుఁగానరాదు. పట్టణమునకుఁ బ్రస్తుతనాగరకతతో నున్నంత సంబంధము పల్లెలకుండదు. వార్తాపత్రికలు ప్రపంచగర్భకోశములనున్న యెల్లవింతలను గమువడిగాఁదెచ్చి ప్రజలకందఁజేయును. ఆపత్రికలు పల్లెలకుఁ జేరునప్పటికిఁ గొంత యాలస్యమగును. పాశ్చాత్య నాగరకతా మూలమగు నానాయంత్రసామగ్రియుఁ బట్టణమునఁ గాంచఁగలము. పట్టణస్థులకుఁగల రాజకీయ విజ్ఞానము. ప్రాపంచిక విజ్ఞానమును పల్లెటూరివారికి లేదు. కారణము వారికి విద్యాగంధము యొక్క కొఱఁతయే. పట్టణముల కున్నంత వైద్యసాహాయ్యము పల్లెలకు లేదు. పల్లెటూరివారు సకాలమునఁ జికిత్సాసాహాయ్యము లేక సంకటపడు చున్నారు. లక్షాధికారియైనను వలసిన యుత్తరక్షణమునఁ బట్టణమునందువలెఁ బల్లెటూరియందు రోగ చికిత్సఁబడయఁ జాలఁడు. పట్టణము నాగరకతా రంగస్థలమగుటచే నాటకములు, సినిమాలు, సర్కసులు

మొదలగు పెక్కుదృశ్యములు గాంచ ననువగును. అనుకున్న యాక్షణముననే కొండమీఁది కోతియును బట్టణస్థులకు లభించును. కానీ జానపదులకిది యసాధ్యము. ఈ పైనుదాహరించిన కారణములనుబట్టి పట్టణజీవనమే యుత్తమోత్తమమని విశ్వసింప వీలగుచున్నది.

కానీపట్టణ జీవనము కృత్రిమము. వారి వేషభాషాచారములన్నియు ననహజములు. ధర్మదూరములు. పట్టణస్థులు కార్యాలయ గమనత్వరచే మలవిసర్జనాది కార్యములుగాకున్నను నాఁకలిగొనకున్నను సకాలమున నది శీఘ్రముగా భుజించుచున్నారు. మధ్యాహ్నమునందు ఫలాహారగృహములందుఁ జిఱుదిండ్లను దినుచున్నారు. దీనిచేఁ గ్రమక్రమముగా వారల యారోగ్యము తప్పుచున్నది. పాశ్చాత్య నాగరకతా విశేషములలో ఫలాహార గృహములకేగుచుంట యొకటి. ఆరోగ్యము దప్పుటఁబట్టి వైద్యసాహాయ్యము గావలసివచ్చుచున్నది. నియతకాలభోజనమువలన ననఁగా 11, 12 గంటల మధ్యకాలమున భుజించుటవలన నారోగ్యము చెడదు. అప్పటికిఁగానీ కఱకుగా నాఁకలిగలుగను. మనయారోగ్యము చెడుటకీ ఫలాహారగృహములును గొంత కారణము. పట్టణమున నెన్ని ఫలాహార గృహములున్న నంతకుఁ బదిరెట్లు వైద్యులును నుందురు. పల్లెలందట్టి ఫలాహార గృహములుగానీ యంతమంది వైద్యులుగానీ లేరు. జానపదులు నియతకాలభోజనమున కలవాటు

పడియుందురు. సామాన్యవ్యాధులు గూరగాయవైద్యముచేఁ గుదురును. పట్టణమునఁ గొలదిగా దగ్గుపడిసెములు పట్టినను నౌకశ్వేతము వదలినఁగాని కుదురవు. చిలుమువదలినఁగాని ఫలముదక్కదుగదా! పట్టణస్థులు మోసప్రుఁబనులయందు దాఁటి తేఁటియుందురు. వారికిఁ దెలిసినన్ని మాయోపాయములు, నసత్య భాషణములు, కపటవేషములు జానపదులకుఁ దెలియవు. జానపదులు సరళస్వభావులు. నల్లని విన్నీళ్లను దెల్లనివిపాలును నని నమ్ముదురు. సత్యసంధులు. పట్టణస్థులకు దురభ్యాసములధికము. సిగరెట్లు, బీడీలు, తమలపాకుల బీడాలు, సోడాబుడ్లు మొదలగు వానికలవాటుపడి తమకువచ్చిన యాదాయమునకన్న నధికముగా వ్యయముసేయుచుందురు. పట్టణస్థులలోఁ బెక్కండ్రు తమకెంతస్వల్పాదాయమున్నను నధికాదాయము గలిగినవారట్లుందురు. అమూల్యవస్త్రములు ధరింతురు. ఆదాయమునుమించి వెచ్చింతురు. జానపదునకు దురభ్యాసము లుండవు. ఆదాయమునుమించి వెచ్చింపడు. విలువగల వలువలు దాల్పఁడు. ఆకర్షకములగు నాటకాదులు లేమి ధనవ్యయముండదు. విద్యావంతులకన్న విద్యాహీనులగు జానపదులే ఋజుప్రవర్తన, దైవభక్తి, పాపభీతి, త్యాగబుద్ధినిఁ గలిగి యుందురు. జానపదులు మధ్యాహ్నానంతరమునఁ దమకుఁగల కొలఁది జ్ఞానముచే మనమతగ్రంథములగు రామాయణ మహాభారతాదులు పఠించుకొనుచు సత్కాలక్షేపము సేసికొనుచు దేవునకు సన్నిహితవర్తనులై యుందురు. అట్టిజానపదులకుఁ

బట్టణజీవితము చాలా కృత్రిమముగా గనబడును. కణ్వాశ్రమము నుండి శకుంతలను దోడ్కొని దుష్యంతుని పట్టణమునకరుదెంచిన శార్ఙ్గరవుడు శారద్వతులను నిరువురు మునికుమారులా పట్టణమునుగని యేవపడిరి. శార్ఙ్గరవుడు జనాకీర్ణమగు నాపట్టణము హుతవహపరీతమగు గృహమువలె నున్నదనెను. శారద్వతుడు "అభ్యక్తమివస్నాతః శుచిరశుచిమివప్రబుద్ధ ఇవసుప్తమ్ బద్ధమివస్వైరగతిర్జనమిహసుఖసంగినమవైమి." "(స్నాతుఁడు తలంటుకొనుచున్నవానిని, శుచియశుచిని, ప్రబుద్ధుఁడు నిద్రితుని స్వైరవిహారి కారాబద్ధునిఁ గాంచినట్లే యైహిక సంపర్కమునను్న జనమునుగాంచుచున్నాను) అని జాలిపడినాడు. పట్టణస్థులు ప్రపంచజ్ఞానములనలవఱచుకొన్నంత దైవభక్తిని నలవఱచుకొనరు. దైవభక్తి ప్రస్తుతనాగరక ధర్మములలోఁ జేరలేదు. కనుకవారు దేవునకతి దూరవర్తులయి యుందురు. పట్టణస్థులకు బాహ్యశుద్ధియున్నంత యాభ్యంతర శుద్ధియుండదు.

పట్టణము గృహములకు గాలి వెలుతురులు బాగుగా రామిని, మలవిసర్జనాది స్థలములేక గృహముననే యుంటను పల్లెటూరంత యారోగ్యస్థానముగాదు. వ్యాధిగ్రస్తులకు సామాన్యముగాఁ బల్లెటూరిగాలిని సేవింప వైద్యులు సలహానిత్తురు.

గ్రామములోనున్న యతిథ్యభ్యాగతపూజ పత్తనము లందుండదు. కవుల కవితాసామగ్రి గ్రామ ప్రాంతములందే లభించును.

ఇప్పుడిప్పుడు పల్లెటూళ్ళకును పాశ్చాత్య నాగరకతా ఝంఝామారుతము వీచినది. అందువలన కొన్ని పల్లెటూళ్లలో బూర్వస్థితి తారుమారయినది. పాశ్చాత్య నాగరకత కేవల పాశ్చాత్య విద్యావంతులలోనే కాక రవ్వంత విద్యాగంధమును లేని జనులలోఁగూడ నరనరములకు రోమరోమములకు బాఁకినది. తత్ఫలముగా జనులలో నైకమత్యము నశించి యేకోత్తరాభివృద్ధిగా వ్యాజ్యములు ప్రబలుచున్నవి. మోసము హెచ్చి ఋజుప్రవర్తనతప్పవ్యను. ప్రతిగ్రామము నందుఁ గక్షలు పెరిగెను. పాశ్చాత్య నాగరకత ప్రబలని కాలమునఁ బల్లెటూళ్ళపైని నోడిచిన విధముగా నుండెడివి.

ఇప్పుడు దేశనాయకులు తమదృష్టిని గ్రామములపైకి మరలించిరి. వారు గ్రామప్రజలకుఁగల యంతఃకలహములు పెరుగకుండ నైకమత్యముఁ గూర్చుచు నారోగ్యప్రచారము సేయుచు వైద్యసాహాయ్యము సమకూర్చుచు గ్రంథాలయములు సహకారసంఘములు, స్థాపించుచుఁ బాడుపడ్డ పరిశ్రమలకుఁ బునర్జీవనముఁ బోయించుచు నెల్లవిధముల నున్నతినిఁ దెచ్చుటకుఁ బ్రయత్నము సేయుచున్నారు.

---

# 7. గ్రంథాలయములు.

గ్రంథాలయమన సరస్వతీమందిరము. సరస్వతి గ్రంథ రూపముగఁ బెక్కవతారములను దాల్చియుండు నివసించును.

మనుష్యుఁడు దేవళమునకు బోయి పత్రపుష్పఫలాదులతో భగవంతుని సేవించి తదనుగ్రహపాత్రుఁడగుచున్నాడు. అట్లె యెల్లరును సరస్వతీ దేవ్యాలయమునకుఁ బోయి యాదేవి నుపచరించి తత్ప్రసాదమును బొందవలయును. దేవాలయమువలె గ్రంథాలయముగూడఁ బవిత్రస్థానమే. కాని మన పెద్దలకు దేవాలయ నిర్మాణమునందున్న శ్రద్ధాభక్తులు సరస్వతీ మందిర నిర్మాణమున లేవు. దానివలెనిది పుణ్యకార్యముగా వారికిదట్టలేదు. కనుకనే చిన్న చిన్న పల్లెయందైనను దప్పక దేవాలయముండునుగాని గ్రంథాలయముండదు. ఎన్ని దేవమందిరములున్నను బుణ్యలాభ భ్రాంతిచే దాతలుదిరిగి దేవాలయమునే నిర్మింపఁ బూనుదురు; కానియవశ్యమును బ్రజోపకారమునగు గ్రంథాలయమును గట్టింపఁబూనరు.

గ్రంథాలయము గ్రామమధ్యమున నున్న దీపస్తంభము వంటిది. దాని తేజోవీచికలు నలుగడలఁ బ్రసరించి దరిద్రులయు ధనికులయుఁ జిన్నలయు బెద్దలయు నజ్ఞానగాఢాంధకారమును బటాపంచలుగఁ జేయును. గ్రంథాలయములేని గ్రామమయినను, పట్టణమయినను దీపశూన్యమగు గృహము.

విద్యార్థులు బాఠశాలలో నేర్చుకొను విద్య కేవలము దిగ్దర్శన యంత్రమువంటిది. బడివెలుపటనే విద్యార్థులు మిక్కిలి విజ్ఞానమార్జింపవలసి యున్నది. వారు నేర్వవలసిన విజ్ఞానమంతయు స్వయముగా మహాపురుషుల గ్రంథములఁ

బఠించి సాధింపవలయును. బడిలోఁ జదివిన చదువుతో సంతృప్తిపడుఁవాఁడెన్నఁడును గొప్పవిద్యావంతుఁడు గానేరఁడు. అత్యుత్తమగ్రంథములను చదువుచు నాయాపండితుల యుపన్యాసములు వినుచు నాయాప్రాజ్ఞులతోఁ జర్చించుచున్నఁ గానీ విద్యార్థి విద్యావంతుఁడుగా నేరఁడు. ప్రతివాఁడు నట్టి యమూల్యగ్రంథములను గొనుటకు శక్తుఁడుగాఁడు. ఊరక గ్రంథములు లభింపవు. అట్టియెడ గ్రంథాలయములు విలువగల గ్రంథరాజములను సేకరించి విద్యార్థియొక్క జ్ఞానపిపాస నుపశమింపఁ జేయును.

గ్రంథాలయముల కన్నితరగతుల సాహిత్య, శాస్త్ర గ్రంథములను దెప్పింపవలయును. ఆయాసభ్యుల యభిరుచినిఁ బట్టి యితర గ్రంథములను దెప్పింపవలయును, వీనికై యుదారులగు వారికడనుండి ధనము ప్రోగుసేయవలయును.

గ్రంథాలయాధ్యక్షు లప్పుడప్పుడు గొప్పగొప్పవిద్వాంసులను రప్పించి వారిచే నుపన్యాసము లిప్పించి ప్రజాప్రబోధమును గలిగించుట యుక్తము. మరియుఁ దమకుగల ద్రవ్యపరిస్థితులనుబట్టి యొక విద్వాంసుని గ్రంథాలయమునం దుద్యోగినిగా నుంచి వానిచేఁ బ్రతివారము నారోగ్యమును గూర్చి, మతమును గూర్చి, భాషను గూర్చి, రాజకీయములను గూర్చియు నుపన్యసింపఁ జేయవలయును. క్రొత్తక్రొత్త పుస్తకములను దెప్పించి యొకపండితునిచేఁ జదివించి గ్రంథములఁ దీసికొనఁ గోరువారి కాయాపుస్తకముల నుంచి

సెబ్బరలంగూర్చి సలహా నిప్పింపవలయును. అందువలనఁ బాఠకు లనుపాదేయ గ్రంథములను వదలి యుపాదేయ గ్రంథములఁ జదివి లాభమును బొందఁగలరు. కాకున్నఁ జదివిన చదువు వ్యర్థమగును. అప్పుడప్పుడు భిన్నభిన్న విషయములఁగూర్చి చిన్నపుస్తకములు (Pamphlet) ముద్రించి పంచి పెట్టి ప్రబోధము సేయవలయును. హిందూదేశమున విద్యావంతులు దక్కువ గనుక గ్రంథాలయములీ కార్యమునకుఁ గడంగినచో సామాన్య ప్రజలకెంతేని లాభమగును. మఱియు గ్రంథాలయములవారు ప్రాచీన తాళపత్ర గ్రంథములను, శాసనములను సేకరించి వానినిఁ బ్రకటించినచో భాషాభివృద్ధికిఁ దోడ్పడినవారగుదురు.

పురుషులకువలెనె స్త్రీలకును గ్రంథాలయము లుపయుక్తముగా నుండవలయును. కనుక స్త్రీజాతికి సంబంధించిన వాఙ్మయముఁ దెప్పింప వలయును. పురుషులవలె స్త్రీలకు గృహకృత్యములను విడిచి యనుదినమును గ్రంథాలయములకుఁ బోవుట కనువుపడదు. కనుక గ్రంథాలయాధికారులు వలసిన స్త్రీలకాయాయి గ్రంథములను, బత్రికలను నిండ్లకుఁ బంపినచో వారు దమ యవకాశానుసారముగా విజ్ఞానాభివృద్ధినిఁ జేసికొనఁ జాలుదురు. ప్రస్తుతకాలమునఁ బురుషులతోపాటు స్త్రీలుగూడ స్వాతంత్ర్యమును వహింపఁ గోరుచున్నారు. కనుక గ్రంథాలయాధికారులు వారి యుద్యమాభివృద్ధికిఁ గావలసిన యన్ని సౌకర్యములను గలిగింపవలయును.

పూర్వకాలమునందు మనదేశమున భాషాభిమానులగు మహారాజులు గ్రంథాలయముల స్థాపించి సరస్వతీదేవి సేవసేయుచుండెడివారు. బరోడా, కాశ్మీరము, కాశీ, తంజావూరు, మొదలగు పట్టణములలోఁ గొన్ని శతాబ్దములనాడు స్థాపించిన గ్రంథాలయములు గలవు. ముద్రాయంత్రములు లేని యాకాలమున గ్రంథములను వ్రాయించి సేకరించి పెట్టిరి. అట్లువ్రాయించుట కెంతో వ్యయము పట్టియుండును. ఇప్పటి కాలములో ముద్రా యంత్రము లుంటవలన పూర్వముకన్న స్వల్పమూల్యమునకు గ్రంథములు లభించుచున్నవి. కనుక గ్రంథాలయములు పెక్కింటిని స్థాపించుట కవకాశము పూర్వమునకన్న నిపుడెక్కువ గలదు.

ఇప్పుడు సామాన్యముగా గ్రంథాలయములు పట్టణములందున్నవి కానిగ్రామములందుఁ గానరావు. ఈగ్రంథాలయోద్యమము గ్రామములకుగూడఁ బ్రాకవలయును. ప్రజలైకమత్యముతో నుండి ప్రతిగ్రామమున నొక్క గ్రంథాలయము నిర్వహించుకొనుచు జ్ఞానాభివృద్ధినిఁ బడయవలయును. ప్రజలుసేయు దుర్వ్యయముతో గ్రామమునఁ బెద్దపెద్దగ్రంథాలయమును నిర్వహింపవచ్చును. దుర్వ్యయమున కంగీకరించినట్లు ప్రజలమనస్సు సద్వ్యయమున కంగీకరింపదు.

ప్రచారక గ్రంథాలయములని మరొక తరగతి గ్రంథాలయములు గలవు. పట్టణమునందున్న పెద్ద గ్రంథా

లయమువారు ప్రాంతమునమున్న పల్లెలకు గ్రంథాలయము లేని చోటులకు 15 దినముల కొకసారి మోటారు మీదనో బండిమీదనో కొన్ని గ్రంథములను దీసికొని పోయి వారి కిచ్చుచుందురు. వారు చదివి జ్ఞానాభివృద్ధిని జేసికొందురు. కాని ప్రతిగ్రామము నందును దేవాలయముతోపాటు గ్రంథాలయముగూడ యుంట యుత్తమము.

గ్రంథాలయములతోపాటు వార్తాపత్రికలున్న గాని పూర్ణతరాదు. వార్తాపత్రికలు ప్రపంచముయొక్క మూలమూలలనుండి వలవేసి తెచ్చినట్లు నానావార్తలను గొని తెచ్చును. ప్రస్తుతకాలమున బ్రతివాఁడును వార్తాపత్రిక కాఁకలిగొని యెదురు చూచుచుండును. అనుక్షణమును బ్రపంచము మాఱిపోవు చున్నది. దినదినమునకు రాజకీయ, వాణిజ్య, భాషా, సంఘ, మత విషయములలోఁ బరిణామము జరుగుచున్నది ప్రజలాయా విషయములను, ఊచముట్ట తెలిసికొని వానినిఁ బట్టి తన జీవితమున మార్పులు చేసికొనవలసి యున్నది. అట్లు చేసికొననిచో మిగిలిన సంఘమువారి దొక మార్గమును వారిదొక మార్గమును నగును. వారు వెనుకఁబడి యుందురు. ప్రపంచపరిణామమును బట్టి తానును మాఱవలయునన్న మానవుఁడు పత్రికలను దప్పక చదువ వలయును. గ్రంథాలయములును వార్తాపత్రికా మందిరములు నొక్కెడ నుంటవలనఁ బ్రజలకు నిబ్బడి మేలబ్బును.

గ్రంథాలయములందుఁ బురాణశ్రవణము సేయించుట వలనను సామాన్య ప్రజలలో విద్యాప్రబోధముకలుగును.

గ్రంథాలయములకు స్వకీయభవన ముండవలయును. అచ్చట నాదర్శ పురుషుల చిత్రపటముల నుంచవలయును. స్వభవనమున్నఁగాని యాయా సభల కవకాశముండదు.

పెక్కుచోట్లఁ గులకక్షలనుబట్టియు మత కక్షలను బట్టియు నేర్పడిన పట్టుదలవలన గ్రంథాలయములు పాడువడు చున్నవి. ఇది సోదరులు పరస్పరమును గొట్లాడి తమతల్లి నెవ్వరును సాఁకక వెడలఁగొట్టి నట్లున్నది. ఇట్లుసేఁత యన్యాయమును నధర్మము నని యెల్లఱకును దెలిసిన విషయము.

గ్రంథాలయములనే కళాశాలలుగాఁ జేసికొని పుస్తక ములనే గురువులుగాఁ జేసికొని స్వయంకృషిచేసి విద్యనార్జించి గొప్ప విద్వాంసులైన వారన్ని దేశములందును గలరు.

విద్యావంతులు దక్కువగానున్న మన హిందూదేశ మున గ్రంథాలయము లెన్నియున్నను హెచ్చుగాదు. దేశాభి వృద్ధి విద్యాభివృద్ధి మూలకము. విద్యాభివృద్ధి గ్రంథాలయ మూలకము. అట్టి గ్రంథాలయముల నిర్వహణార్థము ధనము గావలసి యుండును. పరిపాలకులును, వదాన్యులగు మహా త్ములును సాహాయ్యము చేయుచున్నఁగాని యిట్టి గ్రంథాల యములు పైనొడివిన యాశయములకు నెఱవేర్పఁ జాలవు.

మరియు బంధుగ దినముల భిక్షలు ప్రోగుసేసియు, లాటరీ పద్ధతులేర్పఱచియుఁ, జందాలే నేర్పఱచియు ద్రవ్యమును సంపాదింప వలయును.

# 8. విద్యయొక్క లక్ష్యమేమి?

ప్రపంచమున్నంత కాలమును శబ్దరూపమైన దీపము వెలుఁగకున్నచో నీముల్లోకములును జీఁకటిలోమునిఁగి యుండెడివియని దండివచించెను. అనగా విద్యమానవుని యజ్ఞానావృతమగు మనోగృహమునకు దీపకళిక. (విద్యాశబ్దముయొక్క వ్యుత్పత్త్యర్థమును బరిశీలించినను ("వేత్తి అనయా విద్యా" సర్వమును దెలిసికొనుటకు సాధన భూతము) పైనుడివిన యర్థము స్ఫురించును.

కొందఱమతమున విద్యలు పదునాలుగు. అవి చతుర్వేదములు, షడంగములు, మీమాంస, న్యాయశాస్త్రము, పురాణములు, ధర్మశాస్త్రము, మఱికొందఱమతమునబదునెనిమిది. అవిపైనిఁ బేర్కొనఁ బడినవి పదునాల్గును, ఆయుర్వేదము, ధనుర్వేదము, నీతిశాస్త్రము, అర్థశాస్త్రము. ఇవిగాక చతుష్షష్టి కళలుగలవు.

---

చతుష్షష్టికళలు:— 1 గీతము 2 వాద్యము 3 నృత్యము 4 ఆలేఖ్యము. 5. విశేషకచ్ఛేద్యము 6 తండులకుసుమ బలివికారము 7 పుష్పాస్తరణములు. 8 దశనవసనాంగరాగములు 9 మణిభూమికాకర్మ 10 శయనరచనము. 11 ఉదకవాద్యము 12 ఉదకాఘాతము 13 చిత్ర

విద్యయొక్క లక్షణమేమి? అనివిచారించుటకుఁ బూర్వము మానవుని లక్ష్యమేమి? యనుదానిని విచారింపవలయును. మానవలక్ష్యమే విద్యాలక్ష్యమగును. కనుక మానవలక్ష్య విద్యాలక్ష్యశబ్దములు సమానార్థకము లనవచ్చును.

ధర్మార్థకామమోక్షములను నాల్గింటినిఁ బురుషార్థము లని వ్యవహరింతురు. పురుషార్థములనఁగా బురుషుని లక్ష్యములు

---

యోగములు 14 మాల్యగ్రథన వికల్పములు 15 శేఖరాపీడ యోజనము 16 నేపథ్యప్రయోగములు 17 కర్ణపత్ర భంగములు 18 గంధద్రవ్యయుక్తి 19 భూషణయోజనము 20 ఇంద్రజాలములు 21 కుచమారయోగములు 22 హస్తలాఘవము 23 విచిత్రశాక యూషభక్ష్య క్రియలు 24 పానకరసరాగాసవయోజనములు 25 సూచీవానకర్మలు 26 సూత్రక్రీడలు 27 వీణా డమరుక వాద్యములు 28 ప్రహేళికలు 29 ప్రతిమాల 30 దుర్వాచకయోగములు 31 పుస్తకవాచనము 32 నాటకాఖ్యాయికాదర్శనములు 33 కావ్య సమస్యాపూరణము 34 పట్టికావాన వేత్ర వికల్పములు 35 తర్కుకర్మలు 36 తక్షణములు 37 వాస్తువిద్య 38 రూప్య రత్న పరీక్షలు 39 ధాతువాదములు 40 మణిరాగాకరజ్ఞానములు 41 మేషకుక్కుట లావక యుద్ధవిధులు 42 వృక్షాయుర్వేద యోగములు 43 శుకసారికాప్రలాపనము 44 ఉత్సాదన సంవాహన కేశమర్దనములు 45 అక్షర ముష్టికాకథనము 46 మ్లేచ్ఛిత వికల్పములు 47 దేశభాషా విజ్ఞానము 48 పుష్పశకటిక 49 నిమిత్తజ్ఞానము 50 యంత్రమాతృక 51 ధారణమాతృక 52 సంపాద్యము 53 మానసిక కావ్యరచనము 54 అభిధాన కోశము 55 ఛందోజ్ఞానము 56 క్రియాకల్పము 57 ఛలితక యోగములు 58 వస్త్రగోపనములు 59 ద్యూతవిశేషములు 60 ఆకర్షక్రీడ 61 బాలక్రీడనకములు 62 వైనయిక విద్యాజ్ఞానము 63 వైజయిక విద్యాజ్ఞానము 64 వ్యాయామిక విద్యాజ్ఞానము.

(The aims of the man). పురుషునిలక్ష్యములు ధర్మార్థకామమోక్షములయినప్పుడు విద్యకును నదియేయగును.

ధర్మార్థకామమోక్షంబులనఁగా నేమి? వానినొక్కొక్కదానిచే మనము విమర్శింపవలయును. సమాజక్షేమము కొఱకుఁ బెద్దలు విధించిననీతి (Righteousness) ధర్మశబ్దవాచ్యము. ఇది సమాజక్షేమమూలకముగా సత్వశుద్ధిని గలిగించి జ్ఞానకారణమై యాత్మోన్నతికి లేక మోక్షమునకుఁ గారణమగును. ధర్మములయిదు. అహింస, సత్యము, అస్తేయము, శౌచము, ఇంద్రియనిగ్రహము. వీనినే సనాతనధర్మములందురు.

పురుషార్థములన్నిటిలో ధర్మముప్రధానము. అర్థకామము లప్రధానములు. దీనినిఁగూర్చి చెప్పఁబడిన యీక్రింది వాక్యములఁ బరిశీలించినచోఁ బూర్వులకు ధర్మమునందుఁగల యభినివేశము వ్యక్తమగును.

అనిత్యాని శరీరాణి విభవోనైవశాశ్వతః
నిత్యం సన్నిహితోమృత్యుః కర్తవ్యోధర్మసంగ్రహః.
ఊర్ధ్వబాహుర్విరౌమ్యేష నచకశ్చిచ్ఛృణోతిమామ్.
ధర్మాదర్థశ్చ కామశ్చ సధర్మః కింనసేవ్యతే?
సపదివిలయమేతు రాజ్యలక్ష్మీః
ఉపరిపతంత్వథవా కృపాణధారాః
అపహరతుతరాం శిరఃకృతాంతో
మమతుమతిర్నమనాగపైతుధర్మాత్.
'ధర్మోజయతి.'
'ధర్మోరక్షతి రక్షితః.'
'ధర్మేణహీనాః పశుభిస్సమానాః.'

ఇట్లు మహర్షులు పెక్కుభంగుల ముక్తకంఠమున ధర్మప్రాధాన్యము నుద్ఘోషించిరి. ఇది ప్రథమలక్ష్యము.

పై వాక్యమువలన ధర్మమొక్కటియే ప్రధానలక్ష్యమగుచో నర్థసంపాదన మెట్లు? అదియక్కఱలేదా? వలసినచో ధర్మాచరణ మెట్లు? అన్నచోఁ బురుషుఁడు ధనమార్జింపవలయును. ప్రవృత్తిమార్గమున నున్నవాని కర్థము కావలయును. తత్సంపాదనమునకుఁ బెక్కుమార్గములు గలవు. "అర్థస్య పురుషోదాసః దాస్యస్త్వర్థో నకస్యచిత్" అన్నట్లు ప్రతివాఁడును ధనమునకు దాసుఁడగును. దానికొఱకుఁ జేయరాని పనులు చేయును. ప్రతివాఁడు నేదో విధముగా ధనికుఁడు కాఁగోరును. కొందఱు కూటసాక్ష్యములు పలికి, కొందఱు చౌర్యములు చేసి, కొందఱు ప్రజల బీడించి, లంచములు గ్రహించి, కొందఱు రాయభారములు సంఘించియు ధనమును గడింతురు. పరులను మోసగింపనిదే యెవ్వఁడును గొప్పధనికుఁడు గా నేరఁడు. ఈ విధము ధర్మధ్వంసకము. ప్రధానలక్ష్యమగు ధర్మము ధ్వంసముకాని విధమునఁ బురుషుఁడు ధనమార్జింప వలయును. అట్టివాఁ డెప్పుడును బెద్దధనికుఁడుగా నేరఁడు. లభించిన కొలఁది ధనముననే సంతృప్తుఁడయియుండవలెను. ధర్మము ధ్వంసమయినచో మానవత్వమే తొలఁగును. ఆ సంపాదించిన యర్థమును దాను గూడఁ బెట్టుకొని తరతరములదాఁక ననుభవించుటకుగాదు. ఒకచేత ధర్మహాని లేకుండ ధనమార్జించి మఱొకచేత ధర్మరక్షణముననే వినియోగింపవలయును.

పెక్కండ్రుకష్టపడి ధనమార్జించి దానినిఁ దాము గుడువక, ధర్మకార్యములకు వెచ్చింపక, తుదికిఁ తమబిడ్డలకు వప్పగించి పోవుదురు. ఆ బిడ్డలు ధనసంపాదన క్లేశమెఱుంగని వారగుటఁ జేతికందిన యా ద్రవ్యమును జలమునువలె వాడుచుఁ గొలదిదినములకే పాడుచేయుచున్నారు. కనుకఁ బురుషుడు తనుసంపాదించిన ధనము ధర్మవిరోధము లేకుండ దానను భవించుచు ధర్మసంరక్షణార్థము వెచ్చింపవలయును. తండ్రితమ బిడ్డలకు విద్యాబుద్ధులొసఁగి స్వతంత్ర జీవనము సేసికొను యోగ్యులుగాఁ జేయవలయును గాని తనకడుపు మాడ్చుకొని ధనరాసులీయఁ గోరరాదు.

పురుషుఁడు ధర్మహానిలేకుండఁ దాను సంపాదింప వలసిన దానికన్న నధికము సంపాదించుటయుఁ దనకడ నుంచుకొనవలసిన దానికన్న నధిక ముంచుకొనుటయుఁ మహాపాపమని పెద్దల యాశయము. కనుక ధర్మవిరోధము గాని యర్థసంపాదనము రెండవలక్ష్యము.

కామమనఁగా నైహికభోగముల ననుభవించుట. పురుషుఁడర్థదాసుఁడగునట్లు కాంతాదాసుఁడు నగుచున్నాఁడు. "ఎంత నేర్చినా ఎంతచూచినా యెంతవారలైనా కాంతా దాసులే" లోకములోఁ గాంతా కనకములు రెండేమనుష్యుని వ్యాముగ్ధునిఁ గావించునవి. పురుషుఁడు గృహస్థ ధర్మమునఁ బ్రవేశించి తన భార్యతో ధర్మార్థ విరోధము గాకుండ సంసార సౌఖ్యముల ననుభవించుట యుత్తమమగు కామ

పురుషార్థము. ధర్మావిరుద్ధమగు కామముయొక్క స్వరూప మను నేనే (ధర్మావిరుద్ధో భూతానాం కామోఽస్మి భరత ర్షభ!) యని శ్రీకృష్ణుఁడు చెప్పియున్నాఁడు. అట్లుగాక తనకుధనముగలదని పెక్కండ్రు స్త్రీలను బెంగ్లాడిలేక యుంపుడు కత్తెలనుంచుకొని వారితోఁ గాలాకాల నియమ శూన్యముగా సంచరించుచు వారలఁగూడి పానరతుఁడై జలక్రీడాదులఁ దేలుచు, వారల మోహపఱుప నిమిష నిమిషమునకు నానా వేషములఁదాల్చుచు, శృంగారాపతారమువలెఁ జరించుట ధర్మార్థ ధ్వంసకము. తనభార్యతోనైన నింద్రియ నిగ్రహ పూర్వకముగా నియమవిరోధము గాకుండఁ బ్రవర్తింప వలయునుగాని మితిమీఱి ప్రవర్తింపరాదు. భార్యాభర్తల సౌందర్యాలంకారములు పరస్పరాకర్షకములుగా మాత్రము యుండవలయును గానీ పరపురుష పరకాంతాకర్షకములుగా నుండరాదు.

ఇఁక మోక్షమనఁగాఁ బురుషుఁడు జన్మపరంపర నుండి విడుదలఁగాంచుట. స్వర్గమోక్షములు భిన్నములు. స్వర్గమునకుఁ బోయినవారికిఁ బునరావృత్తికలదు. మోక్ష మొందిన వారికి బునరావృత్తిలేదు. అట్టిమోక్షము బరమ పురుషార్థము. దానినెట్లు పొందుట? పైనఁజెప్పిన ధర్మార్థ కామములు పరస్పర విరోధము పొసఁగకుండ ననుభవింప వలయునని చెప్పియుంటినిఁగదా! అట్లనుటవలనఁ బురుషుఁ డరిషడ్వర్గమును (క్రామ క్రోధ లోభ మోహ మదమాత్స

ర్యములు అనఁగా అంతశ్శత్రులు (internal enmies) లోఁ గొని ప్రవర్తింపవలయునని తేలుచున్నది. కానున్నఁ బరస్పరా విరోధముగా ననుభవించుట పొసఁగదు. ధర్మార్థకామములు పరస్పర విరుద్ధములుగా ననుభవించు వానికి మోక్షము సాధ్యముగాదుగాని పరస్పరావిరుద్ధముగా ననుభవించు వానికి గరతలామలకము.

ఎల్లమతముల వారును పాంచభౌతికమైన యీదృశ్య ప్రపంచములోని పదార్థములకన్న నతీతమగు నొక మహ పదార్థమేదియో యున్నదని దానినిఁ గనుఁగొనుటకై బహు ముఖముల బ్రయత్నించిరి. మనపూర్వులు దానినిఁ గనుఁ గొనిరి. అదియే పరతత్త్వము. ఆ పరతత్త్వానుభవము వలనఁ బుణ్య పాపక్షయముఁ బొంది పురుషుఁడు మోక్షమును బడ యునని వారునుడివిరి. ప్రవృత్తిధర్మములయినను ధర్మార్థకామ ములు నియమ పూర్వకముగాఁ బాలించినచో నివృత్తిధర్మ మగుమోక్షమునకు భంజకములు గాక సాధకము లేయగును.

కనుక ధర్మార్థ కామమోక్షములు పురుషునిలక్ష్యము లయినప్పుడు విద్యయొక్క లక్ష్యము నవియేయగును. అనఁగా విద్యవలనఁ దత్పురుషార్థస్వరూప మెఱుఁగవలయును. అట్టి విద్యయేయుత్తమవిద్య ఉపనిషత్తులలో విద్యయన నీశ్వరప్రా ప్తసాధనమేయని చెప్పబడినది. మిగిలినవిద్య లుదరపోషణా ర్థకములు. వేదవేద్యునివర్ణించు విద్యవిద్య" అని ప్రహ్లాదుడు చెప్పి నాఁడు. హేమచంద్రుడను విద్వాంసు డిట్లనుచున్నాఁడు.

ఉపశమఫలాద్విద్యా బీజాత్ఫలం ధనమిచ్ఛతో
భవతివిఫలో యద్యాయాస్త దత్రకిమద్భుతమ్
న నియతఫలాఃకర్తుర్భావాః ఫలాంతరమీశతే
జనయతి ఖలు వ్రీహేర్బీజంనజాతు యవాంకురమ్.

విద్యా బీజమునకు నుపశమము ఫలము. దానివలన నన్యఫలమైన ధనము గోరువాడు విఫలుడగుచున్నాడు. నియతఫలకములగు కర్తృభావము లన్యఫలము సీయవు. వరిగింజ వలన యవాంకురము మొలవదు) విద్యాబీజమునకు ఫలముపశమము లేక యుపరతి లేక వైరాగ్యము. తన్మూలకమగు మోక్షము. కనుక విద్యలకు లక్ష్యము పారమార్థిక సత్యాన్వేషణమే కాని మనము తలంచుచున్న విధముగా ధనము గాదు.

---

# 9. నాగరకత.

మానవుడు విద్యవలన నేర్చుకొను విషయములలో ముఖ్యమయినది నాగరకత. ఏకవిద్య నభ్యసించిన నానాగరకతయబ్బును. కేవలసంస్కృతవిద్యాభ్యాసమొనర్చిన విద్యార్థియాప్రాచీన సాంప్రదాయ బద్ధమగు నాగరకతనే యవలంబించియుండును. ఆంగ్లవిద్య నభ్యసించినవారు పాశ్చాత్యనాగరకతాను కూలముగా సంచరింతురు.

నాగరకత యననేమి? ఈ కాలమున నాగరకతయన్న దిన దిన ప్రవర్ధమానమగు పాశ్చాత్య సాంప్రదాయాను

సారముగా వేషభాషలును, ఆచార వ్యవహారములును, నవ లంబించియుంటయని పెక్కండ్ర యభిప్రాయము. పాశ్చాత్యుల నెంతయనుకరించిన నంత నాగరకతయని వారియుద్దేశము. ఆంగ్లవిద్యాభ్యాసకులగు స్త్రీ పురుషులలో నూటికిం దొంబదితొమ్మిదిమంది "మధ్య వైష్ణవునకు నామములు పెద్ద" యన్నవిధమున నొక్కొక్కెడ నా సంప్రదాయావలంబనమునం బాశ్చాత్యులనుగూడ నతిశయించు చున్నారు. మన యీ యనుకరణమునుగాంచి పాశ్చాత్యులు తమ యనుకార్యత్వమునకు గర్వించు చున్నారు. మనహృదయమును వానరమునుగాం జేసి యాడించుచు మన జాతీయతను నశింపం జేయంగలిగితిమని తమలోందాము నవ్వుకొను చున్నారు. పాశ్చాత్యుండు శుద్ధశ్రోత్రియునివలె వేషముం దాల్చిన మనకెంత హాస్యాస్పదుండుగ గనంబడునో మనమనుకరించుచున్న వారి వేషభాషాచారములంగాంచి యతండు మనల నంత హాస్యాస్పదులనుగాం దలంచును.

పాశ్చాత్యులు తమ విజ్ఞానముచేం గల్పించుచున్న పరస్సహస్రములగు యంత్రములు, విమానములు, విద్యుద్యంత్రములు, రైలుమార్గములు, మొదలగు నానా వస్తువుల వలనమానవుండైహికముగా మిక్కిలి సౌఖ్యము ననుభవించు చున్నాండు. ఐహికముగా నెంతసౌఖ్య మనుభవింప సాధ్యమగునో యన్నివిధములగు నుపాయములను ప్రకృతిశాస్త్ర మూలకముగాం గనిపెట్టు చున్నారు. మన ప్రాచ్యనాగరకత

మానవునకట్టి సదుపాయములను గల్పింపలేదు. కనుకం బాశ్చాత్య నాగరకతయే యాదర్శప్రాయమని కొందఱు తలంతురు. నిశ్చయమే. కాని యైహిక జీవనమునకుఁ బ్రకృతి రహస్యములను వెల్లడించి పాశ్చాత్య నాగరకత గల్పించిన సదుపాయము లైహికదుఃఖ పరంపరఁ దొలగించి పారమార్థిక సత్యాన్వేషణమున కావంతేనియుఁ జేయలేదు. పాశ్చాత్య నాగరకత జీవితమునకు లక్ష్యభూతముగల ధర్మమోక్షములను మనల దూరముఁ జేయుచున్నది. అర్థకామములే పాశ్చాత్య నాగరకతకు లక్ష్యము. పాశ్చాత్య విజ్ఞానమైహిక వాంఛలను బెంచు నభినవ పదార్థజాతమును సృష్టించుచు మానవునిమనస్సు నాకర్షించి వెఱ్ఱెత్తించుచున్నది. అనాగరకత వలన మనుష్యుఁడీశ్వరునకు నతిదూరస్థుఁడగుచున్నాఁడు. దానివలన నాస్తికత్వము రూపఱినాస్తికత్వమే ప్రబలుచున్నది. మానవుఁ డాత్మఘాతి యగుచున్నాఁడు. అనఁగాఁ దనలోనున్న యీశ్వరాంశమును గ్రహింపలేక నశించుచున్నాఁడు.

ప్రాచ్యులగు నార్యులైహిక భోగార్థమగు విచారణకన్న మరణానంతరమునుగూర్చి మిక్కిలి విచారించిరి. అనఁగాఁ బ్రాణి మరణించిన పిమ్మటమరల జన్మించునా? పూర్వజన్మ గలదా? మరల జన్మించెడు నెడల నెంతకాలములో జన్మించును? ఏవిధముగా జన్మించును? మనకంటి కగపడులోక మొకటియేనా? వేఱులోకములు గలవా?

ఆ యాలోకములకెట్లు పోవుట ? ధర్మాధర్మములు, పుణ్యాపుణ్యములనఁగా నేమి? వీనిఫలము లేమి? మానవుఁడు పుట్టుచుఁ జచ్చుచు మరలమరలఁ బుట్టుచుఁ జచ్చుచునుండును. ఈ విధమగు జన్మపరంపరనుండి తప్పించుకొను సాధనమేమి ? లోకములోఁ బ్రతివానికిని సుఖముకన్న దుఃఖమెక్కువ. అట్టి దుఃఖమును విస్తరించి శాశ్వతానందమును బొందు సాధనమేమి ? అని విచారణసేసి తదనుకూలమగు నైహికమార్గము నేర్పరుచుకొనిరి. అర్థకామప్రధానములగు నైహిక భోగములు సర్వదా ధర్మమోక్షప్రతిబంధకములు గనుకనుఁదావా ధర్మమోక్షములనే లక్ష్యముగాఁ దలంచిన వారగుటను నైహిక భోగార్థమగు విచారణను బ్రాచ్యులు సేయరైరి. పాశ్చాత్యుఁలీ విచారణము బొత్తుగా జేయరైరి. అంతర దృష్టితో యింతింత విచారణ చేసిన ప్రాచ్యులకు పాశ్చాత్యులు నిర్మించుచున్న నానాయంత్ర జాతమును సృష్టించుట యొక విషయముగాదు. పాశ్చాత్యులుత్తమోత్తమముగా భావించిన యైహికభోగములు ప్రాచ్యులు కడుంగడుఁ దుచ్ఛములుగా విషప్రాయముగాఁ బంకమయములుగాఁ దలంచిరి. ఒకరు సంసారము సముద్రమన్నారు. మరొకరు మహారణ్యమన్నారు. వేరొకరు రంధకూపమన్నారు. ఇంకొకరు జంబాలపటలమన్నారు. ప్రాచ్యులీవిధముగా నైహిక జీవనమును రోసిరి. ప్రాచ్యులు రోసి నీరసమని త్రోసి వేసిన యైహిక జీవనమును పాశ్చాత్యులు మన్నించు

చున్నారు. ఇంతకన్న నన్యముగా వలయునది లేదనియు సూచించుచున్నారు. కాళిదాసుని శాకుంతలములో శారద్వతుఁడైహిక భోగసక్తునిగూర్చి యిట్లనుచున్నాఁడు.

> అభ్యక్త మివస్నాతః, శుచిరశుచిమివ, ప్రబుద్ధ ఇవసుప్తమ్,
> బద్ధమివస్వైరగతీ ర్జనమిహసుఖసంగిన మవైమి.

ప్రాచ్యుల దృష్టిలోఁ బ్రతీచ్యు లిట్లుండిరి. దీనిఁబట్టి మన ప్రాచ్యు లిప్పటి ప్రకృతి రహస్యములను వెల్లడించు యంత్ర సామగ్రిని నైహిక భోగార్థము సృజింపమికిఁ గారణము దృష్టిభేదమని గ్రహింపవలయును.

ఈకాలమునఁ బాశ్చాత్య సంప్రదాయముల ననుసరించుచు నాగరకులమని చెప్పుకొనువారిలో ముప్పాతిక మువ్వీస మనాగరకులనియే నామతము. ఏలనఁ బరవంచన, అనృజుత్వము, ఆత్మసంభావన, అహంకారము, దర్పము, మదము, వారియందుఁ గరుడు గట్టియున్నవి. వారికిఁ ద్రికరణశుద్ధి శూన్యము. అట్టివా రధికారపదవియందుంటచేఁ దమమాట చెలామణియగును. కనుకఁ దమక్రింది సాధులగుసేవకులపైఁ గుఱూపి సుఱూపిపై నిఁబోలెఁ దోఁడేలు మేఁకపిల్లపయిఁబోలె నిష్కారణవైరము వహించియుండి సమయముఁగనిపెట్టి దోషారోపణముసేసి కొలువుఁదొలఁగింతురు. అట్టివారసత్యమాడినను, బాపమొనర్చినను లోకమువిశ్వసింపదు. కవులు వారినే మహాపురుషులనుగా వరింతురు. శ్రీమహావిష్ణువు నవతారమని స్తుతింతురు. వందిమాగధులు కైవారములు సేయు

దురు. ప్రజలు బ్రహ్మరథము పట్టుదురు. బిరుదములిత్తురు. ఆతనిననుకరించుట పరమపురుషార్థమని యువకజన మభిలషించును. ఇట్టినాగరకమ్మన్యులు పెక్కండ్రధికారులయి స్వార్థపరులై వెలుపలకు స్వార్థశూన్యులవలెఁ బ్రవర్తిల్లుచుంట యనుభవసిద్ధము.

అట్లుగాక త్రికరణశుద్ధి, ఋజుత్వము, సత్యము, ధర్మబుద్ధి, సరళప్రకృతి, పరోపకారబుద్ధియునుగలిగి ప్రవర్తిల్లువాఁడు నాగరకుఁడని నామతము. విద్యాఫలమగు వివేకమును బొందినవాఁడాతఁడేకదా యగును. ఒక్కొక్కెడ విద్యావంతులనాగరకులుగను విద్యాహీనులే నాగరకులుగను నుందురు. నాగరకత్వమనఁ గేవల బాహ్యవేష పరివర్తనము గాదు. డంబాచారముఁగాదు. నాస్తికత్వముగాదు. అర్థకామైకపరత్వముగాదు. నాగరకత్వమన సాధువృత్తము. ఈనానారమ్యదృశ్యములుగలిగి సుందరీసందోహముతో శోభిల్లుచు నేత్రానందముఁ గూర్చు నీప్రపంచమును నీరసముగా, నసహ్యముగా, విషప్రాయముగా శ్మశానతుల్యముగా బంధకముగా భావించి త్రోసిరాజని పరమేశ్వరరూప మధుర వస్తురుచిని మఱిగి రేయుంబవలు తదన్వేషణమునఁ గాలముపుచ్చుచు, సౌధమును వదలి గిరిగుహావాస మొనర్చుచు, బంచభక్ష్యపరమాన్నంబులు ద్రోసి కందమూల ఫలాదుల తున్నితృప్తినిఁ గావించుచు, నమూల్యాంబరముల నావలకుఁద్రోసి గోచీపాతలఁదాల్చుచు, పరిమళద్రవ్యములఁ బారవేసి బూదె నలఁదుచు నిరంతర ధ్యానమగ్నులై యైహికదుఃఖ పరంపరఁ

దాఁటి శాశ్వతానందమును బొంద బ్రహ్మసాక్షాత్కారమునకుఁ బరితపించుచున్న వారలే యథార్థముగా నాగరకులనఁదగుదురు. కనుకనే మనప్రాచ్యనాగరకత పట్టణముల కెక్కక పర్వతారణ్యముల బట్టినది. జనకుఁడు, బుద్ధుఁడు, రాముఁడు మొదలగు నాధర్మ పురుషులు నాగరకులు, అట్లే సీత, సావిత్రి, అనసూయ మొదలగుస్త్రీలు నాగరకులు.

ఇప్పుడిప్పుడు పాశ్చాత్య విద్వాంసులు ప్రాచ్యనాగరకతా రహస్యమును గ్రహించి తమ నాగరకతకన్నఁ బ్రాచ్యనాగరకతయే శ్రేష్ఠతరమని ప్రశంసించు చుండిరి. అనేకులు తమజీవిత లక్ష్యమును మార్చుకొనిరి. ఈ మన నాగరకత విశ్వప్రపంచమున కవలంబనీయము. ఇంతకన్న నుత్తమనాగరకత మరొకటిలేదు. ఒకకవి.

గీ. విశ్వజాతికి నొకబడిపెట్టివారి
కొక్క టెపారముం జెప్పి యుచ్చకంఠ
మునను బాడించిన యఖండపూజ్య శేము
షీమహిమవంతు లీ జ్ఞానభూమివారు.

అని హిందూదేశ మెల్ల దేశములకును గురుస్థానమని వర్ణించెను. మరియు

కం. కొనిపోవుఁ బ్రాచ్యసభ్యత
జనధర్మాశ్రయతి దేవుసన్నిధి! కనుపున్
వెనుకకు బ్రతీచ్యసభ్యత
ఘనార్థకమై బద్ధకావుటసతమున్.

అనినిరూపించెను.

# 10. విద్యార్థి విధులు.

మనుష్యునకు విద్యార్థి దశవంటి యుత్తమదశ లేదు. "నాళ్ళలో కెల్లా చిన్ననాఁడే మేలు" అని లోకోక్తియుఁ గలదు. విద్యార్థిదశను వదలి జీవయాత్రను నడపుచున్న వారు పెక్కురు చిన్ననాఁటి విద్యార్థి దశను ప్రసంగవశమున స్మరించుకొని యానందించుచు "తే హినో దివసాగతాః" అని నిట్టూర్పుపుచ్చు టెల్లరెఱిఁగినదే. మనుష్య జీవితములో నాకాల మమృతమయము. ఆనంద పరిపూర్ణము.

విద్యార్థికి సంసారమునకు సంబంధించిన చీకు చింత లుండవు. అనఁగా గృహస్థున కున్నన్ని యీతిబాధలుండవు. తల్లిదండ్రులో పాలకులో వారికి వలసినధనము, వస్త్రములు, భోజనము, పుస్తకములునో కటేమి? కావలెనన్నఁ గొండ మీఁది కోఁతినిఁ గూడఁ దెచ్చియిత్తురు. అతఁడు తన కాల మంతయును విద్యావ్యాసంగముననే కడప వలయును. దానిలోనే మునిఁగి తేలవలయును. తల్లిదండ్రులును బాలకులును దాము పస్తుపరుండియైనఁ బుత్రునకు విద్యకొఱకు ధనము వెచ్చింతురు. అట్టియెడ దమకొఱకు వెచ్చింపఁ బడు ధనమునకుఁ దగినంత ప్రతిఫలము విద్యార్థి కృతజ్ఞతా రూపముగాఁ దిరిగి చూపవలయును. ప్రతిఫలమన విద్యావ్యాసంగమే. ఆతనికన్యవ్యాసంగము దగదు.

వర్షార్థమష్టౌ ప్రయతేత మాసాన్
నిశార్థమర్థం దివసే యతేత
వార్ధక్యహేతో ర్వయసా నవేన
పరత్రహేతో రిహజన్మనా చ.

"వర్షాకాలమున సుఖముగా ననుభవింప మిగిలిన యెనిమిది మాసములును ధనమును సేకరింపవలయును. రాత్రికొఱకుఁ బగట సంపాదనము సేయవలయును. ముసలి తనమున సుఖంపఁ బ్రాయమున నర్థమార్జింప వలయును" పరలోకమున సుఖపడని జన్మమున ధర్మమార్జింప వలయును" అన్న చందమునఁ దన భవిష్యజ్జీవితము నిరుప ద్రవముగా నిష్కంటకముగా నాదర్శప్రాయముగా నానంద మయముగా నడపుకొనుటకు మనుష్యుఁడు విద్యార్థి దశలోఁ బ్రయత్నింప వలయును. ఆ కాలమున నతఁడభ్యసించిన విద్యయు నాతఁడు గణించిన వినయాది సద్గుణ సంపత్తియు నెరువులై వాని జీవిత క్షేత్రమును బహుముఖములఁ బంటఁ బండించును. భవిష్యజ్జీవితసౌధమునకు వలసిన గట్టిపునాది వేసికొనవలసిన సమయము విద్యార్థిదశయే.

విద్యార్థిదశలోఁ గఱవవలసిన గుణములు:- 1 సత్ప్ర వర్తన, 2 మితవ్యయము, 3 పరోపకారము, 4 దేవగురుభక్తి 5 దేశాభిమానము, 6 పరిశుద్ధత, 7 నిశ్శబ్దత, 8 క్రమముగా బాఠశాల కరుగుట, 9 ఇతరప్రసంగములలో జోక్యమును గలిగించుకొనకుండుట.

సత్ప్రవర్తన:— గీ. నీతిలేనివాని నిందింత్రు లోకులు
లేదు సేగిలాతి లేకయున్నఁ
గానమానవుండు మానక నయవిద్య
గడనసేయ మొదలఁ గడఁగవలయు.

అని పెద్దలనిరి. మరియు "నీతిలేనివాఁడు గోఁతికన్నఁ బాడు" నీతిలేనిమాట గాలిమేటు అనియు లోకోక్తులుగలవు. కనుక మనుష్యునకు నీతివెన్నెముకవంటిది. నీతియన సత్ప్రవర్తన. విద్యార్థిదశలో బాలకుఁడు చెడిపోవుటకుఁ బెక్కవకాశములు గలవు. ఆకతాయిలును దిప్పకాయలు నగుమిత్రులుందురు. దగ్గఱఁదలిదండ్రులుండరు. చేతఁగొలఁదిగానో గొప్పగానో డబ్బులెగురుచుండును. కన్నుల నాకర్షించు దృశ్యములెన్నెన్నో కనఁబడుచుండును. సద్గుణము లలవడుట కష్టముగాని దుర్గుణములలవడుట సుకరము. విద్యార్థి కాయా దురభ్యాసము లలవడుట సహజము. కనుక విద్యార్థి విద్యతోపాటు సత్ప్రవర్తన సంపాదింపవలయును. "విద్యవలనఁ గలుగు వినయంబు" అని విద్యకు ప్రధానఫలము వినయమునుగా జెప్పిరి. మానవుఁడు విద్యావంతుఁడుగా వచ్చునుగాని సత్ప్రవర్తనాపరుఁడగుట దుర్ఘటము. సత్ప్రవర్తనను సర్వకల్యాణములనిచ్చును. దాని వంటి శస్త్రము లేదు. తమ శుద్ధప్రవర్తన నుండి యొకసారిజాఱినా "నూరు నోములు నోక్క రంకుతో జెల్లె" నన్నట్లు లోకము దెగడును.

మ. పరహింసాపరకీయ విత్తహరణా భావంబు సత్యవ్రతా
దరమున్ దానపరత్వ మన్యజనకాంతా సూక్తిమూకత్వమున్

పరతృష్ణాపుర భంజనంబు సుగుణ ప్రతత్వంబుసున్ ప్రాణభృ
త్కారుణ్యాశాస్త్రసమత్వ సద్విధులు భద్రప్రాప్తికిన్ మూలముల్.

కనుక విద్యార్థి సీయుత్తమ ధర్మముల నవలంబింప వలయును. ధర్మమే జయించునుగదా! మొదట నొక్కొక్కెడ నధర్మము జయించి నట్లగపడినను గుక్కగొడుగువలె నది యల్పకాలముననే యడగును. తుదికి ధర్మమే జయించును.

మితవ్యయము:— తల్లిదండ్రులు పెక్కండ్రు విద్యావంతులుగా నుండరు. తమపుత్రుఁడు చదివి సంపాదించి తమ్ముస్వర్గలోకములో నుంచునని యాశించి తమపొట్టయైనఁ గట్టుకొని యిల్లును నొళ్లును గుల్లచేసికొని యప్పులుచేసి యడిగినపుడెల్ల నాలసింపక ద్రవ్యమును బంపుచుందురు. తల్లిదండ్రులు విద్యాహీనులుగదాయని యసత్యములు చెప్పి బట్టలకనియు, పుస్తకముల కనియుఁ దప్పువ్రాతలువ్రాసి వారంపిన దానిని కాఫీహోటలులకును, సినిమాలకు, నాటకములకు, సోడా,తమలపాకు బీడాలు మొదలగు వానికి బాధ్యతలేక వ్యయపెట్టుట ధర్మముగాదు. బాధ్యతగలిగి తన పరిస్థితులు గనిపెట్టి పెద్దలకు మనఃక్లేశము గలుగకుండ వర్తింపవలయును, "త్రవ్వఁబూనినచో మేరువైనను దఱుగును"గదా. అట్లే వ్యయపఱుపఁబూనినచో నవనిధులును వ్యయమగును. అన్న వస్త్రాది సకల వ్యయములను మితముగాఁ జేయవలయును. అది యలవాటుపడినచో వాని జీవయాత్ర యెట్టి యిడుమపడు

కులును లేక సుఖముగా సాగును. అతివ్యయమున కలవాఁడు పడినవాఁ డధికదుఃఖముల పాలగును. కనుక విద్యార్థిదశలో నేర్వవలసిన గుణములలో మితవ్యయ మొకటి. ఈ మితవ్యయమునకు జన్మస్థానము సరళ జీవనము (Simple life). ఈ రెండు గుణములును బరస్పరాశ్రయములగుట నొకదాని విడిచి మరియొకటి యుండదు. పరోపకారము:-విద్యార్థి తోడి విద్యార్థుల కిక్కట్టు గలిగినచో సాహాయ్యముసేయ సిద్ధముగా నుండవలయును. తన కిక్కట్టు గలిగిన వారును దనకట్లు బాసటనిత్తురు. మరియు బీద విద్యార్థులకుఁ దనపుస్తకములఁ జదువనిచ్చి తన వస్త్రములఁ గట్టనిచ్చి యథాశక్తి ద్రవ్య సాహాయ్యమును జేసియుఁ గనిపెట్టుచుండ వలయును. తరగతి విద్యార్థులలోఁ గొందఱు మందులుందురు. కొందఱమాయికులుగా నుందురు. కొందఱు గురూపులుందురు. అట్టి వారికిఁ గ్రొత్త క్రొత్త నామకరణములుసేసి వారిఁబరిహసించుచు నుడికించుట పాడిగాదు. పరమేశ్వరుఁడెల్లరకు నేదోలోపమును గల్పించును. తనకడనున్నగుణము మరొకరికడలేని మాత్రమున వారిఁ బరిహసింపరాదు. వానికడనున్న వేఱు గుణము మనకడ లేకపోవచ్చును. అట్టివాని దగ్గరించి వారి మాంద్యమును వారి యమాయికత్వమును దొలఁగించివారికి ధైర్యసాహసములు గలిగింపవలయు. ఇది నిజముగా నుత్తమ మగు నుపకారము. నామకరణములకు విద్యార్థులుడుకరాదు. ఉడికినచో మరియు నుడికింతురు. పరుగెత్తువాడు తఱుము

వారికి లోకువగదా. ఈక్రొత్తపేరుల కూర్చుచున్నచో వారే విసివి తొలఁగిపోదురు

దైవభక్తి:—విద్యార్థి తప్పక దైవభక్తి గలిగియుండవలెను. నియమముగాఁ బ్రతిదినమును సాయంప్రాతల నొక్క గంటయైన నీశ్వరోపాసన చేసికొనవలయును. పరీక్షలముందుమాత్రమే లేక సర్వకాల సర్వావస్థలయందును మనలనాతఁడు గాపాడుచున్నాఁడు. ఆతని దయ లేనిదే మనము కాలమైనను గడపింప జాలము. ఎంత కార్యాంతరబాధయున్నను దైవధ్యానమును మానరాదు.

గురుభక్తి:—విద్యార్థికిఁ దల్లిదండ్రుల పిమ్మట గురువే పూజ్యుఁడు. మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ అని వేదము. అట్టి గురువునందుఁ బూజ్యభావము గలిగి తదాశీర్వాదములకుఁ బాత్రుఁడై యుండవలయును. అతని యుపదేశము వేదవాక్యముగా మన్నింపవలయును. బహు విద్యార్థులు గురువు దమకు నెక్కువమార్కులనీయ లేదని దూషింతురు. తాము చక్కగాఁ జదువకున్నను వ్రాయకున్నను గురువు మార్కుల నీయవలయునని వారి సిద్ధాంతము. చాలామంది గురువొక వ్రాఁతపని నీయఁగా దానిని స్వయముగా నాలోచించి వ్రాయక వ్రాసినవాని పుస్తకమునుగొని గురువు దన్నుఁ బట్టుకొననేరఁడని దానిప్రతి వ్రాయుదురు. మరొక తెలివిగలపిల్లవాఁడు దానుబట్టుపడకుండుటకై యదేభావమును మాటలు మార్చివ్రాయును. ఇట్లువ్రాయుటవలన నాతఁడు

ప్రాప్తకాలజ్ఞుఁడగు మీనమువోలె నప్పటి గండమునుండి బయటఁబడుచున్నాఁడు గాని యున్నతినిఁ బొందఁజాలఁడు.

దేశాభిమానము:— కార్యశూరుఁడై బయలుదేర కున్నను విద్యార్థి హృదయమున దేశాభిమాన బీజములను జల్లవలయును. ఇప్పుడు విద్యార్థులుగా నుండువారే ముందు ముందు, దేశనాయకులుగాఁ గలరు. దేశమువారికొఱకెదురు చూచుచుండును, కనుక నాదశలోఁ జల్లిన బీజములు మెల్ల మెల్ల వృక్షరూపమున వర్ధిల్లి జీవయాత్రలో ఫలించును.

పరిశుద్ధత:— Cleanliness is next to godliness. ఈశ్వరప్రాప్తికిఁ బరిశుద్ధిలేక శౌచము సాధనము అని చెప్పుదురు. అనఁగాఁ బరిశుద్ధత యీశ్వరసేవకుఁ బిమ్మటిది. నిత్యస్నానము, ధౌతవస్త్రధారణము, గృహశుద్ధి యివి పరిశుద్ధతా లక్షణములు. ఇవిలేనివాని నందఱు రోయుదురు. మరియు నపరిశుద్ధత రోగములకు జన్మస్థానము. బాహ్యపరిశుద్ధివలన నంతశ్శుద్ధి యేర్పడును.

నిశ్శబ్దత:—తరగతియందును గృహమునను నిశ్శబ్దముగానుండుట, నిశ్శబ్దముగాఁ జదివినపుడు మనసున కెక్కినట్లు బిగ్గరగాఁ జదివిన నెక్కదు, నిశ్శబ్దతవలన నాలోచనాశక్తి యభివృద్ధిపొందును. దానివలన మితభాషిత్వ మలవడును. కొందఱు చెవిగోసిన నక్కవలెఁ దరగతిలో వాగుదురు. అదితగనిపని.

క్రమముగాఁ బాఠశాల కరుగుట :— విద్యార్థి క్రమముగాఁ బాఠశాలకరుగనిచోఁ బాఠములు గతించి పోవును. స్వయముగాఁ దానుజదువుకొన్నచోఁ దెలియవు. పరీక్షలయందు దాయా స్థలములలోఁ బ్రశ్నలు వచ్చినచోఁ దప్పిపోవును. తగినంత కారణములేక విద్యార్థి పాఠశాలకుఁ బోమానరాదు. ఇతరుల ప్రసంగములలో జోక్యము గలిగించు కొనుట:–ఇదితగదు. పరప్రసంగములలోఁ దానుదూఱరాదు. ఇతరుల మాటలు వినుచుఁ దనపఠనమును మానరాదు. చాలమంది విద్యార్థులు పెద్దలు మాటలాడు కొనుచుండఁ జదువుగట్టిపెట్టి పుస్తకములు మూసి వినుచుందురు. తామును నాయామాటలు నడుమనడుమ పలుకుచుందురు. ఇది బాలురకుఁ గూడదు.

## విద్యార్థిచదువ వలసినదెప్పుడు ?

సామాన్యముగా విద్యార్థులు పాఠశాలారంభ కాలమునఁ జదువక పరీక్షలు దగ్గఱించు తఱిఁజదువఁ దొడఁగుదురు. ఆదినములలో రాత్రి టీనీరుత్రాగి రేయి 12 గంటల దాకను జదువుదురు. ప్రొద్దుట 8 గంటలకులేతురు. ఇది యుక్తపద్ధతిగాదు. పాఠశాలారంభకాలము నుండియు దినమునకు రెండుగంటలు చదువుచున్నచోఁ బరీక్షాకాలము నందును నంతకన్న నధికకాలము చదువనక్కఱలేదు. ఒక వేళఁజదువ వలసినను రేయి 9 లేక $9\frac{1}{2}$ గంటదాఁక మాత్రము చదివి వేకువ 4 లేక $4\frac{1}{2}$ గంటలకులేచి చదువుట మంచిది. వేకువఁ జదివిన చదువు పాకుడువలెఁ బట్టుకొనును.

# 11. స్త్రీవిద్య.

"విద్యావిహీనః పశుః" అని భర్తృహరి నొడివెను. విద్యావిహీనుఁడెట్లు పశువో యట్లె స్త్రీయుఁ బశువే, "సర్వస్య లోచనం శాస్త్రం యస్యనాస్త్యంధ ఏవ సః" ఎల్లరకును విద్య నేత్రము, అది లేనివాఁడంధుఁడు, అనఁగా విద్యావిహీనుఁడు కన్నులున్న గ్రుడ్డివాఁడు, అట్లే స్త్రీయుఁ గన్నులుగల గ్రుడ్డిది. విద్యాశూన్యుఁడు సురూపియుఁ గురూపియే. అట్లే స్త్రీయును. ఏలన "విద్యానామ నరస్యరూపమధికం" అనిభర్తృహరి పలికెను. విద్యావాసనలేని వెలఁదియు విరూపియే. విరూపియు విద్యాసత్త్వమువలన రూపవతిగాఁ బరిగణింపఁబడును.

మనదేశమునఁ బురుషవిద్యకుఁగల సౌకర్యములు స్త్రీవిద్యకు లేవు. ఉన్నతవిద్యావకాశము జనపదములకు లేక పోవుటవలన బాలురను తలిదండ్రులు బత్తనములకంపి విద్య నేర్పించినట్లు బాలికలనంపి నేర్పింపరు. పత్తనములందున్న వారయినను బుత్రుల విద్యావిషయమునఁ దీసికొనుచున్నంత శ్రద్ధ పుత్రికావిద్యావిషయమును దీసికొనుటయు లేదు. నూటికిఁ గోటికినొక్కరు మాత్రమట్టి శ్రద్ధవహించుచున్నారు. కనుకనే పట్టణములందయినను బాలకపాఠశాలలున్నన్ని బాలికా పాఠశాలలు గానరావు.

తల్లిదండ్రులకట్టి శ్రద్ధలేమికిఁ గారణములు. ౧. పుత్రులకుఁ జేసినవ్యయము తమవార్ధకమున ఫలవంతమై తమ్ము

సుఖపెట్టునట్లు పుత్రికలకుఁ జేయు వ్యయమక్కఱకు రాదని తలఁచుట ౨. పూర్వాచార పరాయణత్వ పురస్కృత మయిన సంఘభీతి. పెద్ద చదువులు చదివి ప్రవీణుఁడైన యువకుఁడు దనమాతాపితరులు వరశుల్కాభిలాషచేఁ జేసిన యొకవిద్యావిహీనురాలగు యువతినిఁ బెండ్లాడిన నాతఁడల్ప మేని సుఖమును బడయఁజాలఁడు, కాఁడికిరువల నొకగుఱ్ఱమును మన్నపోతును గట్టిన నడచుబండివలె వారికుటుంబయాత్ర సాగును, పండితుఁడొక మూర్ఖునితో మాటాడుటకును వానితో సంబంధబాంధవ్యములు నెఱపుటకును నెంత యోవ పడునో యెంతరోఁతపడునో విద్యాశాలియగు యువకుఁడు విద్యావిహీనురాలగు కళత్రమునుగని యెంతరూపవతి యయినను నరసికురాలనియు మూఢురాలనియుఁ దన మెడకు గుదిబండయనియు దనపాలిటి శనిదేవత యనియు నసహ్యించు కొనును. విద్యావంతుఁడు భార్యను గేవలము భోగసాధకముగాఁ జేసికొనఁడు. ఆపని విద్యావిహీనునిది. అతఁడు తనతోపాటుగాఁ భార్యయుఁ బ్రపంచమునందలి మతరాజకీయ, భాషాది నానా విషయములను దెలిసికొని తానునిర్వహించు కార్యములకు నూఁతగా దోహదకారిణిగ నుండవలయునని యభిలషించును. ఆ విధముగా మెలఁగుచున్నపుడే యాతనికి భార్యయెడ మిక్కిలి మక్కువయగును. వానిహృదయమునకుఁ బరిపూర్ణానందము గలుగును. విద్యాశాలి విద్యనుగాంచి ముగ్ధుఁడయిన వఁడునుఁ గేవలరూపమును జూచి కాఁడు. రూపము కేవలము భోగార్థము. విద్య వివిధప్రయోజనవంతము.

"యత్రాకృతి స్తత్ర గుణాభవంతి" అన్న విధమున సౌందర్యవతి గుణవతియు నగునని యెంచి స్త్రీకి సౌందర్యము, సచ్చారిత్రమును జాలునని యందు రేమో? చాలవు. ఇవి యున్నను విద్యవలయును. విద్య వీనికి మెఱుఁగు వెట్టును. అది లేనిచో నీ రెండును రాణింపవు. కనుక విద్యావంతుఁడగు యువకుఁడు విద్యావతియగు కళత్రముతో సుఖపడినట్లు విద్యాశూన్యురాలును, సౌందర్యవతియు బతివ్రతయు నగు భార్యతో సుఖపడఁజాలఁడు. దీనింబట్టి స్త్రీకి విద్య యావశ్యకమని తేలుచున్నది.

## స్త్రీల కెంతవఱకు విద్య కావలయును.

మన హిందూ కుటుంబములలోఁ బురుషుఁడు సంపాదకుఁడు. స్త్రీ గృహకార్య నిర్వహణాయత్తురాలు. కుటుంబ రక్షణ భారమంతయు స్త్రీపయి నున్నది. పాశ్చాత్య స్త్రీల వలె హిందూ స్త్రీలు పెద్దవయస్సు వచ్చువఱకుఁ బెండ్లాడకుండుటకు గాని పెండ్లాడియు భర్తకు దూరముగా నుద్యోగములు నిర్వహించుటకుగాని యిష్టపడరు. ఇద్దరు నొక్కెడనే యుండఁగోరుదురు. ప్రౌఢవయస్సుననే వివాహమాడఁ గోరుదురు. కనుక స్త్రీ సంపాదకురాలు గాదు. ఆమె యభ్యసించు విద్యయుఁ బురుష విద్యవంటిదిగా నక్కఱ లేదు. అనఁగాఁ బెద్ద డిగ్రీలక్కఱ లేదు. పురుషులతోఁ బాటు ఆరవ ఫారము దాఁక జదివినఁ జాలును. అంతవఱకుఁ దప్పక జదువవలయును. దానివలన మంచి లోకజ్ఞానము సిద్ధించును. పత్రికా పఠన

శక్తియు నవగాహన శక్తియు నలవడును. నేటి ప్రపంచమున నుదయించు నెల్ల క్రొత్తక్రొత్త సమస్యలను నర్థముఁ జేసికొను సామర్థ్యము గుదురును. మత రాజకీయ భాషా విషయములలో భర్త ననుసరించి పనిచేయఁ గలుగును. అవకాశమును బట్టి భర్తృ సాహాయ్యమునఁ గాని స్వయముగాఁ గానీ యాయా విషయములలో నుద్గ్రంథములను జదివి యుత్తమవిజ్ఞానము పడయవచ్చును. భర్తృ వాల్లభ్యమును జీవద్భర్తృకత్వమును స్త్రీ ప్రధానముగాఁ గోరును. వానిలో మొదటిది విద్య. రెండవది దైవాధీనము. స్త్రీకి గర్భ ధారణ శిశుపోషణములు సహజ సిద్ధము లగుటచే నాశాస్త్రములు స్త్రీ లభ్యసింపవలయును. కళాశాలా విద్యకు (College education) బదులుగా నాశాస్త్రములు నేర్పవలయును. దానివలనఁ బుట్టిన శిశువు లారోగ్య వంతులై దృఢకాయులై యుందురు. మరియు స్త్రీ గృహకార్యముల నన్నింటి ననఁగా వంట మొదలు పెంట యెత్తుటవఱకుఁ గల పనుల నన్నింటిని నేర్చుకొన వలయును. సామాన్యముగా నిప్పటి విద్య నేర్చిన స్త్రీల కీ విషయములు బొత్తుగాఁ దెలియవు.

ధనికుల కుటుంబములలో స్త్రీసంపాదకురాలు గాకున్నచో సంకటములేదు. కాని దరిద్ర కుటుంబములలోని స్త్రీలు సంపాదింపకున్న సంసారము సాగదు. ఒక్క పురుషుని యార్జన మాటిరాదు. అట్టియెడ స్త్రీ యెట్లు సంపాదింపవల

యును ? అని ప్రశ్న రావచ్చును ? స్త్రీ యింటనే వసించుచు ధనమార్జించు నవకాశముగూర్చు సంగీతము, చేతిపరిశ్రమలు (hand crafts) లను నేర్పవలయును. కాలేజీ చదువునకుఁ బదులుగా శిశుపోషణాది శాస్త్రములతో పాటీకళ లభ్యసింప వలయును. అట్టి విద్యాలయము లేర్పడవలయును. విద్య యన్నది రావలయును గాని వచ్చినచో నేదో విధముగాఁ బిల్లలకుఁ జదువు చెప్పికాని కుట్టుపని నేర్చి గుడ్డలు కుట్టికాని యథాశక్తి ధనమార్జించుచు భర్తకు సాహాయ్యము సేయఁ గలుగును.

శ్లో॥ సద్విద్యా యదికాచింతా వరాకోదరపూరణే
శుకోఽప్యశనమాప్నోతి రామరామేతి చబ్రువన్.

విద్యయున్నచో నీపొట్టపొట్ట నిండకుండునా ? చిలుక కూడ రామరామయనుచుఁ దన తిండిని సంపాదించుకొను చున్నది. పదునెనిమిది సంవత్సరముల వఱకు స్త్రీవిద్యాభ్యాస మొనర్చి వివాహమాడవలయును. తల్లిదండ్రులు దమబిడ్డలకు విద్యాభ్యాసముఁ జేయింపక వివాహము సేయుటకుఁ దొందర పడరాదు. ఈ వివాహ విషయము బాల్యవివాహ వ్యాసమున లెస్సగాఁ జర్చింపఁబడును.

విద్యావతియగుస్త్రీ చాలగర్వించి యుండుననియుఁ బతికనుకూలముగా వర్తింపదనియుఁగొందఱందురు. విద్యాశూన్యలగుస్త్రీలతో విద్యావంతురాలు గలసిమెలసియుంటకుఁ గొంతయోవపడును. వారుదమ విద్యాలోపముని గ్రహింపక యా

మెనుగర్వాణినిఁగాఁదలంతురు. ఒక్కొక్కఁడు దానొక్కఁతయే విదుషిగానున్నపుడు గర్వాణిగా నుంటయు సహజము. కాని పెక్కండ్రు విద్యావతులుండనట్టి గర్వమూనదు. తనకన్న భర్త విద్యావంతుఁడయినచో భార్యతప్పక లోబడియుండును. కనుక స్త్రీ తనకన్న నధికవయోవిద్యావంతునిఁ బెండ్లాడుటయుక్తము. భార్యకన్న భర్త పెద్దవాఁడై యుండవలయును. స్త్రీ లందఱకును నిట్టి విద్యావంతులు దొరకక పోవచ్చును. తనతో పాటు విద్యనార్జించిన భర్త దొరకినను వయోవృద్ధత్వమును బురస్కరించుకొని సంతృప్తిపడి శ్రద్ధాభక్తులు గలిగియుండవలయును.

స్త్రీకి విద్య యొకవెత్తు. పాతివ్రత్యమొక వెత్తు. ఈ కాలమున విద్యావంతులగు భర్తలను స్త్రీలు కేవల పాతివ్రత్యము చేతనే సంతోష పఱుపఁజాలరు. విద్య నభ్యసించి పాతివ్రత్యము గడించిన స్త్రీ తన గృహమును భూతలస్వర్గమును జేయును. దేశాభివృద్ధి యన దేశీయులగు స్త్రీ పురుషుల విజ్ఞానాభివృద్ధియే. స్త్రీ విద్యాభివృద్ధిలేనిచో దేశాభివృద్ధియు లేదు.

ఖండాంతర స్త్రీలకన్న భారతదేశస్త్రీలు పాతివ్రత్యమునఁ బ్రసిద్ధికెక్కిరి. సీత, అనసూయ, అరుంధతి, దమయంతి చంద్రమతి వంటి స్త్రీలు ఖండాంతరములఁ దెచ్చటను నుద్భవింపలేదని చరిత్రల వలన మనకుఁ దెలియవచ్చు చున్నది. స్త్రీకిఁ బాతివ్రత్య మొక్కటియే కావలయునని ధర్మశాస్త్ర

కారులు ముక్తకంఠమునఁ బలికిరి. కానీ కేవల పారమార్థిక జీవనము గడపు నా కాలమునఁ బాతివ్రత్య మొక్కటియే కావలయు నంటలో దోసఁగు లేదు. ఇప్పుడును భర్తయైహిక జీవనమున విరక్తిగలవాఁడగుచో స్త్రీకి విద్య లేకున్నను గొఱఁత రాదు. అట్లుగాక యైహిక వ్యాపారములందుఁ దగులుకొని యున్నయెడలఁ బాతివ్రత్యముతోపాటు విద్యయు నుండవలయును. ఈ రెండును స్త్రీకి సమానము. స్త్రీ ప్రవర్తనమునుగూర్చి పురుషులెల్లప్పుడును శంకింతురు. సీతాదేవి విషయముననే లోకము శంకించినది. ఇతరులమాట చెప్పనేల? కనుకఁ బరుల నిందలకు లక్ష్యము గానట్లు ప్రవర్తింప వలయును.

స్త్రీలకు నాంగ్లవిద్యా ప్రవేశముగా స్కూలుఫైనలు వఱకు నుండవలయునని చెప్పితిని. భాషనుబట్టి స్త్రీ పురుషులు వేషములు మార్చుకొంట తగదు.

గీ. కడుపుఁ జంకకుఁ దగిలించి పుడమి నాల్గు
చెఱగులందు నుఁ భిక్షఁ ద్రుమ్మరుము; కాని
వేషభాషా ప్రవర్తనల్ వీడకోయి!
వీడెదే మానవత్వంబె వీడునిన్ను.

అని యొకకవి చెప్పెను. పరవిద్య నేర్చినంతమాత్రన పరవేషములు వేయనక్కరలేదు. దేశకాలానుగుణముగా స్వజాతి వేషములందు లతిమార్పు కలుగుచునే యుండును. అట్లుగాక యున్మత్తుగాఁ బాశ్చాత్య స్త్రీ వేషమును ధరించుట పాడిగాదు. మరియుఁ బాశ్చాత్య స్త్రీ వేషముకన్న భారత

జాతి స్త్రీ వేషమున శిల్పసౌందర్య మున్నదని కళావిదు లెల్లరును గ్రహింతురు. హైందవస్త్రీ ధరించిన వలువ ముడతలు మీఁగాళ్ళ జీరాడు కుచ్చెళ్లు, వలెవాటు, కేశపాశమునందలి పుష్పగ్రంథనము మొదలగు వీనియందెంతో శిల్పమున్నది. పాశ్చాత్య స్త్రీ వేషమున నట్టిశిల్పము కానరాదు ; వారు దిగవేసినట్లుందురు. స్త్రీపురుషులు వినతవేషమున (simple dress) నుండవలయును గాని విద్యావంతులయిన మాత్రమున యుల్బణ వేషమును ధరించుట నాగరకతగాదు.

కాపురము సేయుచున్న ప్రౌఢస్త్రీలు కూడ విద్య నభ్యసింప వీలయిన విద్యాలయము లుండవలయును. 11 గంటలు మొదలు 3 గంటలవఱకు స్త్రీలింట నిర్వర్తింపఁ దగిన కార్యములుండవు. అట్టియెడ వారా విద్యాలయములకుఁ బోయి విద్య నార్జింపవచ్చును. ఇట్టి పాఠశాలలు మన దేశమున నెక్కడనో యొకటి రెండుచోట్ల మాత్రము గలవు. విద్యా విధానమునఁ గూడఁ గొంత మార్పుండ వలయును. ఇంటికడ నెక్కువచదువఁదగిన వ్రాయఁదగిన చదువుకూడదు. ఏలన, గృహకృత్యములలో మగ్నులయి యుంట నాపనులు సేయఁజాలరు. కొలఁదిగాఁ బఠించుచున్నను గొంత దీర్ఘకాలములోనైన విద్యావతులు గావచ్చును.

స్త్రీలకు డిగ్రీ పరీక్షలనఁగాఁ గాలేజీవిద్య యక్కఱ లేదని నాయభిప్రాయము. ధనికులయి విద్యావంతులుగాఁ

గోరు నేర్వలేదని మందిపోవు చదువుకొనఁ గోరినఁ జదువు కొందురుగాక; ప్రాయికముగా సామాత్రవిద్య చాలును. అట్టి స్త్రీ తన కుటుంబక్షేత్రమున బంగారుపంటఁ బండింపఁగలదు.

## 12. వాణిజ్యము.

పురుషార్థములలో ద్వితీయమగు నర్థమును సంపాదించు సాధనము వాణిజ్యము. అర్థార్జనమున కెన్నో యుపాయములు గలవు. ఏయుపాయమాశ్రయించినను ధర్మవిరుద్ధముగానివిధము నవలంబింపవలయును. ధనార్జనమున కెల్ల సాధనములలో వాణిజ్య ముత్తమసాధనము.

శ్లో. లక్ష్మీ ! ర్వసతివాణిజ్యే । తదర్థంకృషికర్మణి
తదర్థం రాజసేవాయాం భిక్షాయాంనైవనైవచ.

వాణిజ్యమున లక్ష్మీలాభ మెదవును. కృషికర్మమున నందర్థము ఘటిల్లును. రాజసేవవలనఁ దదర్థము దొరకును. భిక్షవలన నేమియురాదు. అని వాచోయుక్తియుఁగలదు.

జరయు మృతియులేని జనునట్లు ప్రాజ్ఞుండు
ధనము విద్యఁగూర్పఁ దలఁపవలయు
ధర్మమాచరింపఁ దగుమృత్యుచేఁదల
పట్టి యీడ్వఁబడినవాఁడు వోలె.

అన్నట్లు పురుషుఁడు విద్యాధనములుగూర్ప నెల్లకాలము ను బ్రయత్నించు చుండవలయును. గడించినదానినిఁ దర

తరములదాఁక ననుభవింపఁ బాఁతఁబెట్టి దాఁచుటకుఁ
గాదు. మేడలను, మిద్దెలను గట్టించుకొనుటకుఁగాదు. అమూ
ల్యాంబరాభరణములు కొని ధరించుటకుఁగాదు. ధర్మముకొ
ఱకు సంపాదింపవలయును. ధర్మముతో సంపాదింపవలయును.

మానవుఁడు తానుసంపాదింపవలసిన దానికన్న నధిక
ముగా సంపాదించుటదోషము. మఱియు ధర్మముదప్పక సంపా
దింపఁ బూనినచో నధికముగా నెవ్వరును సంపాదింపఁజాలరు.
అధర్మముగా గడింపఁ బూనిననే యనల్పధనమును సేకరింప
ననువగును. అధర్మమనఁగాఁ గేవలమితరులఁ జంపికాని కొట్టి
కాని దొంగిలించికాని యార్జించుటయేగాదు. తనపడ్డ శ్రమకు
మించిన ఫలమును గోరుటయు నధర్మమే. మనమొకపనిఁ
జేయుటకు దినభృతినిచ్చి సేవకునేర్పఱతుము. వానిశ్రమను
గనిపెట్టి మనము భృతినిర్ణయింతుము. కానీ యధికముగ
నొక్కగవ్వయు నీయనొల్లము. ఆతఁడధికముగాఁ గోరిన
నన్యాయముగా నడుగుచున్నాఁడని తలంతుము. అట్లు వ్యాపా
రియుఁ దనవ్యవహారార్థము పడినశ్రమకుఁ దగినంతకన్న నధిక
ఫలమును దీయుట యన్యాయము. అది ధర్మవిరుద్ధమగును.

మన భారతదేశమున దినమునకుఁ దలకొకటింటికి
సగటున 0-1-3 మాత్రమాదాయము వచ్చుచున్నదని
యార్థిక శాస్త్రజ్ఞుల సిద్ధాంతము. అట్టియెడ నొకఁడొక
దినమున కొక్కరూపాయ నార్జించుచున్నాఁడను కొందము.
తనవంతునకు వచ్చిన 0-1-3 మాత్రమేకాక మఱికొంతఱ

యాదాయమును గూడఁదాను గ్రహించుచున్నాఁడు. అట్టిచో 0-1-3 ఆదాయముగూడ లేక పెక్కం డల్లాడుచున్నారని తేలుచున్నది. వ్యాపారస్థులెంత యధర్మముగా ధనమార్జించిన నంత యధికసంఖ్యాకులు దరిద్రులగుచుందురు. ఒకరు సర్వస్వమును గోల్పోవ నొకరు కుబేరు లగుచుందురు. ఈ కాలమున వ్యాపారస్థులందఱు వారిపడ్డశ్రమకన్న నధికమగు ఫలమున పేక్షించు చున్నారు. కనుకనేవారు కోటీశ్వరులయి కోటికిఁ బడగలెత్తుచున్నారు.

వాణిజ్యమొకకళ. వ్యాపారస్థులకుఁ బరవంచన, మిథ్యా భాషణములు మూలధర్మములు. త్రికరణశుద్ధి కులదేవత, నిష్కాపట్యము గంచుకాగడాలుపెట్టి వెదకినను గానరాదు. కంటినుండి కనుపాపను దీయఁగలరు. కనుఱెప్ప తెఱచి వ్రాల్చునంతలో మాయలు సేతురు. వారని మాయల మారీచులనవచ్చును. "అమ్మసొమ్మయిన నగసాలి హరింపక మాన"డన్నట్లువ్యాపారస్థు లెవ్వరినైన మోసపుచ్చకమానరు. ఏవణిజుని కడకైనఁబోయి యొకవస్తువును బేరమాడఁ బూనఁ దనవస్తువులే పరమశ్రేష్ఠములనియుఁ దానే నిజాయితీ వాఁడననియు మీకని వెలదగ్గించు చుంటిననియుఁ బలుకును. ఒకవేళనొక వస్తువువెల దగ్గించినను, మరొకవస్తువునందు దానిని రాఁబట్టుకొనును.

తమయధర్మార్జనమును బాపప్రవర్తమును దమ యంతరాత్మకుఁ దెలియును గనుకనే యాపాప నివృత్తి

కొఱకు దానధర్మములు సేయుదురు. దేవాలయాది ప్రతిష్ఠలు గావింతురు. బ్రాహ్మణ సమారాధనములు, జపతపాదు లును జేయింతురు. కేవల ముదారబుద్ధితో దానధర్మములు గావించువారే కొలఁదిమందిరో యుందురు.

ఈ వాణిజ్యము వైశ్యవృత్తి, భగవద్గీతలో "కృషి గోరక్ష్యవాణిజ్యం వైశ్యం కర్మస్వభావజమ్" అనికలదు. బ్రాహ్మణ క్షత్రియులు దానిని నాపద్ధర్మముగా గ్రహింప వచ్చునని గౌతమధర్మసూత్రములు, మనుస్మృతి మొదలగు ధర్మశాస్త్రములందుఁ జెప్పఁబడినది. అట్టియెడఁ గ్రయా క్రేయవస్తు విచారము చేయఁబడినది. వైశ్యవృత్తి నాపద్ధర్మముగా గ్రహించిన బ్రాహ్మణుఁడు గంధరస కృతాన్న, తిల, శాణ, క్షౌమాజినములను రంగు, బట్టలు, దధిక్షీరములు, ఫల, పుష్ప, మూలౌషధ, మధు, మాంస, తృణోదకవిషాదులును, వధార్థము గటికవాండ్రకుఁబశువులును విక్రయింపరాదని గౌతమధర్మ సూత్రములు చెప్పుచున్నవి. కానీ యట్టి క్రయాక్రేయ విచారమిప్పుడులేదు. మరియు సంఘమునకుఁ బూర్వు లేర్పఱచిన కట్టుబాట్లు దొలఁగుట చేతఁ జాతుర్వర్ణ్యముల వారును స్వస్వనియత ధర్మములను విడనాడి యాపద్ధర్మములనే సహజ ధర్మములనుగా స్వీకరించు చున్నారు. తొలుతట వైశ్యులొక్కరే వాణిజ్య మొనర్చెడి వారు. ఇప్పు డెల్లజాతులవారును నర్థార్జనోపాయముగా దీనినే గ్రహించియుంటచేఁ దొలుతటికన్న మన దేశమున వ్యాపార మభివృద్ధియయ్యె.

మఱియు నీకాలమున నున్నంత వాణిజ్యము పూర్వ కాలమున లేకుంటకుఁ గారణము వాహన సౌకర్యములు లేకుంటయునగును. ప్రజల నివృత్తిమార్గ తత్పరత్వముగూడఁ గొంతవఱకుఁ గారణము. ధూమశకటములు, పడవలు, ఓడలు, బండ్లు మొదలగు వాహనములు దేశములకుఁ బరస్పర సంబంధమును సమకూర్చి వ్యాపారావకాశములు విశాలము సేయుచున్నవి.

వ్యాపారము బహుశాఖావంతము. కొందఱు చేతినుండి పెద్దపెట్టుబడి పెట్టి సరకులుగొని యమ్ముచుందురు. కొందఱు దళారులుగాఁ (Brokers) నుండి లాభము గడింతురు. కొంతమంది గుత్తదారులై వ్యాపారమును సాగింతురు. ఇందు దళారులు పెట్టుబడి యక్కఱలేకయే మితిలేని లాభమును గడింతురు. కాయకష్టము సేసి సరకులు పండించినవారికన్న వ్యాపారస్థులు కడుంగడు లాభమును గడింతురు.

వ్యాపారము లన్నింటిలో వడ్డీవ్యాపారము మిక్కిలి ఘోరమైనది. ఏకొలఁదిమందియో తక్కనుత్తమవర్ణు లధమవర్ణుల శ్రేయస్సు గోరక పెక్కు తరగతులగు వడ్డీలను బెంచి మొదటి మొత్తమునకుఁ బదిరెట్లు పెంచి వారియలేనియెడ నాస్తినంతయు నపహరింపజూతురు. మరియు జూదములు, గుఱ్ఱపుఁ బందెములును మిక్కిలి దూష్యములు. కనుక నే ప్రభుత్వమువారు వానిని శాసనపూర్వకముగా నిషేధించిరి.

వ్యాపారస్థులకు నష్టమెన్నఁడును సామాన్యముగా రాదు. మొదలు చెడ్డ బేర ముండదుగదా! అధికలాభము రాకపోవచ్చును గాని బొత్తుగా లాభము రాకమానదు. చూడుఁడు. ఒకవస్తువు వెలయెంత పెరిగినను పెరుగవచ్చును. అనగా నొక రూపాయి వెలగల వస్తువు రమారమీ సమయమును బట్టి పదిరూపాయలుగావచ్చును. తగ్గినచో మొదటి వెలకుఁ దగ్గదుగదా! అందువలన నష్టము రాదు. మరియు నొకవేళ వెలదగ్గిన నష్టము వచ్చునేమోయని మొదటివెలకన్న నిమ్మడి, ముమ్మడిసేసియే వ్యాపారస్థులమ్ముదురు.

వ్యాపారాభివృద్ధికి బ్రత్యేకముగాఁగాక సంఘములుగా బనిసేయుట మంచిది. బ్యాంకులు, సహకార సంఘములు, వ్యాపారమునకు సహాయకారులు. ఇవితక్కువవడ్డీకిధనమిప్పిచ్చి పెద్దపెద్ద కర్మాగారములు స్థాపింపఁజేసి ప్రజల సంపద్వృద్ధికిఁ గారణమగును. పరిపాలకులును గావలసినయెడల నీవర్తక సంఘములకును గర్మాగారములకును ఋణమిచ్చి సహాయపడుదురు.

మనదేశమున విదేశవ్యాపారమున కున్నంత రక్షణము స్వదేశ వ్యాపారమునకులేదు. దానివలన మనదేశమున విదేశ వణిక్సంఘములు పొందుచున్నంత లాభమును దేశీయ వణిక్సంఘములు పొందుటలేదు. పాశ్చాత్యులు వాణిజ్యము నొకశాస్త్రముగా రచించిరి. అదినేర్చినఁగాని వ్యాపార రహస్యములు సంపూర్ణముగాఁ దెలియవు.

వ్యాపారమును బట్టియే పల్లెలు పట్టణములగును. పూర్వముకన్న మన దేశమున నిపుడు పట్టణము లధికమైనవి. వ్యాపారస్థులు సరకు చౌకగా దొరకుచోటులఁగొని ప్రియముగా నమ్మచోటులకుఁ గొనిపోయి యమ్మెదరు. వస్తువు యొక్క వెల దానిస్వభావమును బట్టికాక యల్పత్వాధిక్యములఁబట్టి నిర్ణీతమగును. ఒకేవస్తు వొకకాలమున వెలగలిగియు మరొకకాలమున వెలలేకయు నుండును.

వ్యాపారస్థులకు వార్తాపత్రికాపఠన మావశ్యకము. దానివలన నే వస్తువెంత వెలకెచ్చట దొరకునో యేవస్తు వెవరికిఁ గావలయునో తెలియఁగలదు. ప్రతిక్షణమును వాణిజ్యప్రపంచము మాఱుచుండును. ఏమాత్ర మేమఱచియున్నను దగిన లాభము రాదు.

వ్యాపారమునకుఁ బ్రకటనము ముఖ్యధర్మము. ప్రకటన మెంత హెచ్చిన నంతలాభము కలుగును. ప్రకటనము లేనిదే యెంత యత్యుత్తమవస్తువైన నమ్ముడువోదు. ప్రకటనమున్న నెంత యనుపయుక్త వస్తువేని నమ్ముడుపోవును. ప్రకటనమే వ్యాపారమునకుఁ బ్రాణము. చూడుడు. కొన్నిమందుల ప్రకటనలు చూచునప్పుడే రోగము నివర్తించినట్లుండును. కాని తెప్పించి పరిశీలించినచో నది నిరర్థకమగును. కావుననే వ్యాపారమునకుఁ బరవంచన మూలధర్మమంటిని, ఇప్పటి వాణిజ్యము ధర్మబద్ధముగాదు. ధర్మబద్ధ వ్యాపారము పరంపరగా మోక్షసాధనమగును. ధర్మావిరుద్ధ వ్యాపారము మోక్షప్రతిబంధమగును.

---

# 13. అస్పృశ్యత.



అస్పృశ్యత యన నంటరాని తనము. బ్రాహ్మణ స్త్రీకి శూద్రునివలనఁ గలిగిన సంతానము చండాలురు, పంచములు, మాతంగులు నని శాస్త్రములు చెప్పుచున్నవి. వారే యస్పృశ్యులుగా లోకములోఁ బరిగణింపఁ బడు చున్నారు. ఈ కాలము వారు వీరి నాది హిందువు లందురు. అప్పటి వీరి వృత్తి పశుహింస. వీరు గ్రామ బహిర్భాగముల నివసించుచుండిరి. సవర్ణుల యనాదరము కతన వీరు చాలా వెనుకఁబడి యుండిరి.

బ్రాహ్మణ స్త్రీకి శూద్రునివలనఁ బుట్టిన సంతానము చండాలురని కదా శాస్త్రములు చెప్పుచున్నవి. అట్లని నిప్పటి యస్పృశ్యులెల్లరు నట్టి జన్మము నొందిన వారని యెవ్వరును జెప్పఁజాలరు. కనుక చండాలపదము వీరి యందనువర్తింపదు. కొన్ని వేల యేండ్ల క్రిందట వీరి తరముల వారిలోఁ బూర్వులట్లు జన్మించి యున్నారనవలయును. మన తాత ముత్తాతలు చేసిన యపరాధములకు మన మెట్లు బాధ్యులము గామో యిప్పటి యస్పృశ్యులును వారి పూర్వుల యపరాధముల కెట్లు బాధ్యులగుదురు? మరియు బ్రాహ్మణ స్త్రీకి శూద్రుని వలనఁ గలిగిన వా రస్పృశ్యు లనుటయు బ్రాహ్మణ శ్రేణికి కళంకమే. ఏలన నెంతోమంది

బ్రాహ్మణ స్త్రీ లావిధముగా శూద్రునివలన సంతతిని గన్నా రనియు, నప్పటి బ్రాహ్మణ స్త్రీ సంఘ మంత కలుషితమై నీచమై యున్నదనియు నూహింప వలసి వచ్చుచున్నది.

కాని విచారింప నాగరకులగు నార్యు లనాగరకులగు ననార్యులను జయింపఁబూని యప్రయత్నముగనో యల్ప ప్రయత్నముగనో తమకు లోబడిన సాధులగు వారినిఁ దమ సేవకులనుగాఁ జేసికొని తమ సేవచే వారి నుద్ధరింప శూద్ర జాతి నేర్పఱచిరి. ఇంకను లోపడక యడవులలోను గొండల లోను దాఁగి మధ్య మధ్యఁ దమమీఁదఁ బడుచుఁ దమ కుప ద్రవముఁ గలిగించుచున్న యనార్యులను బిమ్మట బహుక్లేశా యాసములచే జయించి తమ కసి దీఱునట్లుగా వారికి గ్రామ బహిర్వాసము, పశుహింసాది నీచ వృత్తులను దండన రూపముగా విధించియుందురు. ఆ దండనరూపమగు వృత్తియే క్రమముగాఁ గులవృత్తిగా బరిణమించి యుండఁ వచ్చును. కనుక వీరును శూద్రజాతి వారే కాని భిన్నులు గారు. క్రీస్తు పూర్వము 7 వ శతాబ్దివాడైన పాణిని " శూద్రాణా మనిర వసితానామ్ " అని వీరిని బహిష్కృత శూద్రులనుగాఁ జెప్పెను. బ్రాహ్మణ స్త్రీకి శూద్రునివలనఁ గలిగిన సంతాన మునకుఁ గూడ నిట్టి దండనమే యా కాలమున విధింపఁబడి యుండును. వారు నీ జాతియందుఁ జేరియుందురు.

ఇప్పటికాలమునఁ బ్రతి జాతివారును దమతమ జాత్యు న్నతికిఁ బాటుపడుచున్నారు. జాత్యున్నతికి మూలము విద్యాభి

వృద్ధి. విద్యావంతులు దమ జాతిలోపములను గ్రహించి నాగరక జాతులవలె నున్నతినిఁ బొందబూనుట దోసము గాదు. ఆది హిందువులును దమ యోహ్యాచారములకు గోసి యుత్తమ వంశ్యులవలె నుండఁ గోరుచున్నారు. వారు విద్యా నార్జించు చున్నారు. జ్ఞానమునుబట్టి యుచ్చనీచతలు గలుగును గానీ కులమునుబట్టి కాదు. పరమేశ్వర దృష్టిలోఁ బ్రాహ్మణుఁడును జండాలుఁడును నొక్కటియే. గోవును గుక్కురమును నొక్కటియే. చిలుకయును గాకియును నొక్కటియే. పిపీలికాది బ్రహ్మపర్యంతమును బరమేశ్వరుఁడు వ్యాపించి యున్నాఁడనియు నెల్లరును నీశ్వరరూపులే యనియు నిర్వచించు హిందూమత మస్పృశ్యతను బాటించుట హేయముగాదా!

సవర్ణులు దమ యిండ్లలోనికి మలభక్షణము సేయు కుక్కలను రానిచ్చుచున్నారు. నానాగృహములఁ గ్రుమ్మరుచు మాంసాదుల భక్షించు మార్జాలము చొచ్చి దధిక్షీరాన్నాది పదార్థములలో మూతులు ముంచుచున్నను నాయాపదార్థములను స్పృశించుచున్నను వానిని విసర్జింపక భక్షించుచున్నారు. బ్రాహ్మణులు వేదశాస్త్రములను వదలి యర్థార్జన సాధనమని యాంగ్లమును జదువుచున్నారు. తమ ధర్మము గానిసేద్యము, వాణిజ్యము, ఉద్యోగములను జేయుచున్నారు. వీనియందనేక మాయోపాయములూ సేయుచున్నారు. వీరి స్వేచ్ఛాప్రవృత్తిని శాస్త్రము లరికట్టవు. వీరికాచారముముందు,

అనాచారము వెనుక ఇట్లే మిగిలిన సవర్ణులెల్లరును బ్రవర్తించు చున్నారు. కాని యస్పృశ్యులభ్యున్నతికై యత్నించుపట్ల శృతి స్మృతి పురాణేతిహాస చతురంగ బలములతో యుద్ధ సన్నద్ధులగుచున్నారు. తమ శాస్త్రధర్మముల నలుసేని వదలక యాచరించు మండనమిశ్రులవంటి వారొకవేళనస్పృశ్యతం బాటింప వలయునని పట్టుపట్టినను నర్థముండునుగాని తమ ధర్మములను దాము విడిచి పరులకు ధర్మముపదేశించు కపట విద్వాంసులు పట్టుదల వహించుటదగదు. గురివెందగింజ దన క్రింది నలుపెఱుఁగని విధమున వీరును దమ కలుషప్రవర్తన మెఱుఁగరు. త్రికరణశుద్ధిలేని జీవనమన వీరిదే.

జంతువులకన్న మానవులు శ్రేష్ఠులని యెల్లరు నంగీకరింతురు. "జంతూనాం నరజన్మ దుర్లభమిదమ్" అనియున్నది. మాంసభక్షణము సేయుచు నానాసంకర గృహములఁజుట్టుచు నెంగిళ్ళు తినుచువచ్చి మన గృహముల మడిమైలలేకము సేయుచు మనల దాఁకుచునున్న కుక్కుర మార్జాలాదులకన్న మానవులు హీనులగుదురా ?

సవర్ణుల బహిష్కారావకాశమునుగాంచి క్రైస్తవ మతబోధకులా యాదిహిందువులను దగ్గఱకుఁదీసి పేరాసలఁ గల్పించి మతమునఁ గలుపుకొని కూడుగుడ్డలిచ్చి చదువులు చెప్పించి యుద్యోగము లిప్పించుచున్నారు. స్వదేశస్థులు తమ్ము బహిష్కరింపఁగాఁ బరదేశస్థులు దమ కాదుకొని సాయపడుటచే వారికి స్వజాతీయులగు హిందూమతస్థులపై

ద్వేషమును బరమతస్థులపై నాదరమును నేర్పడినవి. దీనివలన హిందూమతమునకు బలము దగ్గినది. సవర్ణహిందువుల మూర్ఖతవలననే హిందూదేశమున రమారమి యేడుకోట్ల యస్పృశ్యులు పెరిగిరి. దేహావయవములలో దేనిలోఁ గొఱఁతయున్నను నంగపుష్టి కొఱవడునట్లు హిందూసంఘములో నేకొలఁది మంది విడిపోయి పరమత మవలంబించినను హిందూమతమునకుఁ గొఱఁతయే కలుగును.

అస్పృశ్యతఁ దొలఁగింప వలయునన్న వారితో సంబంధబాంధవ్యములు సేసికొనుట గాదు. వారితోఁ బంక్తి భోజనము లారగించుట గాదు. ఇష్టమున్న వారట్లు సేయవచ్చును. ఇష్టము లేనిచో నిర్బంధము లేదు. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు పరస్పర మెట్లు వ్యవహరించుకొనుచున్నారు? వారు పరస్పర బాంధవ్య భోజనాదులు గావించుకొనుట లేదు. పరస్పరమును దాఁకుటయు లేదు. జనసమర్దమునఁ దక్క నొకని నొకడు స్పృశింప నావశ్యకతయు లేదు. కాని పరస్పరసహకారము పరస్పరానుకంపయును గలిగియున్నారు. ఆవిధముగనే యీ సవర్ణు లస్పృశ్యులతో వ్యవహరింపవలయునని చెప్పుచున్నాను. వారి యస్పృశ్యతను దొలఁగించుట యనఁగా వారిని యిండ్లలోనికి రానిచ్చుట, వాపీకూపతటాకాదులను వాడుకొననిచ్చుట, సవర్ణులునడచు మార్గమున నడవనిచ్చుట, దేవాలయములఁ బ్రవేశింపనిచ్చుట, ఇంకను సంఘమున నున్నతవంశ్యులు దమ క్రిందిజాతులవారికే యే యవకాశము లిచ్చుచున్నారో

మనుష్యుఁడై పుట్టినవానికి నైతికముగా నెట్టి హక్కులుండునో వాని నిచ్చుటయే.

సనాతనులు పైవాని కంగీకరింపరు. కోపమునిఁగి నట్లు గోలసేయుదురు. ధర్మశాస్త్రములు నిషేధించుచున్న వందురు. మీయాచరణ మంతయు ధర్మశాస్త్రానుకూలముగా నున్నదా? యని యెవరేనిఁ బ్రశ్నింప నది యాపద్ధర్మమనియు లోకాచారమనియు సమాధానము సెప్పుదురు. ఆదిహిందువులకుఁ బై జెప్పిన యవకాశము లిచ్చుటవలన మహాపాపములోఁ బడిపోవుదుమని పరితపింతురు.

## పాపపుణ్యములనఁగా నేమి ?

ఒకఁడు నిష్కారణముగా నొక ప్రాణిని హింసించుట, ఒకనిసొత్తు నొకఁడు దొంగిలించుట, ఒకరిని దూషించుట, ఇట్టి యకార్యములు పాపహేతువులగును. పరమపురుషార్థమగు మోక్షమునకెయ్యది ప్రతిబంధకమో యయ్యది పాపము. దానిఁ జేసినవాఁడు పాపి, దుష్టుఁడు. తన యేకార్యము వలన లోకము సంతసించునో యదిపుణ్యము.

శ్లో. అష్టాదశ పురాణానాం సారం సారం సముద్ధృతమ్
పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్.

పరోపకారము పుణ్యము. పరపీడనము పాపము. ఇది యష్టాదశ పురాణ రహస్యము. పరపీడన మహింసాధర్మ ప్రతికూలమగుటచే నహింసామూలగు సనాతన ధర్మములు మోక్షసాధనములు గనుకఁ బరపీడనము మోక్షప్రతి బంధక

మగుచున్నది. ఒకమనుష్యుఁడొక మనుష్యునిముట్టుకొన్నచో వాని నింటికి రానిచ్చినచో నెట్టి పరపీడనమును గానరాదు. ఇందుకార్యమేమియును లేదుగదా !

దేవాలయ మపవిత్రులను బవిత్రులఁజేయు స్థానము. అందుఁ బ్రవేశమిచ్చి యపవిత్రులగు నస్పృశ్యులను బవిత్రులనుగా నేలచేయరాదు? బ్రాహ్మణులు జ్ఞానయోగ కర్మయోగముల నవలంబించి మోక్షమును బొందుట కవకాశమున్నది.. అస్పృశ్యులకు భక్తియోగముకన్న గత్యంతరము లేదు. అట్టియెడ బ్రాహ్మణులు దేవాలయము లస్పృశ్యులకే వదలివేయుట వివేకముగాదా. బ్రాహ్మణాదులుసేయు పూజాదులనే దేవుఁడు గ్రహించి యస్పృశ్యుల పూజగ్రహింపఁడా? వారిని మన్నింపఁడా?

ఒకరినిఁ దాకినంత మాత్రమునఁ జూచినంతమాత్రమున మతము మైలపడ్డచో నట్టి మతము మంటఁగలిసినను విచారించువారుండరు. ఈమతమునుగూర్చి "మతములు" అను వ్యాసమునఁ జర్చింపఁబడును. అస్పృశ్యతఁ దీసివేసిన మాత్రమున మతముమైలపడదు, దాననెట్టి పాపమునురాదు. అనఁగా నస్పృశ్యతఁ బాటించుట మోక్షసాధనమును దీసివేయుట మోక్ష ప్రతిబంధకమునుగాదు, లెస్సగా విచారింప తీసివేయుటయే మోక్షసాధనమగును.

అస్పృశ్యులలో నందనారువంటి మహాభక్తులును గలరు. అగ్రజాతులలో స్వధర్మమునువదలి జారచోరగోఘ్న

మద్యపా యిత్యాది దుర్వృత్తుల నవలంబించువారును గలరు. అట్టియెడ జాతినిఁబట్టి గౌరవాగౌరవము లీయవలయునా? కర్మనుబట్టి యీవలయునా? శంకరాచార్యులవంటి విద్వాంసుఁడు "చండాలోఽస్తు సతుద్విజోఽస్తు గురురిత్యేషా మనీషా మమ." (జ్ఞానియగు వాఁడు చండాలుఁడుగానిమ్ము ద్విజుఁడు గానిమ్ము, వాఁడేనాకుగురువు) అని పలికెను. జాతిచండాలుని కన్నఁ గర్మచండాలుఁడు హీనుఁడు.

అస్పృశ్యులు క్రైస్తవ మతమును స్వీకరించి విద్యావంతులై మహాశ్రయమును సంపాదించి పెద్దపెద్ద యుద్యోగములు సేయుచు నధికారులయి రాఁగా నస్పృశ్యులపేరు చెప్పినఁ బాపమనియెంచి చెప్పరానివాండ్రని నొడువుచువారి దర్శనమాత్రమున సచేలస్నాన మాచరించు సనాతన బ్రాహ్మణులు కార్యార్థులై చేతులు జోడించుకొని వేచివేచి దర్శనముసేసికొని 'దేవరవారు! ఏలినవారు! ప్రభువులవారు!' అని పలుకుచుఁ జిత్తము చిత్తమని యొదుగుచు వంగివంగి సలాములు సేయుచుందురు. గ్రామముననున్న విద్యాగంధము లేని దరిద్రాస్పృశ్యుఁడు దగ్గఱింప వానిపైఁదమ ప్రతాపమును జూపుదురు. ఇది నాకువిందు, నీకు మందు అన్నట్లున్నది.

ధర్మశాస్త్రములు మారఁగూడదని సనాతనుల సిద్ధాంతము. కాని యవి యాచరణ యోగ్యములుగావు. ఒక్కఁడయినఁ బ్రపంచములో ధర్మశాస్త్రానుసారముగా వర్తించువాఁ డుండఁడని ఖండితముగాఁ జెప్పవచ్చును.

పేలన నానియమములున్నవి. సనాతనులు దమబిడ్డల నాంగ్లపాఠశాలలోఁ జదివింతురు, తాము వేదశాస్త్రములు మంటఁ గలియుచున్నవని యుపన్యాసములిత్తురు. తామప్రతి గ్రహీతలవలెఁ గనఁబడుదురు. కాని గుమాస్తాల నంపి పురోహిత కర్మలఁ జేయించి భాగములఁ బంచుకొందురు. శ్రుతిస్మృతులను విశ్వసింపవలెనని బోధింతురు. తమకు విశ్వాసము లేదు కాఁబోలు! వారేవాని ధర్మము లాచరింపరు.

లోకమున నే సంస్కరణముఁ గావింపఁ బూనినను నీ సనాతనులే యడ్డుపడుచుందురు. దేశకాలముల ననుసరించి ధర్మములు మాఱునని గ్రహించి సనాతనులు మూర్ఖపుఁ బట్టుదలలు మానవలయును.

అస్పృశ్యులును దమలోపములను గుర్తించి, మద్యపాన జంతుహింసాదులను మానిపారిశుభ్ర్యము విద్యావివేకములు, దైవభక్తి మొదలగునవి యలవఱచుకొని యగ్రజాతుల మన్ననలకుఁ బాత్రము గావలయును.

హిందూసంఘాభివృద్ధికి సవర్ణావర్ణుల యైకమత్యమే పునాదిరాయి.

---

## 14. ధూమశకటము.



ప్రపంచములోనున్న ప్రతి ప్రాణియు సౌఖ్యపడఁ గోరును. అందు మనుష్యుఁడు జంతువులకన్న వివేకము

గలవాఁడగుటచే నితరజంతువులను స్వాధీనపఱచుకొని తాను శ్రమింపక వానిచేఁ దనకుఁ గావలసినకార్యములను జేయించుకొనుచున్నాఁడు. గవాశ్వఋషభాదులగు మృగములను శుకపికాది పక్షులను బెంచి యెన్నెన్నో కార్యములు సేయించుకొనుచున్నాఁడు. మనుష్యులు సాధింపరానట్టియు సాధించిన దానికన్న నధికమైనట్టియుఁ గార్యములు జంతువులవలన సాధింప వీలుపడుచున్నది ఏలన మనుష్యులకన్న జంతువులు బలవత్తరములు. మనుష్యులు చొఱగాని యాకాశమార్గమున నతివేగముగా సంచరింపగలవి పక్షులు.

మొట్టమొదటఁ బురుషుఁడు దానుమోయఁ గలిగినంత భారమును దానే మోసికొని పోవుచుండెను. భారమధికమగుచో మరల మరలఁ దానే తిరుగుచుండెను. లేకున్న భృతినిచ్చి పనికాండ్ర నియమించుచుండెడివాఁడు. దీనివలన వ్యయప్రయాసములును గాలవిళంబమును హెచ్చగుచుండెను. ఇట్లుండఁ దన ప్రజ్ఞాబలమునఁ బశువులను స్వాధీనపఱచుకొని వానిపైఁ దాను మోయఁగలిగిన దానికన్న నధికతరమైన భారమును మోయించుచుండెను. మఱికొంత కాలమయిన పిమ్మట నొక జంతువుచే నేక కాలమున మోయించు భారమునకన్న నంతకాలముననే బండికి రెండుజంతువులఁ గట్టిన నధిక భారము మోయింప వచ్చునని యూహించి మొద్దుచక్రముల బండి నిర్మించెను. అదియును భారమెక్కుడగుటచే నిప్పటియాకుచక్రముల బండిగాఁ బరిణతమయ్యెను.

పూర్వకాలమున నెంత దూరమయినను నాబండ్ల మీఁదను గుఱ్ఱములమీఁదను బ్రయాణము సాగించుచుండిరి. పెద్ద పెద్ద వర్తక వ్యాపారములు పెద్ద పెద్ద దండయాత్రలును నా బండ్ల సాహాయ్యముననే నిర్వర్తింపఁబడుచుండెను. కానీ యీ శకటాదులును దూర దేశ ప్రయాణముల విషయమున వ్యయ ప్రయాసలు గూర్చుచునే యుండెను. దూర దేశముల గమ్యస్థానములు సేరుటకును గాలవిళంబనమగుచుండెను. కనుక నెంతదూర దేశమయినను స్వల్పవ్యయ ప్రయాసలతో నతి శీఘ్రకాలములోఁ జేరు నుపాయమాలోచింపఁ దొడఁగిరి. అందుఁదిర్యగ్జంతువులకన్న స్థావరములు బలవత్తరములగుటచే వానిని స్వాధీనపఱచుకొన్నచో మిక్కిలి భారమును మోయించుటకును మిక్కిలి దవ్వుప్రయాణము సేయుటకును వీలగుననిస్థావరములకన్న బలవత్తరమగు దానివలన వానినిస్వాధీన పఱచుకొనయోజించిరి. కొంతకాలమునకు జలతేజస్సంయోగమున నొక నూతన శక్తియుద్భవించుననియు నదిబలవత్తమమనియు దానినిస్థావర పదార్థములఁ బ్రవేశపెట్టిన సంచలనముగలుగుననియు బరిశోధనాఫలితముగా గ్రహించి 1821 సంవత్సరమున "జార్జి స్టీవెన్‌సన్" అనునతఁడు ధూమశకటమను యంత్రమును గనిపెట్టెను.

అప్పుడది యిప్పటి వేగమును నాకారమును లేకయుండెను. కాని కాలానుగుణముగా నవసరములను గనిపెట్టి

దాని కంగపుష్టి గల్గింపఁబడెను. ఎన్నెన్నో మార్పులంది యిప్పటి స్థితికి వచ్చినది. ముందుముందింకను మార్పులను బొందవచ్చును.

చిరకాలము క్రిందటనే యాంగ్లదేశములో ధూమ శకటమార్గములు నిర్మింపఁబడినను మన హిందూదేశమున డెల్‌హౌజీ నాఁడవి వేయఁబడెను. పరిపాలకులు మనహిందూ దేశములో వీనిని వేయుటకు ముఖ్యకారణములు. 1. పాశ్చాత్య వ్యాపారాభివృద్ధి కాంక్ష. 2. సైన్య యాతాయాత వ్యవహార ములు. ఇవి ప్రజలకు దూరదేశ ప్రయాణములతి స్వల్ప కాలములోవ్యయప్రయాసలు లేక చేరుటకును వార్తావహనము నకును మిక్కిలి యనుకూలించుచున్నవి. క్రూరజంతు బహుళ దుర్గమారణ్యములును, అనంతమై యాకాశమును బోలియున్న మరుభూములును, దురారోహములగు పర్వత ములును, అగాధములగు, మహానదులును, నవలీలగా నిమిషమాత్రమున నిరాయాసముగా నిర్భయముగా దాఁట వింతకన్న నుత్తమసాధనములు లేవు. దేహళీదత్త దీపమువలెఁ బ్రధానముగా బరిపాలకుల కార్యార్థము వేయఁబడినను భారత ప్రజలకును గొంతవఱకు నుపయోగపడుచున్నవి.

వీనివలన భారతీయులు లక్షలమంది జీవించుచున్నారు. కొన్ని లక్షల వంశీకుంఘములు బ్రదుకుచున్నవి. ధూమశకట స్థానమగుటఁ బల్లెలు పట్టణములగుచున్నవి.

ప్రయాణీకులకు వలయుసౌకర్యములు ధూమశకటము లలో నేర్పాటు చేయఁబడినవి. కానీ యింకను గావలసినవి పెక్కులు గలవు. ధూమశకటములు లేని ప్రదేశమున వ్యాపారమంతగా జరుగదు. అచ్చటి ప్రజల పంటలకుఁ దగినంత లాభముః సంభవింపదు.

పూర్వకాలమునఁ బదిదినములలోఁ బదిరూపాయల తోఁ గాఁదగిన పనియిప్పు డొకదినములో నొక్క రూపాయి తో నీ ధూమశకటములవలన జరుగుచున్నది. పూర్వముకన్న నిప్పుడు ప్రపంచయాత్రసేసి వచ్చుటకు నానుకూల్య మేర్పడినది. దేశదేశములకుఁ బరస్పరసంబంధము లేర్పడియున్నవి. భిన్నత్వము పోయి దేశములకైక్యము సంఘటిల్లినది. ఆయా దేశస్థులు తఱచుగాఁ బరస్పరమును గలిసికొని మతరాజకీయ సాంఘిక పారిశ్రామికాభివృద్ధులకై యత్నించుట కనేకావకాశములు గలిగినవి. పాశ్చాత్య నాగరకత పల్లెపల్లెలోనికి మూలమూలలకు వ్యాపింపఁజేయుటకుఁ బాశ్చాత్యులకు మంచి యవకాశమేర్పడినది. అనగాఁబల్లెకుఁ బాశ్చాత్యదేశములోని పెద్దపెద్ద పట్టణములతోఁగూడ సంబంధ బాంధవ్యము లేర్పడినవి. నేఁడు లండన్, పారిస్, వియన్నా మున్నగు పట్టణములలోని కర్మాగారములలో సిద్ధమయిన వస్తువులు మఱుసటి నాఁటికేఁ బల్లెటూరిలోని పూరిగుడిసెలోని గూటిలోఁ బ్రత్యక్షమగుచున్నది. ఇది దీని ప్రభావమే.

పాశ్చాత్య దేశములందుకన్న మన హిందూదేశమున ధూమశకటమార్గముచాలాతక్కువ. కారణముభారత దేశము

పారిశ్రామిక దేశము కాకపోవుటయే. ఉన్న మార్గమయినను భారతప్రజలకన్నఁ బాశ్చాత్య వణిక్సంఘములకే యెక్కువ లాభకరముగా నున్నది. ఏలన హిందూ దేశమునుండి పరదేశములకుఁ బోవు పదార్థములకన్నఁ బాశ్చాత్య దేశములనుండి మనదేశమునకువచ్చు పదార్థములే యధికము. పాశ్చాత్య దేశములతోపాటు మనదేశమును బారిశ్రామిక దేశమై యితర దేశములకు నెగుమతులు సేయుచున్నచో భారతీయులకీ మార్గము మిక్కిలి ప్రయోజనమును గూర్చును.

ధూమ శకట సంస్థాపరిపాలనము పరిపాలకుల హస్తగతమైయున్నది. వారికిష్టము లేనిచో హిందూ దేశముననున్న యెల్లమార్గములు నొక్క నిమిషమున నరికట్టవచ్చును. బంద్లాఁపివేయవచ్చును. ఇచ్చవచ్చిన విధముగా వానిని మార్పవచ్చును. ప్రజలకు వానిపై నెట్టి యధికారమును లేదు. వారి యిష్టము లేకున్న మనకు టికెట్టుకూడా యెంతవెచ్చించినను లభింపదు. పరిపాలకుల యనుజ్ఞ లేనిదే యేస్వదేశసంస్థానములవారును నే ధనవంతులును నాత్మేచ్ఛానుసారముగా నవమార్గములు నిర్మింపఁ బూనరాదు.

ఈ యంత్రములును వానికి వలసిన యితరపదార్థములును బాశ్చాత్య దేశములనుండియే యిచ్చటికి వచ్చుచున్నవి. బండ్లను మాత్రమే మన దేశమునఁ జేయుదురు. వాని నడపించు విద్యమాత్ర మిటనేర్పుదురు గానీ వానిఁ జేయువిద్య నిటనేర్పు పాఠశాలలు లేవు. పాశ్చాత్య వణిక్సంఘ

ములకీ యయోమార్గ మూలకముగాఁ గోట్లకొలఁది రూపాయల లాభము వచ్చుచుండును. ఏయితర సంస్థకును నింత లాభమురాదు. ఈ సంస్థలో భాగస్వాములు పాశ్చాత్యులే. ప్రధానోద్యోగస్థులును పాశ్చాత్యులే. కనుకనే మూఁడవ తరగతి పెట్టెలలోఁ బ్రయాణముసేయు పాశ్చాత్యులకుఁగూడ భారతీయులకు లేని ప్రత్యేక సౌకర్యముల నిచ్చుచున్నారు.

ధూమశకట నిబంధనలు ప్రయాణీకులు తెలిసియుండ వలయును. పెట్టెలోని కెక్కిన పిమ్మట మనకెంత హక్కున్నదో మనకుఁ దెలియవలయును. ఒక పెట్టెలోఁ బదిమంది కూర్చుండవచ్చునని వ్రాసియుండగాఁ గొన్నికొన్ని సమయము లలో గార్డు పెక్కండ్రను నందుఁద్రుక్కును. అట్టియెడఁ బ్రయాణీకుఁడు తనకా పెట్టెలోఁ గూర్చుండుటకు న్యాయముగా నవకాశములేదని గార్డుతో చెప్పి మూఁడవతరగతి టికెట్టు తోడనే రెండవతరగతి పెట్టెలోఁ గూర్చుండవచ్చును. అత్తఱి వానికడనుండి యిబ్బడి రుసుమును దీయుటకు నధికారము వారికిలేదు. కనుక ధూమశకట నిబంధన లెఱిఁగి యుండవలయును.

హిందూదేశమునకుఁ బాశ్చాత్య ప్రభుత్వమువలనఁ గలిగిన మేళ్లలో ముఖ్యతమములు రెండు. ౧ అయోమార్గ సృష్టి. ౨ వార్తావహన శాఖాస్థాపనము. పెద్దపెద్ద పర్వతము లను తొలిచి యయోమార్గము గొన్ని తావుల సృజింపఁబడినది. భూమి క్రిందినుండియు నదీజలములలో నుండియు బాశ్చాత్య

దేశములలోఁ గొన్ని తావుల నీమార్గము నిర్మింపబడుచున్నది. వీనిని ట్యూబ్ రైల్వే యందురు. కొన్నిచోట్ల నీమార్గము పర్వతములపైకి వేయఁబడినది. పైనుండిఁ గ్రిందికి దిగునపుడు పడిపోకుండునట్లు పట్టాలకును జక్రములకును అంపమునకువలె కక్కులు (teeth) నిర్మింపఁబడును. దానివలన బండి క్రిందికి జాఱదు. క్రిందినుండి పైకిఁ బోవునపుడు ముందు వెనుకల రెండింజనులు వేయుదురు. అచ్చటరైలుచార్జియు నధికముగా నుండును.

ఈ మార్గము బ్రాడ్ గేజ్ (Broad gauge) మీటరు గేజ్ (Meter gauge) స్మాల్ గేజ్ (Small gauge) అని మూఁడువిధములుగా నుండును. స్మాల్ గేజ్ మార్గమునకే లైట్ రైల్వేయనియు నామాంతరము.

ధూమశకట ప్రయాణమును మన జీవితప్రయాణమును దుల్యములు. ఈ ప్రపంచమునఁ బ్రయాణము సేయుచున్న మానవునకుఁ గొంతదూరమరుగ భార్యాపుత్ర బంధుమిత్రాదుల సంబంధము గలుగుచున్నది. వారితో నతఁడు కాలము పుచ్చుచుఁ బ్రయాణము సేయుచుండఁ దమతమ చనవలసిన కాలము రాఁగానే యొకరి పిమ్మట మరొకరు పోవుచుందురు. అట్లే ప్రయాణికులు ధూమశకటమునఁ గ్రొత్తక్రొత్తలతోఁగూడి కొలఁదిసేపు ప్రయాణము సేయుచు దిగిపోవలసిన స్థానము రాఁగానే దిగిపోవుచుందురు.

చచ్చి యేస్వర్గమున నున్నాఁడోకాని జార్జిస్టీవెన్ సన్ జన్మము ధన్యము. అతఁడు మృతజీవి. అతని నామమాచంద్ర తారకముగాఁ బ్రకాశించును. పాశ్చాత్యులలోఁ దమ జన్మము నీ విధముగా సార్థకపఱచినవారు పెక్కండ్రుఁగలరు.

---

# 15. బాల్య వివాహములు.

స్త్రీపురుషులకు వివాహ మైచ్ఛికము కాని నిర్బంధము గాదు. ఇష్టము లేకున్న వారు వివాహమాడక యాజీవిత మును బ్రహ్మచారులుగా నుండిన నుండవచ్చును. కాని సనాతను లిట్లందురు. "వివాహము స్త్రీపురుషులకు నిర్బంధ విషయము. వివాహము కాకున్న సంతానము గలుగదు. సంతతి లేకున్న మరణానంతరము దమకుఁ బుణ్యలోకప్రాప్తి కలుగదు. కావుననే సంతానహీనులు దత్తపుత్రుని స్వీకరించి తమ యావదాస్తిని నాతని కొసఁగి తమ సద్గతికై వానిచే నౌర్ధ్వదైహిక క్రియలు చేయించుకొందురు. కాన వంశ మవిచ్ఛిన్నముగా నుండుటకై సంతానమును బడయ వలయును. కనుక వివాహము స్త్రీపురుషులకు నిర్బంధ విషయము". అట్లుగాదు. స్త్రీ పురుషులు స్వస్వకర్మాను సారముగా సద్గతి నొందుదురు. భీష్ముఁడు, విదురుఁడు మొదలగు మహాపురుషులువివాహితులుగారు. గార్గి, అంభృణి మొదలగు వైదికస్త్రీ లవివాహితలు.

వివాహమైచ్ఛిక మంటిని. ఇచ్ఛయన సంతానాపేక్ష. వివాహ మాడఁదలఁచినవాఁడు సంతానార్థియై యాడవలయు నని నియమము. రఘువంశమున "ప్రజాయైగృహమేధినామ్" అని కాళిదాసన్నాఁడు. సంతానాపేక్ష లేనిచో స్త్రీపురుషులకు వివాహ మక్కఱలేదు.

మరియు నాదికాలమున వివాహ నిర్బంధము లేదు. స్త్రీపురుషులు బ్రహ్మచర్య వ్రతానుష్ఠాన సంపన్నులై నిరంతరమును జితేంద్రియులయి శమదమాది సద్గుణసంపత్తి గలిగి, తపస్సంపన్నులై యుండెడివారు. కొంతకాలమునకు వారిలోఁ గొందఱకు సంతానాపేక్ష గలుగుచుండ స్త్రీపురుషులు పరస్పరమును బ్రార్థించి యన్యోన్యాంగీకారమును బడసి సంతతినిఁ బడయుచుండిరి. కాని క్రమక్రమముగా సంతానాపేక్షా నియమము తగ్గి బ్రహ్మచర్య దీక్షాబంధము శిథిలమయి కేవల కామప్రధానముగా నియతదాంపత్యశూన్యముగా స్త్రీపురుషులు ప్రవర్తింపఁ దొడఁగిరి. అట్టియెడ శ్వేతకేతువను మహర్షి పరిణయ నిర్బంధ మేర్పఱచి యాదంపతుల వివాహమునకు నగ్న్యాది దేవతల సాక్షులుగా నియమించి దంపతులకామరణ మాచరణీయ ధర్మవ్యవస్థ నేర్పఱచి పాపపంకిలము గాకుండ సంఘము నుద్ధరించెను. అట్టి నియమమే లేకున్న హిందూసంఘ మింతపవిత్రముగా నుండకుండెడిదని నమ్మవచ్చును.

దీనింబట్టి శ్వేతకేతువునాఁడు ప్రౌఢా వివాహములే జరుగుచున్నవని నమ్మవచ్చును. మరియు వివాహకాలము లందుఁ జదువఁబడుచున్న మంత్రముల యర్థమును బరిశీలించి నను నాకబలినాఁటి తంతును విచారించినను నాలుతట ప్రౌఢావివాహములే యున్నట్లు ఋజువగుచున్నది. ఇప్పటికినిఁ గేరళము, నుత్తరహిందూస్థానము, కాశ్మీరము మొదలగు చోటుల శ్రోత్రియ బ్రాహ్మణ కుటుంబములలోఁ గూడఁ బ్రౌఢావివాహములే జరుగుచున్నవి. ద్విజకుటుంబములలోఁ దక్క శూద్రజాతికిఁజెందిన పెక్కు తెగలలోఁ బ్రౌఢావివాహములే సాంప్రదాయసిద్ధముగా నడచుచున్నవి. వైద్య శాస్త్రమునుబట్టి విచారించినను బ్రౌఢా వివాహములే యుచితము. శుశ్రుతాచార్యుఁడు.

శ్లో. ఊనషోడశ వర్షాయా మప్రాప్తః పంచవింశతిం.
యద్యాధత్తే పుమాన్ గర్భం కుక్షిస్థస్సవి పద్యతే
జాతోవాన చిరంజీవేత్ జీవేద్వా దుర్బలేంద్రియః.
తస్మా దత్యంతబాలాయాం గర్భాధానం నకారయేత్.

(శుశ్రుతము)

పదారేండ్లకు పైఁబడిన వయస్సులేని కన్యయందు నిరువదైదేండ్లు నిండని యువకుఁడు గర్భాధానము సేయ రాదు. చేసిననాగర్భస్థపిండము విపన్నమగును. ఒకవేళఁ బుట్టినను జిరకాలము జీవింపదు. జీవించినను దుర్బలముగా నుండును అని శుశ్రుతాచార్యుఁడు చెప్పెను. ఈవయస్సే యెల్లవిధముల వివాహయోగ్యము.

పురుషులకును స్త్రీలకును విద్య యత్యవశ్యమనియు స్త్రీతప్పక యారవఘారము వఱకుఁ జనువవలయుననియు నాపైని శిశుపోషణ గర్భధారణాది శాస్త్రము లభ్యసింప వలయుననియు స్త్రీవిద్యనుగూర్చి చెప్పినవ్యాసములోఁజెప్పితిని. పదునైదు సంవత్సరములు నిండినఁగాని యారవఘారమునకు రావీలులేదు. పిమ్మట మిగిలిన విషయ మభ్యసించుటకు రెండుమూఁడేండ్లు కావలయును. కనుకఁ బదారు పైఁ బడవలయునని చెప్పఁబడినది. ఆ వయస్సు వచ్చునప్పటికి నవయవ పటుత్వముగలుగును. స్త్రీ ప్రథమరజస్వలకాఁగానే ప్రౌఢవయస్సు వచ్చినట్లు మనవాండ్రెంచి గర్భాధానముఁ గావింపఁ బూనుట తప్పు. అద్దాన దుర్బల సంతానము సంభవించునని శుశ్రుతాచార్యుఁ డన్నాఁడుగదా!

కాలక్రమమునఁ గలుగుచున్న రాజకీయ పరిణామములను బట్టి సాంఘికపరిణామముగూడఁ గలుగుట సహజము. మహమ్మదీయ ప్రభుత్వముక్రిందనున్నపుడు బ్రాహ్మణసంఘము పెక్కుమార్పులను బొందెను. మహమ్మదీయు లవివాహిత స్త్రీలను దీసికొని పోయెడివారు. దానివలన నాకాలమున బ్రాహ్మణులు దమబిడ్డలను గాపాడుకొనుటకై బాల్యవివాహముల నేర్పఱచిరి. తదనుకూలముగా ధర్మశాస్త్రములను వ్రాసిరి. బాల్యవయస్సునఁ జేసినఁగాని కన్యాదానఫలము దక్కదని బాల్యవివాహ నిర్బంధమును జేసిరి. మొట్టమొదట వివాహమును గర్భాదానమును నేకకాలమున జరుగుచుం

డెను. కానీ కాలక్రమమున భిన్నకాలముల జరుగుచున్నది. గర్భాధానమెన్నఁడు గావించినను వివాహము మాత్రము రజస్వల కాకముందే చేయవలయునని దృఢ నిర్బంధముచేయ బడినది. గర్భాధానమే ప్రయోజనముగాఁగల వివాహము గర్భాధానమెన్నఁడో చేయఁబడుచున్నపుడు రజస్వల కాక ముందే యేలచేయఁ బడవలయును? ఒక వేళ ననుకూలవరుఁడు దొరకినచో బాల్యముననే చేయవచ్చును. లేకున్న ననుకూల వర లాభము గలుగువఱకు వేచియుంట వివేకముగాదా! మరియు వెనుకటి భయములు లేవు. మనుస్మృతిలో

శ్లో. ఉత్కృష్టాయాభిరూపాయ వరాయసదృశాయచ
అప్రాప్తామపితాంతస్మైకన్యాం దద్యాద్యథావిధి
కామమామరణాత్తిష్ఠే ద్గృహేకన్యర్తు మత్యపి
నచైవైనాంప్రయచ్ఛేత్తు గుణహీనాయ కర్హిచిత్.

“ఉత్కృష్టుఁడును నభిరూపుఁడును సదృశుఁడునగు వరునకు వివాహవయస్సు రాకున్నను గన్యనీయవచ్చును. ఋతుమతియైనను నామరణ మవివాహితఁగానే యుంచ వచ్చును. గానీగుణహీనునకీయరాదు. అని చెప్పుచున్నది. కనుకవివాహమున కనుకూలదాంపత్యము గావలయును. తదర్థము వేచియుంట యుచితము. మరియు నాజన్మాంతమును పరస్పర బాధ్యతలను వహింపవలసిన దంపతులు పరస్పర మును వరించికొంటయు ధర్మము. తల్లిదండ్రులు మాత్రమేర్ప ఱచిన వివాహములలో నొక్కెడల దంపతులకుఁ బొత్తుకుదర నిచో నాదోషము పితరులపైఁబడును. వధూవరులొండొరు

లను వరించివివాహమాడినచోఁ బిమ్మటఁ బొత్తుకుదరకున్నచో నాదోషమునకుఁ దామే బాధ్యులగుదురు. అట్లు పరస్పర బాధ్యతలనుగుర్తించి యన్యోన్య యోగ్యతలను బరిశీలించి కొనవలయునన్నఁ బ్రౌఢవయస్సు రావలయును. తల్లిదండ్రుల బాధ్యతవివాహము చేయుటయేకాదు. విద్యావంతుశాలి నొనర్చుటయుఁ గూడనగును.

మన హిందూధర్మశాస్త్రములఁ బరిశీలించినను బ్రౌఢా వివాహముల కెట్టి నిషేధమునుగానరాదు. మనుస్మృతిలో రజస్వల కాకముందు వివాహము సేయవచ్చునని చెప్పియు ననుకూలవరుఁడు దొరకక కానీ, గృహసంకటాదుల వలనఁగానీ వివాహ మొనర్ప నవకాశము లేనిచో రజస్వలయైన పిమ్మటను బ్రాయశ్చిత్త పూర్వకముగాఁ బెండ్లి సేయుట దోషముగాదని చెప్పఁబడినది. మరియునట్లు రజోదర్శనారంభమునుండి మూఁడేండ్ల వఱకు నాకిన్యపైఁ దలిదండ్రుల కధికారముండు ననియుఁ బిమ్మట నాపె స్వతంత్రించి గాంధర్వమున నిచ్చ వచ్చిన వానినిఁ బెండ్లాడవచ్చునని చెప్పఁబడి యున్నది. కనుక ననుకూల వరుఁడు దొరకమిని ధనాభావమునను గృహసంకటముల వలనను బీడితుఁడగుచుఁ బాపము వచ్చునను భయమున నిల్లు వాఁకిలిఁ దెగనమ్మి వరపక్షమువారి హిరణ్యాక్ష వరముల కంగీకరించి వివాహముసేసి తాను ధన్యుఁడనైతినని సంతసించుచుఁ బిమ్మట ఋణబాధకుఁ బడలేక ఋణదాతలకుఁ దన యావదాస్తియను గట్టిపెట్టి దుఃఖించుట యేటివివేకము?

శారదాబిల్లు ఆచరణములోనికి వచ్చుటకు ముందు మూఁడునాలుగు మాసములలో హిందూదేశమున జరిగినన్ని పెండ్లిండ్లు సాధారణముగా నిరువది యేండ్లలోఁ గూడాఁ గాఁజాలవు. ఉగ్గుపాలు త్రాగుచున్న పిల్లలను గోచీపెట్ట నేరని బాలురకిచ్చి పెండ్లి సేసిరి. ఆకాలమున నొక్కొక్క ముహూర్తమునకు వేనవేలు పెండ్లిండ్లయ్యెను. పురోహితులకును మేళగాండ్రకును గిరాకి యెక్కువయ్యెను. మేళములు దొరకక గ్రామఫోను ప్లేటులతో మంగళ వాద్యములు గావించికొనిరి. ఆ పెండ్లిండ్లు బొమ్మల పెండ్లిండ్లకన్న హీనముగా నుండెను. ఇట్టి, పెండ్లిండ్లకు ధర్మశాస్త్ర విధిగలదా? వివాహప్రయోజన మేదేనిఁ గలదా? బాల్యముననే వివాహితయగు కన్య దౌర్భాగ్యమువలన భర్తను గోల్పోవ నాజన్మమును విధవగా నుండవలసి వచ్చుచున్నది. అద్దాన బాల్యవివాహములను మానవలయును. ప్రౌఢా వివాహముల వలన మాత్రము వైధవ్యము ప్రాప్తింపదా? మరణ మెవరికిఁ దెలిసివచ్చును? బాల్యమున వివాహితలగు వారెందఱు ముత్తైదువలుగా లేరు? ప్రౌఢవయస్సున వివాహిత లెందరు వితంతువులుగా లేరు? వారి వారి కర్మానుసారముగా వైధవ్యమును, నైదువతనమును సంభవించునని సనాతనులందురు. అదియును యథార్థమే. మన దేశపు లెక్కలఁ బరిశీలించినచో బాలవితంతువుల కన్నఁ బ్రౌఢవితంతువులు దక్కువ. కనుకఁ బ్రౌఢావివాహముల వలన బాల్యవైధవ్యము తగ్గును.

కామప్రధానుఁడై పురుషుఁడెట్లు భార్యామరణానంతరమున మరలఁ మరలఁ బెండ్లాడుచున్నాఁడో యట్లనే విధవయును నిచ్ఛయున్నచో మరల వివాహమాడుటలో నెట్టి దోసఁగును లేదు. ఒక ధర్మ మొకరికిఁ బుణ్యమును మరొకరికిఁ బాపమును నీయదు. పునర్వివాహమాడిన స్త్రీ పురుషులు పాపాత్ములు గాఁజాలరు. మరియు బ్రాహ్మణులలో గల పదునెనిమిది గోత్రముల వారిలో నొక గోత్రమువారి పునర్వివాహమాడిన దంపతుల కుదయించినవారే. బాల్య వివాహము లెంతకాల ముండునో యంతకాల మీ పునర్వివాహము లెక్కువగా జరుగును. అవి తగ్గినచో నివియుఁ దగ్గును.

వర్ణాంతర వివాహములను గూర్చియుఁ గొలఁదిగాఁ దెలిపెదను, వర్ణాంతర స్త్రీ యువకులు పరస్పర ప్రేమ మూలకముగాఁ బెండ్లాడుటలో దోసఁగు లేదు. వసిష్ఠుఁడు చండాలజాతి కన్యకయగు నరుంధతినిఁ బరిణయమాడెను. ఆమె పూజ్యురాలు. అరుంధతీ దర్శనము, వివాహాంగము, "స్త్రీరత్నమ్ దుష్కులాదపి' అనియు ఋషిమూలమును, నదీ మూలమును, స్త్రీమూలమును విచారింపనక్కర లేదు" అనియు లోకోక్తులు గలవు. అట్టియెడల వర్ణాంతరులాహారాదులందలి పరస్పరాచార భేదమును మానుకొనవలయును. ఎవరియాచారములు వారు పాలించుచు దంపతులుగా నుండఁబోసగదు.

ప్రస్తుత కాలమును బట్టియుఁ దప్పక ప్రౌఢా వివాహములే చేయవలయును. విద్యావంతుల కుద్యోగములు

లభింపకున్నవి. ఎందఱెందఱో బాల్యముననే వివాహితులై పునస్సంధానమును బిడ్డలను గనుచుఁ దాము విద్యావంతు లయ్యుఁ గుటుంబపోషణము సేయు నాధారములేక యల్లాడు చున్నారు. వారికిఁ బాశ్చాత్య విద్యచేఁ బాశ్చాత్య నాగరకత నరనరములకు బట్టియున్నది. ప్రతి నిమిషమును వారి కుటుంబములకు నాగరక పదార్థము లెన్నెన్నో కావలసి యున్నవి. కొనుటకుఁ జేత ద్రవ్యముండదు. దేశాంతరముల కుద్యోగ సంపాదనార్థ మేగి యెచ్చటనుదొరకకతిరుగుచు నింటఁ బుత్ర కళత్రములును బయటదామును గోడుకుడుచుచున్నారు. కనుక యువకులు ప్రకృతకాలము ననుసరించి సంపాదకులై కుటుంబ భారమును వహింపఁగల ధైర్యము దోఁచినప్పుడే వివాహమాడవలయును. స్త్రీయును, విద్యావతియయి యింట నుండియు స్వతంత్రించి సంపాదించుచు "వేన్నీళ్ళకుచన్నీళ్ళు తోడు" అన్నట్లు భర్తకు సాహాయ్యము చేయవలసియున్నది. అట్టి విద్య సంపాదించిన పిమ్మటనే యామెయుఁ బరిణయ మాడుట యుక్తము.

మనహిందూ కుటుంబములలో స్త్రీ సంపాదించి పతికి సాయ మొనర్చు నాచారములేదు. కానీ క్రైస్తవకుటుంబము లలో నూటికిఁ తొంబది తొమ్మిదిమంది యేకొలఁదిగానో విద్య నేర్చి దానివలన నేకొలఁదియైనను సంపాదించి భర్త కెక్కు కాదుకొందురు.

హిందూ కుటుంబములలో నడిమి తరగతివారు (middle class people) చాల నర్థకృచ్ఛ్రముల మునిఁగి

యుందురు. ఏల ? కుటుంబమున కంతకును బురుషుం డొక్కఁడే సంపాదకుఁడు. స్త్రీ సంతానవృద్ధికి తోడగును. గాని ధనవృద్ధికి దోడ్పడదు. ప్రకృతకాలము ననుసరించి స్త్రీ విద్యావతియై సంపాదించి కుటుంబ పోషణమునకు సాహాయ్యపడ వలసియున్నది. అట్టి విద్యను సంపాదించుట కును, జాలాభాగము వైధవ్యమును దప్పించుటకును బాల్య వివాహములను నిషేధింపవలయును.

రజస్వలయగునని ద్విజులు తొందరపడి యిల్లు గుల్ల సేసి వరుఁడు గోరినంత కట్నములను గానుకల నిచ్చి తమ కూఁతురికిఁ బెండ్లిసేయు చున్నారు. ప్రౌఢా వివాహము లంగీకరింపఁబడినచోఁ గట్నములు పెరుగవు.

బాల్య వివాహము వలనఁగాని గన్యాదాతకుఁ గన్యాదాన ఫల మబ్బదని సనాతనులందురు. తల్లిదండ్రులు తమ బిడ్డకుఁ గూర్చు ఫలముకన్నఁ దమ ఫలమునే విశే షించి కోరుచున్నట్లున్నది. దానివలన వారు స్వార్థపరు లగుచున్నారు. మరియు మనశాస్త్రములు ప్రతికార్యమును బుణ్యపాపములతో ముడిపెట్టుట వలననే యిట్టి యనర్థములు గలుగుచున్నవి. పుణ్యపాప నిర్వచనము "అస్పృశ్యత" అను వ్యాసములోఁ జేయఁబడినది. దానినిఁబట్టి ప్రౌఢావివాహము వలన నెట్టి పాపమును రాదు.

కాలమును బట్టి రాజ్యములు మాఱుచున్నవి. మను ష్యులభావములు మారుచున్నవి. వేయేల ? ప్రకృతి ధర్మ ములు మాఱుచున్నవి. సంఘధర్మములు మాఱుటలో నేమి

చిత్రముగలదు ? పైగా విమర్శనజ్ఞానము పెరిగినది. శాస్త్ర కారుల వచనములు చరిత్రములతోఁ, బ్రకృతిశాస్త్రములతోఁ జతపరచి విమర్శించుచున్నారు. గ్రుడ్డివాని విధమున నవిమర్శముగా శాస్త్రముల ననుసరింపఁ బూనరు. కావున నింకను శ్రుతిస్మృతులందుఁజెప్పిన మూఢాచారములనే. విశ్వసించుచు బాల్యవివాహముల నొనర్చుట యవివేకము.

---

## 16. వృత్తిగౌరవము.

వృత్తియనఁగా మానవుఁడు జీవనోపాధికై యవలంబించు వ్యాపారము. మనుస్మృతి బ్రాహ్మణునకు నధ్యాపనము (వేదముఁ జదివించుట), యాజనము (యాగములుసేయించుట) ప్రతిగ్రహముఁ (దానముస్వీకరించుట) అను మూఁడు విధములగువృత్తులును, క్షత్రియునకుఁ బ్రజారక్షణమును(ప్రజలనుండి షష్ఠాంశమునుస్వీకరించుచు బ్రజారక్షణము సేయుట). వైశ్యునకుఁ బశురక్షణము, వాణిజ్యము, కుసీదము (వడ్డీవ్యాపారము), కృషియును, శూద్రునకు జాతుర్వర్ణ్య సేవయును విధించుచున్నది. మనువు ప్రభుత్వము సేయుచున్నపుడు బ్రాహ్మణాదు లీవృత్తుల నవలంబించియుండిరి. బ్రాహ్మణుఁడు తనమూఁడు వృత్తులచేతను బ్రతుకఁ జాలనిచో క్షత్రియ వృత్తి నవలంబించి యుద్ధము సేయవచ్చుననియు దానిచేతను బ్రమకఁజాలనిచో వైశ్యవృత్తి నవలంబింప వచ్చుననియు దానను జీవితముగడవనిచో శూద్రవృత్తి నవలంబింపవచ్చు

ననియు స్మృతులు వచించుచున్నవి. అన్లేక క్షత్రియవైశ్యులును దమదమ వృత్తులచే జీవితము గడవనిచోఁ దమక్రింద జాతి వారి వృత్తులవలంబింపవచ్చుననియు నాపద్ధర్మములు చెప్పఁ బడినవి.

జీవనోపాధికి నీతి దూరమైన చౌర్యముగూడ సాధ నాంతరము లేనిచో నాపద్ధర్మముగా నంగీకరింపఁ బడినది. విశ్వామిత్రుఁ డొకప్పుడు ద్వాదశ వార్షికక్షామమున నాహా రము దొరకక వారిని వీరిని యాచించియుఁ బడయఁజాలక యర్ధరాత్రమున క్షుద్బాధ సహింపఁజాలక మాదిగ పల్లెలోఁ దూఱి శునక మాంసమును నపహరించి భక్షించెను. జీవన మునకన్య మార్గము లేనిచోఁ బ్రాణముపోవుచుండఁ జౌర్య మును నభక్ష్య భక్షణమును బాతకములుగావని శాస్త్ర కారుల సిద్ధాంతము.

ఆపద్ధర్మములనఁగాఁ బ్రాణముమీఁదికి వచ్చినప్పు డాచరింపవలసిన ధర్మములు. మరల నాయాపద తొలఁగఁగనే స్వస్వవృత్తులనే యవలంబింపవలయునని స్మృతికర్తల యుద్దే శము. ఆపద్ధర్మముగాఁ గాక బ్రాహ్మణాదులు భిన్నజాతి వృత్తు లవలంబింపరాదని యే వారి యాశయము.

పూర్వజన్మ సంస్కారమువలన నొక్కొక్కరి కొక్కొక్క వృత్తియందుఁ గౌశలము, అభినివేశము, శ్రద్ధయును గలుగును. బ్రాహ్మణునకు వైశ్యవృత్తులగు కృషిగోరక్ష్య వాణిజ్యాదులందుఁగానీ శూద్రవృత్తులగు

వడ్రంగము, నేత, కమ్మరము, కుట్టుపని, మొదలగువాని వానియందుఁగాని యభిరుచి కలుగ వచ్చును. అట్టియెడ బ్రాహ్మణుఁడాయా వృత్తుల నవలంబింప వచ్చునా? కూడదా? స్మృతికర్తల యుద్దేశము ననుసరించి యాపద్ధర్మముగా మాత్ర మవలంబింప వలయునుగాని యెల్ల కాలము నవలంబింప రాదు. కానీ వృత్తి జీవనోపాయ మగుటవలన నీతిదూరము గానిచో నేదైనను దూష్యము గాదనియు నెల్లకాలమును నవలంబింప వచ్చుననియు నామతము.

ఈవృత్తి యస్తేయరూప సనాతనధర్మ నిర్వాహణార్థ మేర్పడినది; కనుక నీతి దూరముగా గాకున్నచోఁ జిత్తశుద్ధి కారణమై తన్మూలకముగా మోక్షసాధనము గాఁగలదు.

ఈకాలమునఁ జాతుర్వర్ణ్యము వారును స్వస్వవృత్తులను విడిచి యాపద్ధర్మముగాఁ గాక నియత ధర్మముగనే పరవృత్తుల నవలంబించి యున్నారు. జాతిచే బ్రాహ్మణుఁడు, కర్మచే వైశ్యుఁడో శూద్రుఁడో యగుచున్నాఁడు. జాతిక్షత్రియుఁడు కర్మశూద్రుఁ డగుచున్నాఁడు. జాతివైశ్యుఁడు గర్మశూద్రుఁడో కర్మ క్షత్రియుఁడో యగుచున్నాఁడు. ఇట్లొక్కొక్క జాతియందును నాలుగుతరగతు లేర్పడినవి.

కాని మనహిందూదేశములో రాజకీయోద్యోగముల నున్నవారును, బరార్థవాదులును (Pleaders) వైద్యులును, ఉపాధ్యాయులు మొదలగువారే వృత్తినిఁబట్టి పూజ్యులుగ నెన్నఁబడుచున్నారు. ఒక వడ్రంగి, కమసాలి, సాలె, దర్జీ,

మొదలగువారు పై వాండ్రవలె వృత్తినిఁబట్టి పూజ్యతఁబడయు
చున్నారు. కనుకనే బ్రాహ్మణాదులా వడ్రంగము, కట్టుపని
మొదలగు నానువంశికములుగాని క్రొత్త వృత్తులను నేర్చు
కొనచున్నారు. ఏల ? వానికి సంఘగౌరవము లేమియే
కారణము. నిజము విచారింప నీవృత్తులు హేయములుగావు.
బ్రాహ్మణుఁడైనను దనపూర్వజన్మ సంస్కారము వలన
వడ్రంగమునఁగాని సాలెపనియగు నేఁతయందుఁగాని నేర్పు
గడింపవచ్చును. దినమంతయు నాతఁడు గష్టపడి తత్ప్రతిఫల
ముగాఁ గొంతధనమును గ్రహింపవచ్చును. అతఁడొకరికి
ద్రోహమొనర్చుటలేదు. ఒకరిని హింసించుటలేదు. ఒకరి
సొత్తుదొంగిలించుటలేదు. ఇందకార్యమేమున్నది ? పాపమే
మున్నది? పాపవృత్తిని సంఘము గౌరవింపరాదు. అవలం
బించిన వృత్తి నీతిబాహ్యమా ? నీతిబద్ధమా ? యని
విచారించి గౌరవాగౌరవము లీయవలయును.

గౌరవా గౌరవములు మానవుని ప్రవర్తనాయత్త
ములు. దయాదాక్షిణ్య విహీనమై ప్రజలను బీల్చిపిప్పిసేయు
వైద్యవృత్తియుఁ బరార్థవృత్తియు ( Pleadership) బూజ్య
తను బడయుచున్నవి. లంచగొండులగు పెద్ద పెద్దయధికారు
లను సంఘము గౌరవించుచున్నది. నీతిదూరములగు
ద్యూతములు మొదలగు వ్యాపారముల నిర్వహించు వారికి
సంఘము మర్యాద నిచ్చుచున్నది. కాని కాయకష్టము సేసి
చెమట నోర్చు వారివృత్తిని సంఘము గౌరవింపక నీచముగాఁ

తలంచుచున్నది. మనుస్మృతిలోఁ బర ద్రవ్యాపహారులగు తస్కరు లిరు తెగలుగానున్నారనియుఁ గొందఱు ప్రకాశ తస్కరులనియుఁ గొందఱప్రకాశ తస్కరులనియు వైద్యులు, పరార్థవాదులు, మొదలగువా రప్రకాశ తస్కరులనియుఁ జెప్పఁబడినది. సంఘమునట్టి తస్కరాదులను గౌరవించుచు ఋజువులగువారిని నీచముగాఁ దలఁచుట హాస్యాస్పదముగాదా!

మరియు నెలకు వేయిరూపాయల జీతమును గడించు నుద్యోగికన్న నొకచిన్నవృత్తిని నిర్వహించువాఁడు లోకోపకారియగుచున్నాడు. వడ్రంగి, కుట్టుపనివాఁడు, కమసాలి మొదలగువారు సంఘమునకెంత యుపకరించుచున్నారో చూడుఁడు. వారుదమవృత్తిని వదలినచో గృహనిర్మాణము, వస్త్రనిర్మాణము, అలంకార నిర్మాణమును నెట్లు? ఎంత యుద్యోగస్థులయిన నాయావృత్తుల వారినాశ్రయించి తమ కార్యములను సాధింపవలసినదే. వారీవిధముగా సంఘోపకారులగు చున్నారు. తన్మూలముగా దేశాభ్యుదయమునకుఁ గారకు లగుచున్నారు. వారులేనియెడల సంఘమునకెంత కొఱఁత యేర్పడియుండినో యూహింపుఁడు. వారుదమ వృత్తులను విడిచి యే యాంగ్లవిద్యనో చదివిన నావృత్తులు సేయువారు లేక సంఘముచాలా సంకట పడవలసివచ్చును. మనదేశమున మొట్టమొదటి నుండియు వృత్తి గౌరవము లేకపోవుటవలననే యావృత్తు లవలంబించువారు వానిని వదలివేసి యితరవృత్తుల నవలంబింపఁ దొడఁగిరి. అద్దాన మనహిందూదేశమునఁ బెక్కువృత్తులు నశించినవి. ఏ వృత్తుల

వలన సంఘమునకుఁ దన్మూలకముగా దేశమునకును మహోప
కారమును గలుగుచున్నదో యట్టి వృత్తులను నీచముగాఁ
దలంచుట దోసము. శరీరమున కన్నియవయవములును
సంపూర్ణముగా నున్నయెడలనే పూర్ణత కాని యే యల్పావ
యవము లేకున్నను గొఱంతయే.

కనుక బ్రాహ్మణ క్షత్రియ విట్ఛూద్రు లేవృత్తి నవ
లంబించినను నీతి బాహ్యముగానిచో దానిని సంఘము గౌర
వింప వలయును. మన హిందూదేశమున నాంగ్లభాషనురాజ
కీయభాషగా నేర్పఱచినది మొదలుకొని యెల్ల జాతులవారికి
నా భాషావ్యామోహ మెక్కువయ్యెను. ఆ భాషాపండితులకు
మొట్ట మొదట విస్తరించి యుద్యోగములు లభించుట వలనఁ
బ్రజలాను వంశికముఁగాగాని యభిమానము వలనగాని సంక్ర
మించు వృత్తులను నభ్యసింపక విడనాడి యాంగ్లభాషాభ్యాస
మొనర్చి యుద్యోగములలోఁ బ్రవేశింపఁ దొడఁగిరి. ఇట్లు
క్రమక్రమముగా నెల్ల జాతుల వారావిధముగా నే యాచరింపఁ
బూనిరి. దానివలన వారితండ్రితరముతోడనే యా వృత్తులు
నశించినవి. ఇప్పుడెల్లరు నావిధముగా నాంగ్లభాషా పండితు
లగుటచే నిరుద్యోగ సమస్య యుప్పతిల్లినది. అవలంబించుటకు
వృత్తులా లేవు. ఉద్యోగములా దొరకకున్నవి. దినముగడచుట
దివ్యయుగము గడచుటగా నున్నది. ఆదికాలమున వృత్తి
గౌరవము లేకపోవుట వలననే నేఁటికిట్టి యిక్కట్టులు బయలు
దేఱినవి.

పాశ్చాత్యదేశములలో వృత్తిగౌరవ మధికముగాఁ గలదు. తండ్రి న్యాయాధికారి (Judge)గా నున్నఁగుమారుఁడు చెప్పులుకుట్టును. సోదరుఁడు మంత్రిగానున్నఁ దమ్ముఁడు మోటారుడ్రైవరుగానో కండక్టరుగానో పనిచేయును. అవి యట నీచవృత్తులుఁగా బరిగణింపఁబడుటలేదు. సంఘము వారి నందఱను సమానముగనే గౌరవించు చున్నది. వారి వారి పూర్వజన్మకర్మానుసారముగా వారికా యా విద్యలభించును. తండ్రి విద్వాంసుఁడైనఁ గుమారుఁడును విద్వాంసుడుగావలయు నని నియమములేదు. కావచ్చును గాక పోవచ్చును. జీవనో పాధికి నీతిదూరముగాని యేవృత్తినైన నవలంబింప వచ్చును. వారివారికిఁగల ప్రజ్ఞనుబట్టి యనేకవిధములుగావారు ఖ్యాతిని గడింతురు. చూడుఁడు.

శ్లో. కస్యాపికోప్యతిశయోఽస్తి సతేనలోకే
　　ఖ్యాతిం ప్రయాతి నహి సర్వవిదస్తుసర్వే
　　కింకేతకీ ఫలతి ? కింపనసః సపుష్పః ।
　　కింనాగవల్ల్యపిచ పుష్పఫలైరుపేతా ?

ఒక్కొక్కని కొక్కొక్క శక్తియుండును. దానిచే నాతఁడు కీర్తిఁబడయును. ఎవ్వరును సర్వజ్ఞులుండరు. మొగిలికి నాకులును బువ్వులు నుండునుగాని ఫలములుండవు. పనసకుఁ బండ్లుండును గాని పుష్పములుండవు. తాంబూల వల్లికి నాకులు మాత్రమే యుండును గాని పుష్పఫలము లుండవు. కాని యా యావృక్షము లీశ్వరుఁడు దమకొసఁగిన యా యావస్తువుల వలననే లోకమున మెప్పవడయుచున్నవి.

అట్లే మానవులును బూర్వజన్మ సంస్కారము వలనఁ దమకు లభించినయావృత్తులనుబట్టిసంఘమునకుఁబూజ్యులగుచున్నారు.

ఆంధ్రులకన్న నఱవవాండ్రే వృత్తిగౌరవమును బాటించుచున్నారు. వారేవృత్తిని గ్రహించుటకును వెనుదీయరు. వారున్నత నీచపదవులను సమానముగనే యాశ్రయించు చున్నారు. ఆంధ్రులు తమ కులాభిమానమును బురస్కరించుకొని యుద్యోగము దక్క నాయావృత్తులను నీచముగాఁ దలఁచి నిరుద్యోగులయ్యు నందుఁ బ్రవేశింప నొల్లక వ్యర్థముగాఁ గాలముపుచ్చుచుందురు. ఏకొలఁదిగా లభించినను నొకరికడ గుమాస్తాగా నుండఁగోరుచున్నారు. కానీ స్వతంత్రమగువృత్తి నొకదాని నవలంబింపఁబూనకున్నారు. విద్యాధికులలోనున్న యీ నిరుద్యోగసమస్య యాయావృత్తుల నవలంబించినఁగాని యడఁగదు. ప్రాచీనకళలెన్నెన్నో మనదేశమున నశించినవి. అవి పునరుద్ధరింపఁబడవలయునన్న వృత్తిగౌరవ మేర్పడవలయును. మఱియు వృత్తిగౌరవమునకుఁ దోడుస్వదేశమును వీడి పరదేశమునకుఁ బోవుటకు ధైర్యసాహసము లుండవలయును. అఱవలు హిందూదేశమునంతను బడుగుపేకలుగా నాక్రమించి యున్నారు. ఖండాంతరములకుఁగూడఁ బోవుచున్నారు. ఆంధ్రదేశమున నెందఱఱవలు గలరో యఱవదేశమున నందఱాంధ్రులులేరు. వృత్తిగౌరవమునకు దూరదేశాక్రమణమునకును నఱవలాంధ్రులకు గురువులుగా నుండదగినవారు. కాన నిప్పటికైన నాంధ్రులు వృత్తిగౌరవమును బాటింపవలయును.

మరియుఁ బూర్వజన్మ సంస్కారమువలన లభించిన యభిమానవృత్తులు వదలి యితరవృత్తులవలంబించుట వలన నితరవృత్తులందంత ప్రావీణ్యముగలుగదు. అభిమానవృత్తి నశించుచున్నది. ఉభయ భ్రష్టత్వము గలుగుచున్నది. కనుక వృత్తిగౌరవమేర్పడి జాతీయవిద్యలును, వృత్తులును బునరుద్ధరింపబడిననే ప్రస్తుత నిరుద్యోగసమస్య రూపుమాయును

---

# 17. మ త ము లు.

మత మనఁగా మానవునకుఁగల యీశ్వర విషయిక విశ్వాసము. ఈ లోకముయొక్క సృష్టిస్థితిలయములకు నాది కారణమగు నొకపదార్థము గలదనియు నాపదార్థమే పరమేశ్వరుఁడనియు వానినిఁ దెలియుటవలన మోక్షముసిద్ధించుననియు నాస్తికమతస్థులసిద్ధాంతము. "ఏకంసద్విప్రాబహుధావదంతి". (విద్వాంసు లా యొకవస్తువు ననేకమునుగాఁ జెప్పుచున్నారు.) అని వేదము వచించుచున్నది. ఈశ్వరతత్త్వమునుగూర్చియుఁ దత్ప్రాప్తినిఁగూర్చియు వారి వారి జ్ఞానానుభవములను బట్టి పెక్కభిప్రాయ భేదములున్నవి. కాని యీ యెల్లమతస్థుల మూలధర్మములును నొక్క రూపై యున్నవి. అవి యహింస, సత్యము, అస్తేయము, శౌచము, ఇంద్రియ నిగ్రహము. వీనినే సనాతన ధర్మములందురు. ఈ ధర్మములు ఫలాభిసంధి శూన్యములుగా ననుష్ఠింపఁబడిన యెడల సత్త్వ

శుద్ధినిఁ దన్మూలముగా జ్ఞానమును గలిగించి మోక్షసాధనములగుచున్నవి. ఇవియే ముఖ్యమగు మతధర్మములు. కాని యీ సనాతన ధర్మములను నిర్వహించుట కేర్పడిన యితర ధర్మములును మతధర్మములనక తప్పదు. అవి యహింసానిర్వహణార్థము భూతదయ, పరోపకారమును, సత్యనిర్వహణార్థము మితభాషణము, (సత్యాయ మితభాషిణామ్. సత్యనిర్వహణార్థము మితభాషులగు సూర్యవంశజులగు రాజులు అని కాళిదాసు) తన్మూలకములగు జపతపస్సులు, ఈశ్వరచింతయు అస్తేయ నిర్వహణార్థము నీతిబాహ్యముగాని వృత్త్యవలంబము; శౌచనిర్వహణార్థము స్నానోపవాసాదులు, ఇంద్రియ నిగ్రహార్థము వివాహము, సనాతనధర్మములను నిర్వహింప నేర్పడిన యీధర్మములు సంఘమును బట్టియు దేశమును బట్టియు భేదించియున్నవి. అనఁగా హిందువుల జపతపఃక్రమములకును నితరమతస్థుల జపతపములకును, హిందువుల వృత్తులకును బరమతస్థుల వృత్తులకును, గొంతభేదముగలదు. భూతదయ, స్నానోపవాసాదులు, వివాహము, వీనిలో విశేషభేదమేమియుఁ గానరాదు. ఏమతస్థు లేధర్మములను వహించుచున్నను వాని పరమప్రయోజన మొక్కటియే, అనఁగా సనాతనధర్మ నిర్వహణమే. కాని భిన్నముగాదు. కనుక నివియన్నియు మతధర్మములే. వీని నిష్కామాచరణము వలన సత్త్వశుద్ధి, తన్మూలముగా జ్ఞానమును దానివలన మోక్షమునుగలుగును.

సనాతన ధర్మనిర్వహణార్థము కాని యాచారములు గొన్ని గలవు. అవి కేవల సాంఘికములు. వానినిమతధర్మము

లన వీలులేదు. చూడుడు. వివాహ మింద్రియనిగ్రహ గాని గనుక ధర్మము. వివాహమునకు వయోనిర్ణయ వర్ణనిర్ణయ ములు (అనఁగా కన్య కిన్నవయేట నే పెండ్లి గావింపవలయు ననియు నీజాతివాఁడీ జాతికన్యనే పెండ్లాడవలయు ననియు ననుట) సాంఘికాచారములు. ఈ సాంఘికాచారములు దేశమునుబట్టియు కాలమునుబట్టియు నాదికాలమునుండియు మాఱుచున్నవి. వేదము మేనమామ కూఁతును బెండ్లాడఁ గూడదనుచున్నది. వేదకాలమున నట్టియాచారము లేదు. స్మృతి పెండ్లాడనాజ్ఞనిచ్చుచున్నవి. స్మృతికాలమున నట్టియాచారముగలదు. కొన్నిసంఘములలోను దేశములలోను రజస్వలానంతర వివాహము లానువంశికముగా జరుగుచున్నవి. కొన్ని సంఘములలో తత్పూర్వముననే జరుగుచున్నవి. ఇట్టివి మతధర్మములు గావు. శౌచ నిర్వహణార్థకములగు స్నానోపవాసములు మతధర్మములు. ఇందు స్నానము బాహ్యశౌచమునకును నుపవాస మాభ్యంతర శౌచమునకును సాధనములు. బాహ్యశౌచ మాభ్యంతర శౌచమునకును సాధనమగును. ఒక్కెడ బాహ్యశౌచము లేకున్నను నాభ్యంతర శౌచము గలుగవచ్చును. అయ్యెడ స్నానమారోగ్యధర్మమేయగును. ఈస్నానోపవాసములు దేశమునుబట్టి సంఘమును బట్టియు భిన్నభిన్న కాలముల నిర్వహింపఁ బడుచున్నవి.

ఎల్లమతస్థులును దమతమ మతధర్మములలో సాంఘిక ధర్మములను, నారోగ్య ధర్మములను గలిపి వాని నన్నింటిని

మతధర్మములను గానే వ్యవహరించుచున్నారు. అట్టి కల్పిత ధర్మముల నుల్లంఘించినచోఁ బాపము గలుగుననియు, వానినట్లే యాచరించుట వలనఁ బుణ్యము లభించుననియుఁ దత్పుణ్యపాపఫలముగా స్వర్గనరకములు సమకూడుననియుఁ జెప్పుదురు. మూలధర్మములగు నహింసాదులును దన్నిర్వాహకములగు ధర్మముల నుల్లంఘించినచోఁ బాపము గలుగవచ్చును. పాపమనఁ బరపీడనము. అహింసను దప్పుటయనగా హింససేయుట; అది పరపీడనము. దానివలన నరకము లేక దుఃఖపరంపర లేక జన్మపరంపర గలుగవచ్చును. ఇంద్రియ నిగ్రహార్థము వివాహము మతధర్మముగా విధింపఁబడినది. వివాహమాడక యింద్రియ నిగ్రహము నిర్వహింప జాలక స్వేచ్ఛగాఁ బరస్త్రీలతో వ్యభిచరింపఁ బూనుట పరపీడనమును నాత్మహానియుఁగూడ నగుచున్నవి. కనుక సనాతన ధర్మములను దన్నిర్వాహక ధర్మములను బాలింపకుండుట పాపహేతువు; కాని సాంఘికారోగ్య ధర్మములను బాలింపకున్నఁ బాపమురాదు. చూడుఁడు. బ్రాహ్మణుఁడు శూద్రుని జలమును ద్రాగుననుకొందము. ఒకజాతివాఁడు మఱియొక జాతివానిని దాఁకెననుకొందము.

ఈకార్యముల వలనఁ బై ధర్మములకు భంగము వాటి ల్లెనా ? శౌచభంగమయ్యెనని యందు రేమో ? శూద్రుఁడును బ్రాహ్మణునివలెనే యీకాలమున విద్యావంతుఁడయి పరిశుద్ధముగా నున్నాఁడు. విద్యావంతులయి యస్పృశ్యులును

శుచిగానున్నారు. వారి జలమును ద్రాగుటవలనఁ గానీ వారినిఁ దాఁకుటవలనగాని యెట్టి శౌచభంగమును నీ నాఁటఁ గలుగకున్నది. పూర్వకాలమున బ్రాహ్మణులకన్న వారపరిశుద్ధులుగా నుంటచే నానాఁడు పెద్దలు నిషేధించి యుండ వచ్చును. అట్లే యొక జాతిస్త్రీని మరొక జాతివాఁడు వివాహమాడు ననుకొందుము. పై ధర్మమునకు భంగము వాటిల్లెనా ? లేదు. వర్ణాంతర స్త్రీపురుషులకు భిన్న భిన్నాచారము లుంటవలన నాహారాదులయం దానుకూల్యము గలుగదని వివాహములు పూర్వకాలమున నిషేధింపఁబడి యుండును. వా రిద్దఱును నేకాచారమునే యవలంబించి యున్నచో నానుకూల్యము గలుగును గదా. వీనివలన మతధర్మములు మైలవడలేదు. పరపీడనమా ? లేదు. కనుక నివి పాపహేతువులుగావు. పైనిఁ దెలిపిన వన్నియు సాంఘిక ధర్మములు, సంఘము జడముగాదు. అది చేతనము. అది మార్పును బొందుచుండును. సనాతన ధర్మములు గానీ తన్నిర్వాహక ధర్మములుగానీ మార్పును బొందుటలేదు.

హిందూదేశమున శ్రోత్రియ బ్రాహ్మణ కుటుంబములలోఁగూడ నేకవిధములగు నాచారములు లేవు. ఆంధ్ర ద్రావిడుల యాచారములు భిన్నములు. ఆంధ్రబ్రాహ్మణులు దామే నైష్ఠికాగ్రేసరుల మనియుఁ దమవలననే మతము జీవించి యున్నదనియుఁ దలంతురు. వారు నాఁడెండవేసిన మడుఁగుఁదక్క నాలుతటి నాఁటి మడుఁగుఁ దాల్పరు. అట్లు

ధరించిన పాపమని వారియాశయము. అరవలు గతదినమున నెండవైచిన వస్త్రము నేఁటిప్రొద్దుటఁ దాల్చిన రేఁపటిదాఁక మడియే. ఆంధ్రులకు దినమున కెన్నోమళ్ళు. ఎన్నెన్నో స్నానములు. ఎంతతడిగుడ్డలతో నున్ననంత పుణ్యమనివారితలంపు. శౌచ నిర్వహణార్థ మేర్పడిన స్నానమును ధౌతవస్త్రధారణమును మితిమీఱిపోయినవి. వాని ప్రయోజనము మఱచి వానివలననే స్వర్గము లభించునని పిచ్చిభ్రమ యుదయించినది. వివాహములం దాంధ్ర ద్రావిడ కర్ణాట కేరళ మహారాష్ట్ర వంగాద్యాచారములు భిన్న భిన్నములు. అట్లే క్షత్రియ వైశ్య శూద్రులకును నెల్లదేశములందును నేకాచారములేదు. కేవలము హిందువులకథవిడిచి పరమతస్థుల యాచారములఁ బరిశీలింతము. అన్నిదేశములందున్న క్రైస్తవులకు మహమ్మదీయులకును పారసీకులకును నేకాచారములు లేవు. ఈ సాంఘికాచారములు మతధర్మములుగావు. వీని యుల్లంఘనమున నెట్టిపాపమునురాదు.

కనుక మత ధర్మములను బరిత్యజించి యన్యథాకరణము పాపహేతువు. మత ధర్మమును నిష్కామబుద్ధితో నాచరించుటవలన సత్త్వశుద్ధియుఁ దన్మూలమున జ్ఞానమును గలిగి జీవితలక్ష్యమగు మోక్షము గలుగును. ఆ మతధర్మములను సకామబుద్ధితో ననుష్ఠించిన స్వర్గమబ్బును. సాంఘికారోగ్యధర్మముల వలన నెట్టి పాపపుణ్యములును రావు.

కనుక యథార్థమగు మత ధర్మము లహింసాదులే. వాని నిష్కామాచరణమువలననే మనుష్యుఁడు గమ్యస్థానముఁ బడయఁగలుగును. అవి యెల్లమతముల వారికిని దుల్యములే.

ఇట్లుండ నొక మతస్థులు దురాగ్రహపీడితులై పర మతస్థులను దూఱుట పాడిగాదు. మతద్వేషమును బురస్కరించుకొని పరస్పరమును గొట్టుకొంటయు నయుక్తము.

మరియు నిజమగు మతధర్మములను దెలిసికొన్నచో మానవుఁడు స్వమతమును వీడి పర మతమును స్వీకరింప నక్కఱలేదు. క్రొత్తమతములు స్థాపింప నక్కఱలేదు. మత ధర్మములుగాఁ బరిగణింపఁబడుచున్న సాంఘిక ధర్మములలోని లోపములను సవరించుకొన్నచోఁ జాలును.

ఈకాలమునహిందువులు క్రైస్తవులుగాఆర్యసామాజికులుగా, బ్రాహ్మసామాజికులుగా,మహమ్మదీయులుగా మాఱుచున్నారు. హిందూమత ధర్మములకన్న నామతధర్మములలో గలవిశేషమేమి? సామాన్యముగా స్వమతపరమతధర్మములను బరిశీలించి తన మతలోపమును బరమత శ్రేష్ఠత్వమును గ్రహించి పరమతమును స్వీకరింపవలయును. కాని యిప్పటి వారు కేవలము సంఘలోపమును బురస్కరించుకొని పర సంఘ ధర్మాకృష్టులై యుద్యోగాభిలాషచేతనో యా యా మతస్థుల కన్యల వివాహమాడఁదలంచియో పరమతస్వీకరణ మొనర్చుచున్నారు. అంతియేకాని పరమత స్వీకరణము వలనఁ బరమేశ్వరదర్శనము శీఘ్రముగా లభించునని కాదు.

ఒక సంఘమున నొక లోపమున్నఁ బరసంఘమున నాలోపము లేకపోవచ్చును. కాని వేఱొక లోపముండవచ్చును. అట్టి యెడ నమ్మదగ్గది గ్రిందఁబరున్నను నయ్యదగ్గది నేలఁ బరున్నను నొక్కటియే కదా!

హిందూదేశములోఁ బెక్కుమతములు గలవు. అవి హిందూమతము, పారసీకమతము లేక జొరాష్ట్రియను మతము, బౌద్ధమతము, క్రైస్తవమతము, మహమ్మదీయ మతము, సిక్కుమతము మొదలగునవి.

అన్నిటికన్న హిందూమత మతిప్రాచీనమైనది. దీనినే వైదిక మతమందురు. ఈమతగ్రంథములు వేదములు. ఈ మతాచార్యులు మహర్షులు. ఆవేదముల ననుసరించి వ్రాసిన షడ్దర్శనములు, స్మృతులు, పురాణములును గూడ మత గ్రంథములే. ఈమతములో నంతశ్శాఖలుగలవు. అవి ౧ అద్వైతము, ౨ విశిష్టాద్వైతము, 3 ద్వైతము. ఈశ్వర తత్త్వమును గూర్చియు మోక్షమును గూర్చియు మాత్రమే యీ మతాచార్యులకుఁ బరస్పరభేదముగలదు. కాని సాధన భేదము గానరాదు.

ఇం దద్వైత మతస్థాపకుఁడు శ్రీశంకరాచార్యుఁడు. ఈయన క్రీ. శ. 8 వ శతాబ్దివాఁడు. విశిష్టాద్వైత మతస్థాపకుఁడు రామానుజాచార్యుఁడు. ఈయన క్రీ. శ 12 వ శతాబ్దివాఁడు. ద్వైతమతస్థాపకుఁడు మధ్వాచార్యుఁడు. ఈయన క్రీ. శ. 13 వ శతాబ్దివాఁడు.

ఈ మతత్రయములోఁ బాశ్చాత్య తత్త్వజ్ఞులచేఁ గొనియాడఁబడిన దద్వైతమే. అనఁగా నీశ్వరతత్త్వమును మోక్షమునుగూర్చి శంకరాచార్యులవారు సేసిన సిద్ధాంతమే యెల్లవిధముల శ్రేష్ఠమని వారంగీకరించిరి. వివేకానందస్వామి అమెరికా ఖండములోని చికాగోనగరమున జరిగిన ప్రపంచ మతసభలో (Parliament of religions) నద్వైతమును గుఱించి యుపన్యసించి వారికి హిందూమత సిద్ధాంతముల నెఱుకపఱచి వారిమెప్పునకుఁ బాత్రుఁడయ్యెను. అత్తరి జాలమంది యాతనిసిద్ధాంతము నంగీకరించి తమ క్రైస్తవమతమును వదలి హిందూమతమును స్వీకరించిరి. అనఁగా వారి యభిప్రాయములను మార్చుకొనిరి.

ఈ యద్వైత మతములో నార్యమతము, బ్రాహ్మ మతము నను మరిరెండు తెగలుగలవు. ఆర్యమతస్థాపకుఁడు దయానంద సరస్వతి. బ్రహ్మమత స్థాపకుఁడు రాజా రామమోహనరాయలు. ఇవిగాక చైతన్యమతము, రాధాకృష్ణ మతము నని మరిరెండు తెగలుగలవు.

జొరాస్ట్రియను మతముగూడఁ జాలఁ బ్రాచీనమైనది. జొరాస్ట్రియను లార్యసంతతివారు. వీరిమత స్థాపకుఁడు జరతుష్. ఈ మతస్థులు, హిందువులవలెనే సూర్యాగ్నులను గొలుతురు. వివాహములలోఁ బసుపుఁ గుంకుమములు ధరింతురు. వీరిమతగ్రంథము జందవేస్తా. వీరిలోఁగూడఁ బెక్కంతశ్శాఖలుగలవు.

బౌద్ధమతము పరమప్రాచీనమైనది. దీని ప్రధానాచార్యుఁడు బుద్ధుఁడు. ఇతఁడు రమారమి 2500 యేండ్లనాఁటివాఁడు. యజ్ఞయాగాదులలో నీతఁడు పశుహింసగూడదనెను. వేదవిరుద్ధముగా నీతఁడు పశుహింస నిషేధించుటవలనఁ దరువాతి వారాతనిని నాస్తికుఁడనిరి. కాని బుద్ధుఁడు నాస్తికుఁడు గాఁడు. ఆతఁడాస్తికుఁడు. ఈమతగ్రంథము లన్నియుఁ బాళీ భాషలోఁగలవు. ఈమతాంతశ్శాఖయే జైనమతము.

క్రైస్తవమతస్థాపకుఁడు క్రీస్తు. ఈతఁడు 1935 సంవత్సరముల క్రిందటివాఁడు. ఈమతస్థులీతనిని నీశ్వరపుత్రుఁడని భావింతురు. వీని యారాధన మూలముగాఁ బరమేశ్వర ప్రాప్తి కలుగునని యీమతస్థుల విశ్వాసము. ఈ మతస్థులలోఁ బెక్కంతశ్శాఖలుగలవు. వీరిమతగ్రంథము బైబిలు.

మహమ్మదీయ మతస్థాపకుఁడు మహమ్మదు. ఈతఁడు క్రీ. శ. 745 కాలపువాఁడు. ఈమతస్థులలో 75 అంతశ్శాఖలు గలవు. వీరిమత గ్రంథము ఖురాను, షరీఫ్.

సిక్కుమతస్థాపకుఁడు గురుగోవిందనానకు. హిందూ మహమ్మదీయమతముల సాంకర్యమే సిక్కుమతము. వీరిమత గ్రంథము గ్రంథసాహెబా. వీరిలోఁగూడ నంతశ్శాఖలుగలవు.

ఈపైనిఁ దెలుపఁబడిన [illegible]మతము లన్నింటిలోఁ గూడ నంతశ్శాఖలు గలవు. ఇవియెల్ల యేర్పడినవన్నచో వారివారి మతగ్రంథములను భిన్నభిన్నముగా నర్థముసేసికొనుట వలననే యేర్పడినవి.

# 18. అహింస.

సనాతన ధర్మములలో మొదటిది యహింస. 'అహింసా పరమోధర్మః' యనియు, 'ఆత్మవత్సర్వభూతాని' యనియు శాస్త్రములు వచించుచున్నవి. ఇది మన హిందూమతస్థులచేతనే కాక ప్రపంచ మతస్థులచే నత్యుత్తమ ధర్మముగా నంగీకరింపఁ బడినది. జీసస్ క్రైస్తు, బుద్ధుఁడును నీధర్మమును తమ మతగ్రంథములలో మొదటిపాఠముగాఁ జెప్పిరి. హింస యనఁగాఁ బ్రాణముగల యొక జంతువును జంపుట యే కాదు. ఒక ప్రాణి మనస్సు నొప్పించుటయు హింసయే. ఈ హింసలలోఁ బితృవధాదులు ఘోరపాతకములు. ఎట్టి సంకటములు వచ్చినను హరిశ్చంద్రుఁడు సత్యమును విడువని విధమున మనుష్యుఁడు హింస సేయఁగూడదని యహింసా సిద్ధాంతముయొక్క యర్థము.

కాని మనలను వధించుటకో మనస్త్రీల మానభంగముఁ గావింపనో మనద్రవ్య మపహరింపనో మనగృహదాహము సేయనో యువఁజేవి చేనెటి కత్తిచేఁబూని సన్నద్ధుఁడగు వాఁగా నాత్మరక్షణము సేసికొనుటకు మార్గాంతరము లేనిచో నాదుష్టునికిఁ దమునోసిలొగ్గి యూరకుండవలయునా ? సామాద్యుపాయములు పనిసేయనిచో దండోపాయమును బ్రయోగించి స్వసంరక్షణము సేసికొంటవోసమా ?

గురుంవా బాలవృద్ధంవా బ్రాహ్మణంవా బహుశ్రుతం
ఆతతాయినమాయాంతం హన్యాదేవా విచారయన్.

గురువు, బాలుఁడు, వృద్ధుఁడు విద్వాంసుఁడగు విప్రుఁడును గానిమ్ము. తన్నుఁ జంపవచ్చు నాతనిని విచారింపక చంపవలయును. అట్టియెడ హింసాఫలమగు పాపము వానికిఁ గలుగదు. వాని యధర్మమే వానిహింసకుఁ గర్తగాని పరుఁడు గాఁడని శాస్త్రముద్ఘోషించు చున్నది. శ్రీరాముఁడు రావణసంహారము సేయుట, శ్రీకృష్ణుఁడు కంసాదులను సంహరించుట మొదలగు లోకరక్షణార్థమగు హింసలు ధర్మమూలకములే. కానీ పాపఫలకములుగావు. రావణవధఁ గావించినందులకై పాపపరిహారార్థము శ్రీరాముఁ డశ్వమేధము సేయఁగోరఁగా వసిష్ఠాదు లక్కఱలేదనిరి. అదిపాపమే కాదనిరి. కానీ శ్రీరాముఁ డాత్మసంతృప్తి కొఱకు యాగము సేసెను. కానీ శ్రీకృష్ణుఁ డెందఱనో రాక్షసుల వధించియుఁ దత్పాపపరిహారార్థము యాగములు సేయలేదు. లోకరక్షణార్థమగు హింస పాపకరము గాదనియే యాయన నమ్మకము.

"శరీరమాద్యంఖలు ధర్మసాధనమ్" అని ధర్మమును సాధించుటకై యెల్లవిధముల శరీరమును రక్షింపవలయుననియుఁ జెప్పఁబడినది. అట్టియెడఁ దనకు హానిసేయు జంతువులను "మాహింస్యాత్సర్వభూతాని, అహింసా పరమోధర్మః" అను వచనముల ననుసరించి చంపక తానా సంకటములఁ బడుటకన్న నాత్మరక్షణార్థమును

లోకరక్షణార్థమును వానిని హింసించుటయే తగును. చూడుడు. లోకములో భ్రూణహత్య మిక్కిలి దుష్ట ముగాఁ బరిగణింపఁబడు చున్నది. కాని తల్లిని రక్షించుటకు మార్గాంతరము లేనపుడు గర్భస్థశిశువునుజంపి మాతృ రక్షణము సేయుట ధర్మము "మా హింస్యాత్సర్వా భూతాని యజ్ఞాయ పశుమాలభేత" (ఏజంతువును జంపరాదు. కాని యజ్ఞార్థము పశుహింస సేయవచ్చును.) అని శాస్త్రము చెప్పుచున్నది. అనఁగా నా హింసవలన నెట్టి పాపమును రాద నియు నా పశువునకును గర్తకును స్వర్గము లభించుననియుఁ బూర్వ మీమాంసకులు చెప్పుదురు.

కాని వాయువులో జలస్థలాదులలో నత్యల్పములై కంటికగపడని (Mycroscope నకుఁగూడఁ గానరాని) జంతు వులను మనుష్యుఁడెంత యత్నించినను జంపకుండుటెట్లు? మనము నడచునపుడు రేయింబవలు జంతువులెన్నెన్నో మన యెఱుకలేకయే మనచే హింసింపఁబడు చున్నవి.

శ్లో. సూక్ష్మయోనీని భూతానితర్కగమ్యానికానిచిత్
పక్ష్మణో౾పినిపాతేన యేషాంస్యాత్ స్కంధపర్యయః.

కన్నులఁ గగపడకపోయినను కేవల తర్కమునకు గోచ రించునట్టివియును రెప్పలు గదలించినంత మాత్రమున హస్త పాదాదులు విఱిగి మరణించు జంతువులు పెక్కుగలవు. వీనిని హింసింపకుండుటెట్లు? మహాభారతములోని ధర్మవ్యాధో పాఖ్యానమున నిట్లు చెప్పఁబడినది.

మ. హాలికుం డెంతయు నోజతోదునఁగ సీరాగ్రంబునన్ జోఁకి ప్రా
ణులనేకంబులు సచ్చు హింసయదియౌనో? కాదో? వేయేల? మ
ర్త్యులు నేలంజరియించుచోఁ బదములంద్రొక్కంబడున్ బెక్కుజం
తులు హింసావిధి గాపసంగ వశమే? ధోషజ్ఞ! యూహింపుమా!

చ. సలిలములుర్వియాకసము సర్వము జంతుమయంబు గావునన్
గలుగు నవశ్యమున్ సకలకర్మములందును హింస హింసకుం
దొలగిన దేహయంత్రమును దుర్ఘటమై నటులుండు నింతయుం
దలపరు హింససేయమని తారువచింతురు గొందఱిమ్మహిన్.

క. పనివడియహింసవ్రతముగఁ
గొని వనముననున్న మునులకుం దొడవదె? హిం
సనము దరుమూలఫల శా
కనిపీడన మదియు హింసగాదొకొ? తలఁపన్.

వృక్షములనుండి ఫలమూలాదులు గోయుటయు హింసయేయఁట. అట్లేని సహింసయెట్లు? వృక్షములకును మనుష్యులకు వలె సుఖదుఃఖాదులు గలవనియు మనుష్యులు నడువఁగల వృక్షములనియు వృక్షములు నడువలేని మనుష్యులనియు జగదీశ చంద్రబోసు యక్షిణీ యంత్రమూలకముగా (Magic lantern) ఋజువు పఱచెను. మనుస్మృతిలో నదే విధముగా "అంత స్సంజ్ఞా భవం త్యేతే సుఖదుఃఖసమన్వితాః" అని వృక్షములకు సుఖదుఃఖము లున్నవని నిర్వచింపఁ బడి యున్నది. అనఁగా నిప్పటి జగదీశచంద్రుని సిద్ధాంతము చిరకాలము క్రిందటనే మహర్షు లంతర్దృష్టివలనఁ గనుగొనిరి. కానిదానినిఁ గ్రియారూపముగా విశేషించి లోకమునకుఁ

బ్రదర్శింపఁ బూనరైరి. మరియు భగవద్గీతాశాంకరభాష్య ములో నిట్లు చెప్పఁబడియున్నది.

శ్లో. కట్టణీ పేషణీ చుల్లీ ఉదకుంభీచ మార్జనీ
పంచసూనా గృహస్థస్య తాభిస్స్వర్గం నగచ్ఛతి.

"కత్తిపీట, రుబ్బురాయి, లేక తిరుగలి, ప్రొయ్యి, నీటిబిందె, చీపురకట్ట, వీనిమూలమునఁ బెక్కు పాపములు గలుగుచున్నవి. వానివలన గృహస్థుఁడు స్వర్గమునకుఁ బోఁజాలఁడు."

అబుద్ధికృతములగు నీహింసలు పై బుద్ధికృతముగా నాత్మరక్షణార్థము చేయు హింసలవంటివికావు. ఆత్మరక్ష ణార్థకమగు హింసవలనఁ బాపములేదని శాస్త్రము వచించు చున్నది. కాని యీ హింసలవలనఁ బాపము రాకుండునా? ఈపాప పరిహారార్థమే సంధ్యావందనాది విధులు గృహస్థున కేర్పడియున్నవి. కనుక.

గీ. హింససేయనివాఁడు లేఁడిజ్జగమున
నొక్కఁడైనను దమ తమ యోపినట్లు
హింసతెరువున కడగట్టి యేగవలయు
నదియు మానెయహింస నానతిశయిల్లు.

కం. ఫలమూలౌషధి శాకం
బులు బసుమృగ తతులు భక్ష్యములుగా భూతం
బులకజుఁడు సేసెనని య
స్ఖలితంబుగ వ్రాయు శ్రుతులుగా దనవశమే?

ఆపద్ధర్మమైనపుడు హింసవలనఁ బాపము సంభ వింపదు. అబుద్ధికృతమగు హింసవలనఁ గలుగు పాపమునకుఁ

బరిహారార్థము దేవతాపూజ విధింపఁబడినది. మరియు క్షత్రియులకు స్వధర్మముగాన వేఁటాడుటయు యుద్ధమొనర్చుటయు పాపకారణములుగావు. ఎట్టిహింస పాపకారణమన్న వినుఁడు.

లోకములో నజ్ఞతచే దేవతాప్రీత్యర్థము జంతుబలి సేయుదురు. స్వజిహ్వాచాపల్య నివారణార్థము జంతుహింస సేయుదురు. అకారణముగా నాయాజంతువులను గొట్టుదురు. ఇట్టివి పాపకారణములు.

క. పితృకార్య యజ్ఞముఖముల
శ్రుతిచోదిత హింసఁగీడు సార నేరదు వి
శ్రుతగుణ ! మాంసము చవిఁగో
రి తినన్ బ్రాణిఁ జెగటార్చు క్రియఁబాపముగున్.

ప్రజాహానిసేయు సర్ప వృశ్చికాదులఁ జంపుట యాపద్ధర్మమగుటచేఁ బాపమూలకముగాదు. కాని బౌద్ధులు, జైనులు మొదలగువా రెట్టిహింసయుఁ గూడదనియుఁ గ్రూర జంతువులగు సర్ప వృశ్చికాదులు కర్మము జాలనివారినే కఱచును. "శివుని యాజ్ఞలేని దేఁచీమయైనఁగుట్ట"దని లోకోక్తి గలదుగదా. కర్మము దప్పింపరాదు.

క. వినుకర్మం బొనరించును
జననము మరణంబు నదియ సౌఖ్యము దుఃఖం
బును గావించుం దన చే
సిన దానిం బడకపోవ శివునకు వశమే ?

అని చెప్పుదురు.

అహింసాధర్మ సముద్ధరణార్థమే క్షమ, శాంతి, దయ మున్నగు గుణము లావశ్యకములుగా వర్ణింపఁబడినవి. కాని యీక్షమాది గుణములు సార్వత్రికములుగావు. ఐహికముగా వీనివలన ముప్పుఁగలుగును. ఈ గుణములు గలవారు పరుల వలన స్వపుత్రకళత్ర ధనాదులను గాపాడుకొనఁజాలరు. అందు వలననే మహాభారతమున

న శ్రేయస్సతతం తేజో నిత్యం శ్రేయసీక్షమా
తస్మాన్నిత్యం క్షమాతాత ! పండితై రపవాదితా.

ఎప్పుడును పౌరుషముగూడదు. ఎప్పుడును క్షమ గూడదు. అని చెప్పబడినది. కనుక క్షమాక్షాత్రములు రెండును మానవున కవశ్యముగా నుండవలయును. ఇట క్షాత్రము స్వాత్మరక్షణార్థ ముపయుక్తమగును.

---

## 19. దైవము - పురుషకారము

క. ద్రుమముల దళకుసుమఫలో
ద్గమముల క్రియఁ గర్మముల నొదవుఁ దత్ఫలముల్
తమతమ తఱిఁ గర్తకు భో
గ్యములై నియతిని శుభాశుభాకారములన్.

వృక్షముల కాయా ఋతువురాగానే దళకుసుమ ఫలాదులప్రాప్తితములయ్యు నుప్పతిల్లునట్లు పూర్వజన్మకర్మ విశేషమున నాయాకాలము వచ్చునప్పటికి నప్రయత్నముగనే

మేలుగీళ్లు సంభవించును. ఏతదర్థ బోధకమగు నొక శ్లోకము గలదు.

శ్లో. భాగ్యాని పూర్వతపసా ఖలు సంచితాని
లోకేఫలంతి పురుషస్యయథైవవృక్షాః.

మరియు "సచదైవాత్పరం బలమ్"అని పెద్దలందురు. వీనినిఁ బట్టి లోకములో నదృష్టము లేక దైవమొక్కఁడే ప్రధానమనియు గార్యసిద్ధికిఁ బురుషకారము లేక మనుష్య యత్నముతోఁ బనిలేదనియుఁ గొందఱూహింతురు.

మరొకచోట.

శ్లో. ఉద్యోగినం పురుషసింహముపైతిలక్ష్మీః
దైవం ప్రధానమితికాపురుషావదంతి.

పురుషకారము వలననే లక్ష్మి సిద్ధించును. అల్పులు దైవమును దానికిఁ గారణముగాఁ జెప్పుదురు.

శ్లో. నలభంతే వినోద్యోగం జంతవస్సంపదాంపదమ్
సురాఃక్షీరోదవిక్షోభమను భూయామృతంపపుః.

పురుషకారము లేనిచో జంతువులు సంపదను బడయఁ జాలరు. దేవతలు క్షీరార్ణవమును ద్రచ్చికాని యమృతమును బొందఁజాలరైరి. అని చెప్పఁబడినది. దీనినిఁబట్టి పురుషకార మొక్కటియే కార్యసిద్ధికిఁ గారణమని యూహింప నవకాశము గలుగుచున్నది.

కాని లోకములోఁ గేవలదైవము వలనఁ గార్యసిద్ధి గలుగకున్నది. "చదువకున్నను నదృష్టమున్నచోఁ బరీక్షయం దుత్తీర్ణుఁడ నగుదును. చదివినను నదృష్టము లేనిచో నుత్తీర్ణుఁ

డనగాను.కనుక నేంచదువవలయునని బాలుఁడు చదువకున్న
చో ఫలితముతప్పిపోవుట యేకదా జరుగుచున్నది.అట్లేయదృష్ట
మున్నచో నాకుఁ బెద్దయుద్యోగము నాయింటికే వచ్చును.
నేనేలపోయి వారివీరికాళ్లు పట్టుకొని దేబిరింప వలయునని
యెంచి ప్రయత్నింపకున్నచో విరుద్ధఫలము కనఁబడుచునే
యున్నది. కనుకనే పురుషకారము లేనిచోఁ గేవల దైవము
వలనఁ గార్యసిద్ధి గలుగదని చెప్పఁబడినది. చూడుఁడు.

క. విను పురుషుఁడు గావింపని
పనులకు దైవమ్మియెట్లు ఫలమొనరించున్
జనములు గార్యమునడపఁగ
ననుకూలతనిచ్చుగాఁక యద్యోఫలముల్.

మరియు బురుషకారములేక కేవలదైవమును నమ్మిన
వాఁడు "దున్నుదినములలో దేశముమీఁదికిఁ బోయి, కోయు
దినములలోఁ గొడవలి గొనివచ్చినవానివలెఁ బరిహాస
పాత్రుఁడగుచున్నాడు.

ఒక్కొక్కయెడఁ గేవల పురుషకారము చేతను
గార్యసిద్ధి గలుగకున్నది. కొందఱు బాలురు గష్టపడిచదివియుఁ
బరీక్షయందుఁ దప్పుచున్నారు. అట్లుకొందఱు విశ్వప్రయత్నము
చేసియు నుద్యోగమును సాధింపలేకున్నారు. ఇయ్యెడలఁ
బురుషకారమున కెట్టికొఱతయుఁ గనఁబడుటలేదు. కాని
కార్యసిద్ధి ఘటిల్లకున్నది. కనుక గేవలదైవ పౌరుషమువలన
లోకములోనెట్టి ఫలమును గలుగదు.

కం. క్షేత్రంబు పురుషకారము
ధాత్రీశ్వర! బీజమరయ దైవము రెండున్
సూత్రపడఁ గూడెనేనిన్
బాత్రంబనుఁగర్మకరుఁడు ఫలమునకెంచున్.

గీ. పౌరుషంబు దైవంబు తోడ్పాటులేక
ఫలముగలిగింప నేరదు పార్థివేంద్ర!
విత్తుసహకారి గాకున్న రిత్తనేల
వంధ్యమగుగాక తా ఫలవంతమగునె?

శ్లో. పూర్వజన్మకృతం కర్మతద్దైవమితికథ్యతే
తస్మాత్పురుషకారేణ వినాదైవంనసిధ్యతి.

పూర్వజన్మమున జేసినకర్మమునే దైవ మందురు. అదిపురుషకారము లేనిచో సిద్ధింపదు. మరియు "దైవంపురుషరూపేణ" దైవము పురుషయత్నమూలకముగా సిద్ధించును. అని నిర్వచింపఁబడినది. కనుక దైవపౌరుషములు పరస్పరాశ్రయములు.

ఎంతయదృష్టమున్నను పౌరుషము లేనిచో సిద్ధి కలుగదు. చూడుఁడు. ఒకరు పెద్దయుద్యోగము నిచ్చుటకు సిద్ధముగానున్నను బురుషుఁడు దరకాస్తయినను బెట్టవలయును. ధనపుసంచి నయాచితముగ మనకితరులీయవచ్చినను మనము చేతినైనఁ జాపవలయును. తుదకు మనవిస్తరిలోఁ బెట్టినపదార్థమయినను హస్తము యొక్కయు దంతముల యొక్కయుఁ బ్రయత్నము లేనిచో మన యుదరమునఁ బ్రవేశించి క్షుద్బాధను దొలఁగింపఁజాలవుగదా!

ఒకొక్కెడ నల్పప్రయత్నము వలనఁ బట్టినంతనే మట్టియు బంగారమయిన ట్లధిక ఫలసిద్ధికలుగ వచ్చును. తత్సిద్ధికి వలయు పురుషకారమంతయుఁ బూర్వజన్మముననే జరిగినది. దైవమచ్చట మిక్కిలి యనుకూలముగా నున్నదని గ్రహింపవలయును. మరొక్కెడఁ "గొండను ద్రవ్వి యెలుకను బట్టిన" ట్లధిక ప్రయత్నమున నల్పఫలము సిద్ధించును. అట దైవము మిక్కిలి యనుకూలముగా లేదని యెఱుఁగవలయును. వేరొక్క యెడ నెంతయత్నము సేసియు నీషత్ఫలమును బొందకున్నాఁడు. అట దైవము సర్వదా విరుద్ధముగా నున్నదని తెలియవలయును. ఇంకొక్కెడ నధికయత్నము సేసి యధిక ఫలమును బొందుచున్నాఁడు. కనుక

శ్లో. ఉద్యమః సాహసం ధైర్యం బుద్ధిశ్శక్తిః పరాక్రమః
షడేతే యత్ర వర్తంతే తత్ర సాహాయ్యకృద్ధరిః.

ఉద్యమము, సాహసము, ధైర్యము, బుద్ధి, శక్తి, పరాక్రమము ననునీయాఱుగుణములు నెటనుండునో యట శ్రీహరియు సాహాయ్యమొనర్చును.

అధిక యత్నమున నల్పఫలము సిద్ధించినఁగాని ఫలమే సిద్ధింపనప్పుడు గాని మూఢులు దేవుని దూఱుదురు. అదిపొరపాటు. పూర్వజన్మమున విత్తనిదే యీజన్మమున ఫలమెట్లబ్బును? దైవానుకూల్యము గలుగుటకు యత్నముతో పాటు భగవదుపాసన సేయవలయును.

మరియుఁ బురుషకారము ఫలమునుద్దేశించి చేయక విధి(Duty) అని యెంచి కావింప వలయును. భగవద్గీతలో

శ్లో. కర్మణ్యే వాధికారస్తే మాఫలేషు కదాచన

(నీకుఁ గర్మ సేయుటయందే యధికారముగలదు. కానీ ఫలమున కధికారములేదు) అని చెప్పఁబడినది. అనఁగా ఫలాపేక్ష లేకవిధిగాఁదలంచి కార్యమునుగావింపుము. వచ్చినా ఫలమనుభవింపుము. లేనిచో విచారింపకుము.

ఒకతూరి పురుషకారము సిద్ధింపలేదని విసువుఁబుట్టి రెండవతూరియు నిదేవిధముగా సిద్ధింపదని యూరకుండ రాదు. మనుష్యుఁడొనర్చిన యన్నికార్యములు నెన్నఁడును సిద్ధింపవు. అట్లు సిద్ధించినచో మనుష్యుఁడీశ్వరుని లెక్క సేయఁడు. మనుష్యునకుఁగలుగు జయాపజయములను లాభాలాభములను బట్టియే మానవుఁడు దన యసామర్థ్యమును గ్రహింప వలయును. ఈశ్వరుని విశ్వసింపవలయును.

కొన్నియెడల "నిధినిఁ ద్రవ్వఁబోగాఁ బిశాచము వెలువడి"నట్లు మన ప్రయత్నములకు విరుద్ధఫలము గలుగుటగూడఁ గలదు. ఒక కవి

గీ. రత్నమని యమ్మఁబో బొమ్మ రాయి యగును;
అతిరసంబని తినఁబోవ నామ్లమగును;
త్రాడని పట్టుకొనఁగ సర్పమయి కఱచు;
చుట్టమని వచ్చి దయ్యమై పట్టుకొనును;

అని చెప్పినాఁడు. ఇట్టియెడలఁగూడఁ బరమేశ్వరుని దూఱక తనపూర్వకర్మమును నిందించుకొని యిప్పుడేని సత్కార్యములాచరించి యుత్తరజన్మమునకు వలసినబీజములు సేకరింపవలయును.

పురుషకారమునకుఁ గోడుపట్టుదల గావలయును. పట్టుదలయె ఫలమును దగ్గఱకులాగును.

శ్లో. నాత్యుచ్ఛ శిఖరో మేరుర్నాతినీచం రసాతలం
వ్యవసాయ ద్వితీయానాం నాప్యపారో మహోదధిః
యోజనానాం సహస్రం తు శనైర్గచ్ఛేత్పిపీలికా
అగచ్ఛన్ వైనతేయో౾పి పదమేకం నగచ్ఛతి.

పట్టుదలగలవానికి నాకాశమంటు మేరుపర్వతము చిన్నదిగాఁ బాతాళము లోతులేనిదిగా సముద్రము పిల్లకాల్వగా దాటఁదగినట్లు గోచరించును. పట్టుదలతో నడచినచోఁ బిపీలికయు యోజనసహస్రము నడచును. నడవకున్నచో గరుత్మంతుఁడు నొక్కయడుగైనను జరుగఁడు. కనుక

శ్లో. ఉద్యమే నహి సిధ్యంతి కార్యాణి నమనోరథైః
నహిసుప్తస్య సింహస్య ప్రవిశంతి ముఖేమృగాః.

పట్టుదలవలనఁ గార్యములు సిద్ధించును. వట్టి మనోరథముల వలన సిద్ధింపవు. నిద్రించు సింగమునోట జంతువులు స్వయముగా వచ్చి పడవు. అట్టి పట్టుదలగలవారే ధీరులు. భర్తృహరి.

శా. ప్రారంభింపరు నీచమానవులు విఘ్నాయాస సంత్రస్తులై
ప్రారంభించి పరిత్యజింతురు విఘ్నాయత్తులై మధ్యముల్
ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ ప్రజ్ఞానిధుల్ కావునన్.

అనెను. వ్యర్థప్రయత్నుఁడైనను బురుషకారము గలవాఁడే శూరుఁడు. కనుకఁ బురుషకారము ముఖ్యము.

---

## 20. స్వయంకృషి.

పాఠశాలలయందును కళాశాలలయందును, బాలు రభ్యసించువిద్య మిక్కిలి కొలఁది. అది దిగ్దర్శనయంత్రము వంటిది. ఇతరమైనవిద్యకది మార్గమునుజూపునుగాని పరిపూర్ణము గాదు. కాని చాలమంది బాలురే పరీక్షయందో యుత్తీర్ణులై విద్యాసారమును ముట్టితిమని మరలనెట్టి పుస్తకమును దెఱవకుందురు.

కొందఱకు విద్యాపిపాస యధికము. చదివిన దానితో సంతృప్తులుగారు. పెద్దపెద్ద విద్వాంసులు వారికాదర్శము. తమయభిమాన విద్యయొక్క యవధినిఁ బొందవలయుననివారి యభిలాష. ఆయాశను బురస్కరించుకొని తమకులభించిన స్వల్పమగు నామార్గము నాధారముగాఁ గొని పట్టుదలప్రధానముగాఁ దమకుఁ జేయూఁత నొసఁగ లక్ష్యము సాధింపఁబూనుదురు. అదియే స్వయంకృషి. బాలుఁడు మహాపురుషులను లక్ష్యముగా నుంచుకొనవలయును గాని యల్పులనుగాదు. వారిచరిత్రల ననుకరింపఁ దొడఁగవలయును గాని యల్పులవి కావు. పెద్దలనాదర్శముగా నుంచుకొని కృషిసాగింప నొకపుడు వారికిఁబలెఁ బరిపూర్ణత తమకుఁ గలుగకున్నను ముఖ్యాంశమైనను బొందఁగలుగును.

స్వయంకృషిచేఁ బయికివచ్చినవారి జీవితమంతయు సాహసకార్య భూయిష్ఠము. (Adventurous Life) ఒకఁడు

క్రొత్తవిషయమును స్వయముగాఁ గృషిసేసి సాధింపనుద్య మించు ననుకొనుము. వానికి మొట్టమొదట నెటుచూచినను నీకారణ్యము. గాఢాంధకారము. ఏప్రక్కను మార్గముగనఁ బడదు. అడుగడుగునకు ముండ్లు, గోతులు, రాళ్ళు, రప్పలు గానఁబడును. అట్టియెడ ముక్కుకుసూటిగా నొకమార్గమును నిర్ణయించుకొని బయలుదేఱిపోవుచు నడ్డమువచ్చిన చెట్లను నఱకుచు ముండ్లను దీయుచు రాళ్ళు తొలఁగించుకొనుచు నొక విధముగ మార్గమును సేయును. కొంతదూరము పోవఁగా సింహశరభశార్దూలాదు లెదురగును. వానితోఁ బోరాడి పోరాడి జయించి యెట్టకేలకు నాయడవిని దాటి రాఁగలుగును. ఆవచ్చిన మార్గము క్షుణ్ణము కాకపోవుటచే మరల నాయడవిలోఁ బ్రవేశించి యామార్గమును సరిసేసి కొనును. ఇంకను గొన్నిలోపములుంటచే మరల మరలఁ బ్రవేశించి చిట్టచివరకుఁ జక్కని మార్గమును నిర్మింపఁ గలుగును. ఇట్లు చిరకాలమునకుఁ దానుద్దేశించిన కార్యమును సాధించును. వానికి నడుమనడుమ నిరాశ, విసువు, చిరాకును గలుగుచుండును. ఒకరికడ విద్యాభ్యాసము చేసినంత కాలముకన్న నాలుగైదు మడుగులు ఎక్కువకాలము స్వయంకృషి సేయుచున్నవానికిఁ బట్టును, కానిమ్ము.

శ్లో. యోజనానాం సహస్రంతు శనైర్గచ్ఛే త్పిపీలికా
అగచ్ఛన్ వైనతేయోఽపి పదమేకం నగచ్ఛతి.

(నడుచుచుండఁ బిపీలికయు మెల్లమెల్లగా సహస్ర యోజనములు నడువఁగలదు. కాలుకదల్పకఁ గూర్చున్నచో

గరుత్మంతుఁడైన నొక్కఁ యడుగేని జరుగఁజాలఁడు) అన్నట్లు కృషిసేయకయే యూరకున్న నేదియును సాధింపఁజాలడు; చేయుచున్నఁ జిరకాలమునకైనఁ గొంతేని సాధింపఁవచ్చును.

మరియు గొందఱకు నెంత చదివినను స్వయముగాఁ దీఱని సందియము లుండును. కొన్నికొన్ని విషయములు సాంప్రదాయ సిద్ధముగాఁ గాని స్వయముగాఁ తెలియవు. కొన్ని విషయములకు ముఖ్యముగా జదువదగిన గ్రంథము లేవియో తెలియవు. అట్టియెడ బాలుఁడు చాల చిక్కులు బడును. అట్టియెడ నాయాపండితుల నెన్నఁడేనిఁ గలిసికొని వారి యుపదేశాను సారముగాఁ గృషిసేయుచు వారివలన సంశయములు దీర్చుకొనుచుఁ దన లక్ష్యమును సాధింప వలయును.

స్వయంకృషికిఁ బట్టుదల పునాదివంటిది. అదిలేనినాఁడు స్వయంకృషి ఫలింపదు. ద్రోణాచార్యునిఁ బ్రార్థించి తిరస్కృతుఁడైన యేకలవ్యుని నీపట్టుదలయే స్వయంకృషికిఁ బురికొల్పి యాతనినిమహాధానుష్కునిఁగావించినది. కొలంబస్ అనువాని నీపట్టుదలయే స్వయంకృషికిఁ బ్రేరేచి యతనిచే అమెరికా కనిపెట్టించినది. మరియు ధూమశకటములు విమానములు, ఓడలు మొదలగు వానినిఁ గనిపెట్టిన వారికెల్ల నీపట్టుదలయే పట్టుగొమ్మ. అదియే లేకున్న వీరిస్వయంకృషి యెట్లు ఫలించి యుండును? వీరెల్లరును మహారణ్యమును భేదించినవారే. ఈ విధముగా లోకములోఁ బెక్కండ్రీ స్వయంకృషివలననే పెద్ద పెద్దవాండ్రయిరి.

భారతీయ మహర్షులు స్వయంకృషిసేసి యతీంద్రియములగు యూర్ధ్వలోకములు, ధర్మాధర్మములు, పెక్కేల? పరమేశ్వరునే కనుగొనిరి. వారి యనుభవములు, గ్రంథరూపముగాఁ బిమ్మట విరచించిరి. పూర్వుల విద్యయంతయు స్వయంకృషి సాధ్యముకానిచో నొక్కొక్కరు సర్వవిద్యాధురంధరు లెట్లగుదురు? ఎవ్వరును జీవితాంతమును బరుల వద్ద శుశ్రూష సేయుచుండఁ జాలరు. శుశ్రూష సేయఁగల కాలము కొంతవఱకే. ఆకాలమున సాధించిన కొలఁది విద్యనాధారముగాఁ జేసికొని మిగిలిన శాస్త్రములును విద్యలును సాధించిరి.

స్వయంకృషిచే సాధించిన దమ్మిడియైనను మిక్కిలి విలువగలది. తాతతండ్రులు సంపాదించిన దానిని సుఖముగా ననుభవించువానికి నాద్రవ్యముయొక్క విలువ తెలియదు.

స్వయంకృషిసేయువానికి సాధనసామగ్రి చాలఁగావలయును. పుస్తకములు మొదలగువానినిఁ గొనుటకుఁ దగినంత ద్రవ్యముఁగావలయును. అట్టియెడ గ్రంథాలయము వానికి స్వగృహమువలె నుపకరించును. గ్రంథాలయములనే గృహముగాఁ జేసికొని పుస్తకములనే గురువుఁగాఁ జేసికొని స్వయంకృషిచేసి విద్వాంసులయిన పండితులు పెక్కురుగలరు. ఒకరేల? లోకములో నత్యున్నతపదవి నలంకరించిన వారెల్లరును ముఖ్యాతిక ముఖ్యోసము స్వయంకృషి సాగించినవారే.

స్వయంకృషి సల్లక్షణము. ఆలస్య మవలక్షణము. స్వయంకృషి సేయువాఁడు కొంత స్వార్థత్యాగ మొనర్ప వలయును. ఆతనికిఁ జాలాసాధన సామగ్రి కావలయు నంటిని. దానికై యాతఁడు సంపాదించు ధనముతో మిగిలిన యవసరములు ( Wantings ) తగ్గించుకొని కొలఁది కొలఁదిగా సేకరించి యాయాసాధనములు గొనవలయును. గ్రంథాలయములు కావలసిన పుస్తకము లిచ్చుచున్నను గొన్ని కొన్ని గ్రంథములు దానే కొనుట మంచిది. ఏలన నత డొక్కొక్క గ్రంథమును బెక్కుమారు లవలోడనము సేయవలసి వచ్చును. ఏ గ్రంథాలయము నుండియో తీసికొన్నచోఁ జిరకాలము మనకడనుంచుట కాయధికారు లంగీకరింపరు. మఱియు ననేక ప్రదేశములలోఁ గీఁతలుగీసి గుర్తులువెట్టి యప్పుడప్పుడు వానినిఁ బరిశీలింపవలసి వచ్చును. అట్టియెడ నాయా పుస్తకములు సాధ్యమయినంతవఱకు గొనియుంచుకొంటయే యుత్తమము. ఒకకవి స్వయంకృషి సేయువానికిఁ బుస్తకము లుత్తమ మిత్రులనియు మఱొక కవి యుత్తమ గురువులనియుఁ జెప్పిరి.

స్వయంకృషి సేయువాఁడు "క్షణశః కణశశ్చైవ విద్యామర్థంచ సాధయేత్" "జరయు మృతియు లేని జనునట్లు ప్రాజ్ఞుండు ధనము విద్యఁ గూర్పఁ దలఁపవలయు" అను సూత్రము ననుసరించును. అనఁగాఁ దాను కుటుంబపోషణార్థము కార్యాంతర వ్యాపృతుఁడయ్యు దొరకిన యల్పావకాశమును వారివీరితోఁ గూడుగుడ్డలకు రాని

లోకాభిరామాయణము మాటలాడుచుఁ గూర్చుండక తనసాధనను సాగించుచుండును. కాలమెంత యమూల్యమో యాతనికిఁ దెలియును. వ్యర్థమయిన కాలమునుగూర్చి పశ్చాత్తాప పడును.

స్వయంకృషి సేయువాఁడు దీర్ఘాలోచనమున మునిఁగి యుండును. వానికి వివిక్తత్వమత్యావశ్యకము. అతఁడున్మత్తునివలె, బరులకగపడును. అతనికి కృషియే వ్యసనముగాఁ బరిణమించును. నియమించుకొని యున్న యాకృషి సేయనిచో నాతనికి నిద్రపట్టదు. నిమిషనిమిషమునకు నాతఁడు క్రొత్తక్రొత్త యనుభవములను బొందుచున్నట్లెంచుకొనును. తనలో నూతన చైతన్యము ప్రవేశించు చున్నట్లెంచుచుండును. అట్టివానికి లోకము పుస్తకములు గొట్టివేయు పురుగని (Book worm) పేరు పెట్టును.

స్వయంకృషిసేసి యార్జించిన విద్యను విశ్వవిద్యాలయములు కొలువఁజాలవు. అనఁగా నచ్చటి డిగ్రీలు వీరి చదువును గొలువఁజాలవు. కాని వీరి శక్తిని లోకము చిరకాలమునకుఁ గాని గ్రహింపదు. గ్రహించెనా బ్రహ్మరథము పట్టును. పిమ్మట డిగ్రీలు గలవారు వీరికడ శుశ్రూష సేయవత్తురు. వారిని సరస్వత్యవతారముగాఁ బూజింతురు. తమ్ము వారికడ దివిటీవద్ద దీపములనుగాఁ దలంతురు.

---

(ఉపాధ్యాయులీ క్రింది ఖండకావ్యములను బాలురకు బోధించి వారిచే వానిని గద్యమున ( Para Phrase ) వ్రాయింపవలయును.

## 21. శిలాదృశ్యము.



గీ. బలిమినిజయించి వర్షాతపముల శైల
శిఖరమునఁగూరుచుండి నిశ్శిథిలమైన
మౌనముద్రనుగొని తపోమగ్నుఁడైన
గండశిల పేరిశమివతంసుండుపోలుచు.

గీ. తరులకొమ్మలు దమ్మెంత తారిసిల్లి
యాకుఁబైఁటచెఱంగులఁ దాఁకుచున్నఁ
బతగరవముల గీతముల్ పాడుచున్నఁ
దలఁకఁడావంతయేని నాదాంతిశాలి.

గీ. తన్మహాత్త్వతద్యోగసాధనలువడయఁ
దదుపదేశంబుఁగాంచి నిత్యమువసించుఁ
బ్రతిశయానంబులై చేయుఁబవలుఁజాఁపఁ
జుట్టలుగఁబడి పెనుసిలల్ చుట్టుపట్ల.

గీ. అతఁడెన్నండు యోగసమాధినుండి
మేలుకాంచునో? యని నిర్నిమేషదృష్టి,
బ్రేక్షకుల్ తదనుగ్రహాపేక్షఁబోలెఁ
గాంచుచుందురు గౌతుకోత్కంఠులగుచు.

# 22. కృతజ్ఞత.



గీ. తనకుఁ బ్రాపు నొసంగెడు ఘనులు లేమి
వాడి వఱుగయి నిలువెల్లఁ బోఁడి తఱిగి
ప్రాణముల నన్నిటిన్ బిగఁబట్టి యొక్క
మొక్క బిక్కమొగంబయి పొగులుచుండె.

గీ. తన సమీపంబుగాఁ బోవు జనము నెల్ల
మర్మరారావముల బ్రతిమాలుచుండు
వారి కాభాష రామినో? తగిన శ్రద్ధ
లేమినో? దాని గొడవ నాలింపరెవరు.

గీ. పాపమద్దాని దీనభావంబుఁ గాంచఁ
బ్రార్థనారూప మర్మరధ్వని వినంగఁ
దఱుగుకొని పోవఁగడుపశ్రుసరులురాల
దానిబ్రదికింప విధియని దలఁచినాఁడు.

గీ. ఎరువుఁదోలించి పాదుచేయించి చుట్టు
జలముఁ బోయింప రేపుమాపులఁ జిగిర్చి
నాల్గుదినముల గ్రొంగొత్త నలుపువెలయఁ
గళదిరిగిలాఁతి మొక్కగాఁ గానిపించె.

గీ. ప్రాణములు చేఱుకొని కొంతబలము పట్టి
మ్రానుగట్టి ప్రతిక్షణంబానగంబు

తనఋణంబును దీర్పంగఁ ద్వరితపడుచు
ననలుఁగొనలును దగ వేసికొనుచుఁ బెరిగె.

గీ. సమయ మనుకూలపడ యథాశక్తినదియు
బత్రపుష్పఫలంబుల భక్తిపడక
నొడలు, శాఖాకరాంజలి నునిచిమూర్త
మగు కృతజ్ఞతనాఁగ సర్పణముసేసె.

గీ. నీవయిచ్చితి వీమేనునీదకాని
నాదికాదేది కావలెనన్నఁదండ్రి!
బాససేసెద ననుఁగోసి తీసికొనుము
అనుచు భ్రమరస్వనంబుల ననియెమరియు.

గీ. తనదుసర్వస్వమును నాకెధారవోసి
బ్రతికినన్నాళ్ళులును గాలవశతనొంది
కట్టెయైకాలి బొగ్గయి కట్టకడకు
నుసి నుసిగనఁగు నయ్యది నన్నెకొలిచె.

# 23. మేఘుఁడు.



గీ. తత్పరుండయి కలునీళ్ళు తప్పఁ ద్రాగి
యొడలు మైకంబుఁ గొనఁ దొట్రుపడగ నడుగు
చదలి వీథులఁబడి యూఁగిసాఁగిపోవు
మఱచి మేఘుండు తనదు గమ్యస్థలంబు.

గీ. గుట్టుమట్టును గాంచక బట్టబయలఁ
బరులు వీక్షింతురను కొంకుపాటు గానక
పైఁబడును రాచుకొనిపోవుఁ బట్టుకొనును
కౌఁగిలించును దారకాభోగినులను.

గీ. ఎన్నఁడుంబోవఁ డిల్లాలిసన్నిధికిని
నేఁగు నేఁడాది కెపుడో ? యాదృచ్ఛికముగ
మెలఁత మేల్బంతి యంత నా మెఱుఁగుఁగన్నె
తఱసికూర్ములు నెఱప గ్రుడ్లుఱిమి కసరు.

గీ. ఒంటిపాటున విహరించు చంద్రు మింట
మవ్వపుంగను లచ్చర పువ్వుబోండ్లు
తుంటరితనంబుఁ జూప నింద్రునకుఁ దెలిసి
నిన్నుఁ గొఱత వేసి మేఘ ! దండింపఁగలఁడు.

# 24. ముండ్లకొమ్మ.



గీ. చిత్తవిశ్రాంతికై యూరిమొత్తనంటి
యేపుగాగడ్డిపట్టి యెల్లెడలయందుఁ
బలుశిలాదృశ్యముల నేత్రపర్వమొసఁగు
కొండనెత్తమ్మునం గూరుచుండినాఁడ.

గీ. పగటిపూఁటంతయును బనిపాట్లుసేసి
నలిగి దేహంబు హృదయంబు కలఁగఁబాఱ
వచ్చు కాంతునిఁ బ్రియురాలి పగిది నెదురు
వచ్చి మందమారుతము సేవల నొనర్చె.

గీ. అంత నాకూరుచుండిన ప్రాంతమందె
యున్నయొక ముండ్లకొమ్మపై గన్నువడెను
గాలితాఁకుల నదినాడు కాలిఁదాఁకి
జరుగు వెనుకకుఁ దాఁకును మరలసాగి.

గీ. రోసి యద్దాని నవలకుఁ ద్రోసివేసి
లాఁతికొమ్మల దోపినన్ లావుమెయిని
వచ్చి నాకాలి చెంగట వ్రాలుఁగాని
శిష్టతరు శాఖలందునఁ జిక్కుగొనదు.

గీ. శ్రద్ధవహియింప నైతిఁ బ్రథమమందు
దాని వ్యాపారములకు నర్థంబుగాక
చూడఁజూడంగ నది తనగోడుఁదెలుప
నన్నువెంటాడు చున్న చందమునఁదోఁచె.

గీ. అకట ! నా బ్రదుకెంత హేయంబు ? నరుల
చరణముల నంటనైన నోచంగనైతి,
నెట్టకేలకుఁ దాఁకినం దిట్టిపోసి
యావలను గెంటివేయుదు రలుకఁబూని.

గీ. అందచందంబు లసలె శూన్యంబు లిఁకను
సరసభావంపుఁ బేరి వాసనయు నాస్తి
మాలనింగన్న శ్రోత్రియు మాద్రి నన్ను
దవ్వుదవ్వుల నే కాంచి తలగుచుంద్రు.

గీ. ఇట్టి నీచంపు బ్రతుకు నే నింక బ్రదుకఁ
జాల మరణించి పుష్పవృక్షంబుగానో
ఫలతరువుగానో ? జన్మించి యులమిఁగాంతు
ననువిడిచి శాపమోక్షం బొనర్పవన్న.

గీ. అనుచు సంతప్త చిత్తమై మనసు చెదర
నెండిరాలెడు నాకులపిండు కతనఁ
జెన్నుదఱిగిన మొగముతో నన్నుఁగనుచు
మూఁక భాషల బ్రతిమాలె బ్రోల నిలిచి.

గీ. పాపముద్వాని దీనభావంబుఁ గాంచఁ
దఱుగుకొని పోవఁగడు పెడ తెఱపిలేని
ప్రార్థనా రూపమగు బాధపడఁగ రామి
శాపమోక్షం బొనర్చితి జాలిఁబొంది.

(కావ్యమంజరి.)

## 25. సెలయేఱు.

గీ. అలలచేతుల నిఱుఁగెలంకులకు నొ_త్తిఁ
బడిన రీతిగఁ దగుఁ జెట్లనరుస, లల్ల
వానితాఁకుల గగ్గుఱుపాటుగొన్న
పొలుపు వహియింపఁ జక్కఁగా మ్రొగ్గఁదొడిగె.

గీ. వాంశికనికుంజకము లేలపాటపాట
శరవణము పిల్ల నవ్వుల సన్న సేయఁ
గానఁబడునట్లు తమ మోఱకము తెఱంగు
దారి నరికట్టి పెనురాలు బారు దీర్ప.

గీ. మలయపవనాంకురములకు మనసుగదల
నడవిపువ్వుల వేణియందలవరించి
నురుగుగందంబు నెమ్మోను మెఱయనలఁది
యంచపూఁబోండ్లతో మాటలాడుకొనుచు.

గీ. ప్రక్క ప్రక్కల కొదుఁగుచు వారి కెల్లఁ
దావక ప్రేమరాజ్యంబు ధన్యజన్మఁ
డైన వేనికి గు_త్తకీయంగఁదలఁచి
యేగెదో! తెల్పఁగదె! సెలయేటిబోటి!

గీ. నిన్ను నాదు కవిత్వమందిరమునందు
నిలిపి స్వాగత మర్పింతు; నేను గవినిఁ
బ్రకృతి సౌందర్య చిత్కళోపాసకుఁడను
సుకృతవశమున నిన్నుఁ జూచుటలభించె.

# 26. చంద్రుఁడు.



గీ. అల్ల మిన్నేటి తీరంబునందుఁ జెలువు
గులుకు మొగిలుకొండల నున్న కోనలోనఁ
బొలుచుచున్నది యొక్క తపోవనంబు
చెలఁగుఁ జందురుఁడను ఋషిశ్రేష్ఠుఁడందు.

క. పరిశుద్ధుఁడు సర్వకళా
పరిపూర్ణుఁడు, సుందరుండు, ప్రాప్తవయోవి
స్ఫురితుండు, ప్రపంచతమో
హరణసమర్థుండు వెలుఁగునతఁడున్నతుఁడై.

గీ. కనులఁగప్పంగ నిండు జవ్వనపుఁ బొగరు
పైఁబడఁగఁ బాఱు రోహిణీపంకజాస్యఁ
గరములం దోయి దాలకుఁ; గాని యాతఁ
డెట్టి ధృతిమంతుఁడో! కౌఁగిలియఁబోఁడు.

గీ. అలరు సాయాహ్నములయందు నాశ్రమంబు
నారుబయలునఁ గూర్చుండి యద్భుతముగఁ
దారకా శిష్యులకుఁ దత్త్వదర్శనములఁ
బండువెన్నెలపేర నుపన్యసించు.

గీ. ఆయుపన్యాసమందలి యంశములకు
సంశయములెల్లఁదీఱఁగా సంతసించి
నిర్మలతుషారమిషమున నింగి నుండి
బాష్పములు రాల్చుచుండిరి వారుగనుల.

# మందమారుతము—ఝంఝామారుతము.



౧

సీ.॥ తన సహస్రామృతకరాబ్జతతిని జాఁచి
ప్రకృతిమాత స్వకీయపుత్త్రికలఁ బ్రీతి
యొలుకఁ గౌఁగిటికిం జేర్చుచున్నదేమొ ?
స్వర్గమునుబొంది నందనవనమునందు
నమర యువతుల కేళీవిహారములకు
మరగి తత్కథల్ వర్ణించు సరసకవుల
యమలరసవత్ప్రబంధ పద్యంబులేమొ ?
వలపుఁగొనియున్న నూత్నదంపతుల భావ
బంధురమగు రహస్యంపు భాషలేమొ !
దట్టముగమింట వ్యాపించి మొట్టమొదట
ఖండఖండంబులై క్రమక్రమముగాను
గరఁగి కరఁగి యణుత్వంబుఁగని యగోచ
రంబులయిపోయిన వలాహకంబులేమొ !
పటుతిరస్కరిణీ పరిభావమున డాఁగి
పైఁటచెఱఁగులఁ దాఁకు స్వర్వనితలేమొ ?
పటుతిరస్కరిణీ పరిభావమున డాఁగి
పైఁటచెఱఁగులఁ దాఁకు స్వర్వనితలేమొ ?
కానిచో నింత హాయియుంగాని యింత
కమ్మఁదనమింత మెత్తందనమ్ము, నింత

చల్లఁదన, మింత మోహాతిశయముగాని
మానవులకిచ్చునే ? మందమారుతములు
ఎవఁడు కల్పించె వీనికి నిట్టి మహిమ ?

౨

ఓమరుద్దేవ! విశ్వమహోత్సవంబు
నెఱపుదువు సౌమ్యమూర్తివై నింగిమెఱసి
యట్టి తఱులందు లేఁడు నీ యట్టిఁడనుచుఁ
బ్రజలు నతిమిత్రునిను జగత్ప్రాణుఁడవని
కాని యున్నట్టులుండి యకారణముగ
మిక్కిలి భయంకరముగా మేనువెంచి
తరులఁ బెఱుకుచు సౌధముల్ విఱుఁగదన్ను
చిండ్లకప్పులు లేపుచు నెల్లకొండ
లూఁచముట్టగఁ గదల నూర్పులూఁపి
వేయుదువ; యంతకంతకుఁ బెరుగనోడలు
మీనుఁగుంబెంట జేయుచు విశ్వమెల్ల
మ్రింగ వేమొగంబుల హుంకరించుకొనుచు
వచ్చుచున్న చందంబునఁ గన్పడెదు తృటిని
మరియొకప్పుడు వహ్నితో మైత్రిసేసి
చేతనుండు లేశముఁ బాపభీతి లేక
లోకసంహారమునకుఁ జాలుదువు మిగుల
బాల్యదశయందు నినుఁగన్న వారలెవరు

నిట్లగుదువంచుఁ గలనైన నెంచియుండ
రీవు కంటికిఁ గాన్పింప నిట్టివేళ
జనులు కడకండలుగ నిన్నుఁ జలుపకుంద్రు?

3

ఒడ లెఱుఁగని సివమెత్తి పుడమిఁ బొడు
పఱచి తుదకుఁ బశ్చాత్తాపబడుచునున్న
కరణి నుఱుముల యెలుఁగెత్తి తెర తెరలుగ
వాన కన్నీరు వరదలై పాఱుచుండ
నెవ్వరికి నాపఁగారాక యేస్తు; కాని
యేమిలాభంబు గలుగు నీయేడ్పుచేత
నష్టముంగొన్న బీద జనంబులకును?

౪

అట్టి సుప్రసన్నాకృతి నట్టిమృదుళ
సరళ సుస్వభావుఁడ వట్టి శాంతమతివి
కాంచుచుండంగనే యిట్లు కాలమృత్యు
వునకు నపరావతారంబవో! యనంగ
నుగ్రమూర్తివై చరియించుచుందువేల?

# 28. కోకిల.

౧

గీ. ఆ వసంతు నాస్థాన గాయకవతంస !
స్వాగతము నీకుఁ గోకిలా! స్వాగతంబు
చాలకాలంబునుండి దర్శనము లేదు
క్రొత్తరీతులు నేర్వంగఁ గోర్కెపుట్టి
చనితివే యల్ల కిన్నరాంగనలకడకు ?
గానమునఁ గ్రొత్తలేమేనిఁ గఱచినావె ?
పాడు మొకపాటఁ జెవ్వుల పండువుగను.

౨

నిరుటి యీ దినముల వింటి నీదుపాట
గున్నమామిడిదగ్గఱఁ గూరుచుండి
మరల నటువంటి పాట భూమండలమున
వినమిఁ జెవ్వులు త్రుప్పు వట్టెను సఖుండ !
గున్నమామిడిఁ జూచుచునున్నయప్పు
డెల్ల నానాఁటి నీపాట స్మృతికివచ్చి
తియ్యత్రేఁపులు మిక్కిలి త్రేన్చుచుందు.

౩

భవ్యముగ మావిఁ గూర్చుండి పాడుచుండ
నీదు గీతామృతంబు ఘనీభవించు
నేమొ ! లేకున్నఁ దద్రుచి యెట్లు గలుగు

మావిపండ్లకుఁ? దీవెలుంద్రావు నేమొ!
లేనిచో నేలపువ్వులం దేనెలూఱు?
వాతములు మున్నునో? కానిపతుమందు
నంత చల్లఁగ వీచునే? హాయిగనుర.

४

వినఁగ వినఁగ భవద్గానమును సపూర్వ
భాషయందున్న ప్రకృతి కావ్యంబునందుఁ
గ్రాలు రసఘట్టములను బారాయణంబు
సేయుచున్నట్లు నాకుఁ దోఁచెదవు పికము!
నీవు లేకున్న ఋతువులు నిశ్చయముగఁ
బ్రియుఁడు పరదేశముననున్న ప్రియలుసుమ్మ!
నీవు లేకున్న దేశంబు నిశ్చయముగ
వాక్కుపడిపోయిన సుమగ్రి పండితుండు.

# 29. పుష్పాపచయము.

మ. మకరందంబుస్రవింపఁగాఁ, బరుగిడన్ మందంబుగామారుతా
ర్భకముల్ పైఁబడి, విచ్చియున్నకుసుమవ్రాతంబునామధ్యఁబ
త్త్రకదంబంబులు నేత్రపర్వమగుచున్ రాజించుచున్నట్టివృ
క్షకమున్ జూసి యొకండు గోయఁదొడఁగెంగాఁ బుష్పముల్
కాంచితిన్.

మ. కనుచుండంగనె త్రెంపిమొల్లవిరులంగల్పించెఁ జూఁజెట్టునూ
తనవైధవ్యముఁగొన్న బాలగ దయా దాక్షిణ్యముల్
మాని, యా
తనికిక్రౌర్యముకాదుగూడదనిబోధల్ సేయదో? యంతరా
త్మనిగూఢంబుగ, నంతరాత్మయును లేదో?వానికే లేశమున్.

గీ. కన్నుదోయిని బాష్పముల్ క్రమ్మె నాకు
నప్రయత్నంబుగా నిట్టులంటి నతని
నేమి దుర్బుద్ధిరా? యిది యిట్లుసేత
కనులుగుట్టెనే? చేతులుకావె? నీవి.

గీ. తరువులంగల పువ్వులఁ దరులయందె
నిలిపి కనువిందుగా దాని చెలువముఁ గని
హర్ష పడలేవె? సర్వశూన్యముగఁ గోసి
మోడుఁ గని కాని సంతుష్టిఁ బొందలేవె?

చ. భ్రమరము లెంత దుఃఖపడి పాపపు శాపము లిచ్చునో? మరిన్
భ్రమతతి పొత్తు దొంగిలిరి దొంగలటంచెద నెంత యేడ్చునో
తమవగు పుణ్యతీర్థములు తద్దయు రూపఱె నంచు మందవా
తములవి యెంత క్రుళ్ళునో! కదా! గ్రహియింపవు నీవు మూఢుఁడా!

గీ. అయ్య! లక్షసుమార్చనం బాచరింతు
నీశ్వరున కీదినంబున నీసుమములు
చాల; వీయన్ని చెట్లపుష్పములు గోయ
వలయు నింక నటంచును బలికె నతఁడు.

గీ. చెవికిఁ జేదైన యతనిభాషితమును వినఁ
బైనిఁబడి కొట్టి తోటయావలకు గెంట
వలయు నన్నంత కోపంబువచ్చెఁ గాని
యెట్టులో! మ్రింగి వానితో నిట్టులంటి.

ఉ. క్రోలఁగఁ గ్రొత్త తేనియలఁ గుత్తుక బంటిగఁ జేరుటాసతో
వ్రాలుచునున్న తుమ్మెదలఁ బాఱఁగఁ దోలుచు దేవపూజకై
పూలను గోతువో! మొగము ముందటికూటిని దీసివేసి పా
పాలకు భైరవుండవయి వర్తిలుచుంటి వటంచెఱుంగు దే.

గీ. ఇన్నిప్రాణులు దుఃఖింప నేవ లేక
కోసి యీకోమలములైన కుసుమములను
నీశ్వరుని పూజఁ గావించి యేమిఫలము
మూటఁగట్టుదువో? నాకు మూర్ఖ! చెపుమ.

గీ. ఈశ్వరుఁడు గోరునది నీదు హృదయసుమమె
కాని యీ చెట్ల పువ్వులు గావు కావు;
అంతగాఁ గావలయు నన్న నవిగో! యేఱి
కొనుము! రాలినపువ్వులు కోట్లకొలఁది.

గీ. పరిమళించెడు మవ్వంపువిరులు గోసి
జీవకళ లేని రాతిఁ బూజించుకంటెఁ
బూలఁ, బండుల, నాకులఁ, బొలిచి కనుల
విందు సేయుచెట్లకు మ్రొక్క వెఱ్ఱివాఁడ!

చ. అని వచియించునప్పటికి నాతని కయ్యది వచ్చి నేను జె
ప్పినయది ధర్మబద్ధమని పెల్లనుతాపముఁ గాంచి బుద్ధి వ
చ్చినయది; యింక నెన్నటికిఁ జేయనునిట్టియకార్యమేనొన
ర్చినయదిశుద్ధతప్పనివచించెఁగనుంగవఁగ్రమ్మ బాష్పముల్.

# 30. శా ప ము .

సీ. ముక్కారుఁబండుభూములు పచ్చగడ్డియు
మొలవని చవిటిపఱ్ఱులుగ మాఱెఁ
బ్రాణికోటులకు జీవనము లిచ్చుచునుండు
వారిదశ్రేణులు వట్టిపోయె
బండ్లకొలంది నెప్పట్లఁ బండులనీను
చెట్లమొత్తంబులఁ జేవదగ్గెఁ
బిదికినఁ గడవలపెచ్చుగాఁ బాలిచ్చు
నెల్లయూలవాడుంగు లెండిపోయె.

గీ. నోషధులశక్తి యడుగంటె నూచముట్టు
తీసె విజ్ఞానవాహిని తేమమిగుల
నానవాలును గాన్పింప కాఱిపోయె
బొత్తిగా దేహబలరేఖ భూప్రజలకు.

సీ. పుడమిపై దేవతాప్రాజ్యభావముఁగన్న
బ్రాహ్మణతతి పశుప్రాయమయ్యె
లోకకల్యాణావలోకంబుఁ గల్పించు
గ్రహములు దమయనుగ్రహము మానెఁ
స్వాద్యమైనట్టి సుధార్ణవాంతరతరం
గములుప్పు తెట్టెలు గట్టియుండె
ప్రకృతిదేవీకంఠపరిణామహారంబు
విపరీతరీతులఁ బెరిగిపోయెఁ

సీ. చంద్రసూర్యాగ్నులును దమసహజతేజ
ములను వెలిఁగింపకయుఁ గప్పివుచ్చుకొనిరి
కనులు గలిగియు నెదుటిది కనఁగలేక
యెదురుదెబ్బలు తినుచుండి రెల్లమంది.

సీ. అతిథులై యొ ప్రతివాని గృహంబుఁ జొచ్చి
పడయకుంట నాతిథ్యంబుఁ గడుపుమండి
ధర్మదేవత రూక్షనేత్రములఁ గనుచు
శాపమిచ్చెనో? లోకంబశాంతిఁబొగుల.

# 31. అగరువత్తి.



గీ. గొలుసుతీరునఁ, బురిత్రాడువలెను, ద్రాఁచుఁ
బాముపిల్లలకరణి, స్తంభంబుపయికిఁ
బ్రాకిపోవుచునున్న తీవలతెఱఁగున
నతివయలకలువలెఁ బొగ లతిశయిల్లు.

గీ. కావలయునేని నెవనికైనఁ గాని యెట్టి
సమయమునఁగాని తన్ను దగ్ధముగఁ జేసి
పరిమళింపించి కీర్తిధూపముల దెసలు
సంతతమును వానికి మహోత్సవముఁ గూర్చు.

ఉ. గాలికిఁ దాండవించుచుఁ దగం బ్రసరించెడు జమ్మునాగులం
బోలెను, దూదినేకుతఱిఁ బొల్చెడుపింజలమాడ్కిఁ గానుపః
కాలపుమూడమంచుసరిగా దెసలన్నియు నాక్రమించి స
ర్వాలయభాగముందనమయంబుగఁ జేయునువత్తిధూపముల్.

గీ. గాజుకుప్పెఁ గట్టఁగా నుంపఁ బ్రక్కల
కొరగి వెడలు పొగల వరుసతోడ
గాలిఁ గదలు నాకుగములతో వ్రాలిన
లేఁతవెదురు పొదరు రీతి వెలుఁగు.

# 32. వ ర ము .



సీ. తినుటకున్నట్టి దానితోఁ దృప్తిఁబొంది
పరులభాగ్యంబుల కసూయపడుటమాని
ఆస నందని పండ్లకు నఱ్ఱుసాచి
కలిమి మొదటికి మోసంబు కలుగకుండ
లేనిపోని తంటాల జోలికినిఁబోక
కలిమియో! గంజియో! త్రాగిసౌఖ్యముగనింటఁ
గడుపుఁజల్ల బొత్తుగాఁ గదలకుండ
శక్తిగొలఁదిగఁ బరులకు సాయపడుచుఁ
దగనవశ్యంబులగు పదార్థములుమాత్ర
తనకుఁ దానయి గడియించు కొనఁగఁజాలి
సరసవిద్యాలతాంగితో సౌఖ్యపడుచుఁ
బెలుచహరి కీర్తనంబుఁ గావించుకొనుచుఁ
బరులచేఁ జూడఁబడకయు నెఱుఁగఁబడక
పంకమునయందుఁ గాల్జారి పడుటలేక
నిర్విచారంబుగాఁ బ్రొద్దు నెట్టుకొనుచు
బ్రదుకఁగానాకునో దేవ! వరమునిమ్ము.

# 33. కృతఘ్నత.



మ. నినుదర్శింపనెనీయొసంగుకనులన్ నీయన్యముంజూచుచుం
టిని; నిన్నేనిలుపంగనిచ్చిన మదిన్ నీభిన్నమున్ నిల్పుచుం
టిని;నీపూజకెయిడ్డ హస్తయుగమున్ నీలాఁతిబూజింపఁగా
వినియోగించికృతఘ్నతన్ నెఱపితిన్ విశ్వేశ!మన్నింపుమా!

మ. నినుఁబాడంగనె నాకు నేర్పితివి వీణన్ దానిపైనొక్క కీ
ర్తనమేనిన్ నినుఁగూర్చిపాడియెఱుఁగన్ శ్రావ్యంబుగానీకు; దే
వ! నితాంతంబుదురాశనైనటునిటున్ బర్వెత్తుదున్ నీదుద
ర్శనమున్ రోసి;కృతఘ్నతన్ నెఱపితిన్ సర్వేశ!మన్నింపుమా!

గీ. నీవొసఁగు జీతబత్తెముల్ నెమ్మిఁగొనుచు
నీదు కొలువును నొకనాఁడు నేనొనర్ప
జీతమును నాకు నింక హెచ్చింపవనుచు
సిగ్గు దిగఁద్రావి నిన్ను దూషింతునెపుడు.

గీ. నీ సమక్షంబునకు రాఁగ నేను వెఱతు
ప్రభువు డాయంగఁ గొంకు నేరస్థుఁడట్లు
నీ పరోక్షంబునందును నిలువ వెఱతు
మనవి నిను వినా విను దయామతి యెవండు?

# 34. ద్వీపాంతరవాసము.



గీ. భటులు నాపేరుపెట్టి ముమ్మారుపిలిచి
రేను దద్ధర్మసభ కేగి కేలుదోయి
కట్టుకొని పాడ్విపాకుని కట్టెదుటను
నిలిచియుంటిని గుండెలుగొట్టుకొనఁగ.

గీ. వారు నను గ్రుచ్చి గ్రుచ్చి ప్రశ్నములమీఁదఁ
బ్రశ్నముల వేసి దోషిగా నిశ్చయించి
నాకు దీపాంతరప్రవాసంబు శిక్ష
వేసిపంపిరి నేనెంత మొత్తుకొన్న.

సీ. ఒకసారి రెక్కలనూఁగించుచును మింటఁ
బఱచెడు పులుఁగుల బంతిఁగాంచి
ఒక తేప వాత్యాభిఘాతంబులై కడుం
గడుఁ బాఱుతెంచు మేఘములఁగాంచి
ఒకమా రనంతసాగరముభేదించి యా
వలిగట్టుఁజేరు నావలనుగాంచి
ఒకసారి యంత్రసామగ్రిబలంబుచేఁ
జదలఁబర్విడు విమానములఁగాంచి

గీ. తద్గతుల నభ్యసింపంగఁ దలఁచితలఁచి
బిక్కమొగమునఁ బరికించి దిక్కులకట !

దుర్మనాయమానుండనై తొట్రుపడుచు
సంచరించుచునుంటి నీస్థలమునందె.

గీ. ఇంక నీజన్మతోనాకు శిశుదప్పి
నీముఖాంభోజమునుగాంచి యెల్లవెతలు
మఱచి ముచ్చటలను నాడుకొనుచునుండు
భాగ్యమదినాకుఁబట్టునే ? ప్రాణసఖుఁడ !

# 35. పంచవన్నెల చిలుక.



౧

సీ. ఇంబడరు శక్రచాపఖండంబువోలెఁ
తైలబిందువు వడినట్టి తరఁగవోలె
రంగురంగుల పుష్పాలరాశి వోలె
సరసవనలక్ష్మికిం బ్రాణసఖియుఁ బోలె
భావశబలతఁ గైకొన్న స్వాంతమువలె
వివిధవర్ణభూషలు దాల్చి ప్రియునికొఱకు
నుత్సహించుచుఁ గూర్చున్నయువతివోలె
సృష్టిసౌందర్యమంతయు నేకవస్తు
గతము గావింపఁబడినపద్ధతిని మిగుల
ముద్దులను మూటఁగట్టెడు మూర్తితోడ
మోదమున మున్గితేలెడు మొగముతోడ
నయనపర్వంబుఁ జేయుచున్నావు నాకు
స్వాగతము నీకు నో పంచవన్నెచిలుక !

౨

అమరలోకంబు నందు నిత్యము వసించు
చుండి వాహ్యాళికోసమై యుర్వి కరుగు
దెంచు కిన్నరకన్యవో ? యంచుఁదలఁతు

నమ్మఁగాఁజాలఁ బక్షిమాత్రమ్మ వగుట
నే సువర్ణఖండమున జన్మించినావొ?
యేమహర్షి వరంబుల నెలసినావొ?
అహహ! యేపుణ్యనదిఁ దీర్థమాడినావొ?
పంచవన్నెలచిలుకా! వచింపుమమ్మ.

౩

వాహనంబుగఁ గైకొని పంచశరుఁడు
నిన్నుఁ గల్యాణమూర్తిని నిలుపఁబట్టి
కాక త్రైలోక్యవిజయి యై క్రాలఁగలఁడె?
లాంతి పులుఁగైనచో నంత ఖ్యాతిఁగనునె?
నీదు చక్కఁదనంబును నిశ్చయముగ
నపహరించెనొ? యేస్వల్పమైన రతియుఁ?
గానిచో నట్టి యందంబు గలుగు టెట్లు?
నిన్ను యాచించి నీరామణీయకంబు
నెరువుఁ గొనిపోవుచుండుగో సురతరుణులు
మునుల తపములఁ జెఱచెడు పనులకొఱకుఁ
గాక మోహింపఁగా జేయఁగలుగు టెట్లు?

౪

పండ్ల రసమును ద్రాగుటఁ బట్టియేమొ!
అంత మధురంబుగా మాటలాడఁ గలవు;
అంత సుందరమూర్తివి యగుటనేమొ;

అంత ముద్దులుగులుక మాటాడఁగలవు;
ఉల్లమున నంతయుల్లాస మూఱునేమొ!
అంత శ్రావ్యంబుగా మాటలాడఁగలవు
ఆననన్ కాదు; నీదు ప్రత్యంగమరయ
నమృతము స్రవింపఁగా మాటలాడుచుండు.

(పువ్వులతోట.)